# వీరాబాయి

V. Nagabhushanam

(4, 5, 6 ఫారములకు)

(Approved for Class use. Con. List P II P. 131 D 23-5-5

గ్రంథకర్త

మహాకాళి వేంకటేశ్వరరావు B. A., L. T.,

హెడ్ మాష్టర్ - బోర్డు హైస్కూలు

అ[illegible]రిపల్లి.




గోపాల్ అండ్ కో.,

పబ్లిషర్సు - బుక్ సెల్లర్సు

ఏలూరు.



[మూల్యము రు.

# విజ్ఞప్తి

నేఁటి మన విద్యావిధానము మార్పుచెందవలెనని పలుప్రముఖులు ప్రకటించుచుండిరి. భారతదేశము స్వతంత్రమైనప్పటి నుండియు జాతీయ విద్యావిధానము నవలంబింపఁబడుటకై తగు ప్రయత్నములు జరుగుచున్నవి. అట్టిచోఁ బూర్వమునుండియు నేఁటివరకుఁగల పెద్దలచరిత్రములఁ దెలిసికొనుట బాలుర కెంతయు నావశ్యకము.

ఇందు భారతీయనాయకమణియగు 'దాదాభాయి' చరిత్రము విపులముగఁ దెలుపఁబడినది. ఇది కేవలము భాషాజ్ఞానమునే గాక దేశచరిత్రజ్ఞానమును జెంపొందించి, భావికాలపు భారతపౌరుల మంచితరీతిఁ దీర్చి దిద్దుటయం దద్వితీయము కాఁగలదు.

ఇయ్యది ఉన్నతపాఠశాలలందలి 4, 5, 6 ఫారముల విద్యార్థుల కత్యంతోపయుక్తముగ నుండునటుల మృదుమధురముగ రచియించి, శ్రీ మహాకాళి వేంకటేశ్వరరావు బి. ఏ., ఎల్. టి., గారు మా కొసంగినందుల కెంతయు కృతజ్ఞులము.

విద్యాధికారులు, పాఠశాలా ప్రధానోపాధ్యాయులు మా యుద్యమమునకుఁ దోడ్పడుదురని నమ్ముచున్నాము.

—ప్రకాశకులు.

శ్రీ
వేంకటేశాయ నమః

# వీ రా బా యి

## మొ ద టి ప్ర క ర ణ ము

## కవల సోదరులు

క్రీ. శ. 1565 సంవత్సరములో నాశ్వయుజ శుద్ధమం దొకనాటి రాత్రి యారావళీపర్వత ప్రాంతము లత్యంతశోభచే నొప్పుచుండెను. ఆనాఁడు పూర్ణిమ. అనిమిషేంద్రాంగనల సౌధవీథులపై రాజిల్లు పసిడికుండయో లేక రజనీకాంతాలలామ కరంబుల నెగయు కెంపుఁబంతియో యనఁ సంపూర్ణేందుబింబ మత్యంత శోభాయమానంబై నల్దిశలఁ జల్లనికాంతుల వెదఁ జల్లుచుండెను. అయ్యది శరత్కాల మగుటంజేసి హిమాంశు సాంద్ర చంద్రికాజాలమునం దజాండమంతయు ధవళదీప్తి వహించెను. నాఁటి రేరాజు శోభాతిశయమున కోడియో యన నభోభాగమునందలి తారకాచయమెల్ల మందమంద కళల ప్రకాశించుచుండె. మహీరుహ సంతానములెల్ల దమ నాథుఁడగు నోషధీశునకు నమ్రతచే జోహారులిడుచున్నవో యన నవనతపత్రములతో స్థానమాత్రావశిష్టంబు లయ్యెను. శీతాంశు శీతలత్వమున కల్లన బారవశ్యత జెంది శకుంత సంతానంబులెల్లఁ దమ మధురరుతంబులవిడిచి నిజకులాయం బులనొదిగియుండెను. వాపీకూపతటాకంబులనుండు సలిలమును దినకరుఁ డల్లన గ్రహించుగతి నానావిధపుష్పపరిమళంబుల నవ

హరించి గంధవహుఁ డా శైలప్రదేశమునం దంతయు నప్పుడే
మెల్ల మెల్లన విహరించుచుఁ గమ్మని తెమ్మెరల జిమ్ముచుండెను.
హిమాచలమురీతి నెల్లప్పుడును మంచుచేఁ గప్పబడి యుండును
గాన రాత్రి పండువెన్నెలలో నారావళీపర్వతము రజతాద్రిని
గేరుచుండెను. ఆరావళీ పర్వతము లత్యున్నతములు. అభేద్య
ములు. ఘోర మృగసంతాన శరణ్యంబులు. శార్దూలాది
క్రూరమృగనికాయంబుల కత్యంత సాహసోత్సాహము నను
గ్రహించు తరుణమిదియేకదా! ఇట్టినిశాసమయమున నిద్దఱు
రసపుత్ర యువకు లాపర్వతరాజ ప్రాంత మహీరుహచ్ఛాయల
గాలిబాటనుఁ బోవుచుండిరి. గాలి త్రాకుడుచేఁ జెట్లయాకుల
వలనఁ గలిగిన శబ్దములును మృగసంచయముల మూలు-
గులునుఁ దప్ప నా నిర్జనప్రదేశమున నే యితరశబ్దమును విన
వచ్చుటలేదు. ఈ రసపుత్రు లిద్దఱును సమానవయస్కులుగ
నుండిరి. ఆ పర్వతరాజమండలి శీతలత్వమునకు వెఱచిఁ గాఁ
బోలు నా బాలు రిద్ద ఱాపాదమస్తకముఁ దోలుదుస్తులఁ
దొడిగియుండిరి. దుస్తులలో దాగియున్న వారి యంగసౌష్ఠవ
మెంత కోమలముగా నుండెనోగాని వారి ముఖపద్మము
లెంతయు శరత్కాలేందుబింబోపమానములై యుండె. వీరి నొం
డొరుల గుర్తించుట దుర్లభము. ఇద్దఱును సమానరూప విలా
సంబులుఁ గలవారే కావున కవలసోదరులై యుండనోపు.
వీరిలో జ్యేష్ఠుఁడెవరో కనిష్ఠుఁడెవరో చెప్ప గష్టతరము.
వీరిరువు రాయుధపాణులై యుండిరి. కాని వారిలో నొకని కటి
ప్రదేశమునం దొక చిన్న తోలుసంచి గలదు. దీనిలో నేమి
గలదోగాని దానివంక నాతఁడు పలుమాఱుఁ జూచుచుఁ బోవు
చుండెను. వానింబట్టిజూడ నా కోమలగాత్రు లిర్వురు

మార్గాయాసముచే నలసినట్లగపడుచుండిరి. మెల్లగా నా కాంతారమున దంతయు విహరించు గంధవహుఁడీ యువకుల ముంగురులతో ముచ్చటించుచు వారల కిసుమంత శాంతిని గలుగఁజేయుచుండెను. వారేవిషయమును గూర్చియో ముచ్చటించుకొనుచుఁ బోవుచుండిరి. కాని వారిచటికే కార్యార్థ మేగుచుండిరో తెలియదు. పలుమారా పర్వతరాజమునందే దృష్టినిగిడ్చుచు నిటునటుఁ జూడక నడచుచుండఁ గొంతదవ్వేగిన పిదప వారిలో నొకఁడు రెండవవానిఁజూచి "సోదరా! మన మింకెంతదూర మేగవలయు"నని యడిగెను. రెండవ మనుష్యుఁ డేదియో చెప్పెనుగాని యాతఁడు దానిని బాగుగ వినలేదు. అయిన నింకొకసారి ప్రశ్నింపనిచ్ఛలేక నా యువకుఁడట్లే పోవుచు నిట్లు చింతించెను. "ఆహా! సేవావృత్తికడుదుస్సహము గదా! మానవుఁ డెంత సౌకుమార్యముఁ గలవాఁడయిన నెట్టి యుత్కృష్టవంశ సంజాతుండైనను బాల్యమాదిగ భర్మడోలి కలనుంపబడి, చరణంబు ధరణిపై బెట్టనొల్లక నతిగారాబంబున పెరిఁగిన వాఁడైనను విధివశంబున నా సంపదలన్నియు నశింప, నుదరపోషణార్థమై శరీరసౌఖ్యమును విడనాడి యెండనక, వాన నక, దేశంబులుకాని దేశంబులెల్లఁ దిరుగవలసినదేగదా! జీవిత కాలములో నిట్టుండ వేఱుఁగాఁ దలఁపనేల? అయినను రాణా వారి యాజ్ఞను మీఱరాదుగదా."

ఈ రీతి విచారించుచుఁ గొంతదూర మేగ నావీరుల కిద్దఱకు నేదియో యొక శబ్ద మా కాననంబున వినవచ్చెను. అత్యంతశాంతినిఁ బొందుచున్న యా పర్వతప్రాంతమున నా శబ్దము వినవచ్చినందుల కచ్చెరువంది వారు తటాలున వెనుకఁ దిరిగి చూచిరి. అట్లు చూడఁగా వీరికి జాలదూరమున

నెవరో కొందఱ అశ్వారూఢులై, నిండువెన్నెలలో దళతళ మెఱయు కరవాలంబులతో వీరి దెస కేగుచున్నటులఁ గాని పించెను. వారతివేగంబున వచ్చుచుండిరి. తడ వేమియు లేదు. ఇటుజూడ కఠినహృదయునికైన జాలిపుట్టించు ముఖార విందములుగల బాలు రిద్దఱు ; యటుజూడ భీకరఖడ్గపాణులై నిమిషనిమిషమునకును మఱింత దగ్గరకువచ్చు కఱకు తుఱకల దండు. ఆహా ! చంద్రునిగేరు వదనాంభోరుహములుగల యీ రసపుత్ర యువకులిద్ద ఱా తురుష్కుల కరవాలముల కెఱ గావలసినదేగదా ! హా ! కాలవైపరీత్యము ! సుకుమారులై, నడువజాల కడుగడుగునకు నాయాసపడుచు రాజాజ్ఞమీఱ నేరక విధిలేక మెల్లమెల్లగా బోవు నీ పసిబాలుర కేనా యిట్టి విపత్తు ? అయినను దీనదయాళుఁడగు నా సర్వేశ్వరుఁ డీ సౌందర్యమూర్తుల కీసుమంత సాయ మొనరింపకుండునా ? తురుష్కులు వారలఁ జంప నేగుచున్నా రను భీతి వీరి హృత్కమలంబుల ప్రవేశింపకమున్నె యా దండు వారిని సమీపించెను. రసపుత్రు లధికశౌర్యోపేతులు గాన నా బాలు రిద్దఱుఁ దమ నిశితఖడ్గంబులనెత్తి నిశ్చలులై నిలుచుండిరి. రసపుత్రవీరుల కిదియే గదా ధర్మము ! అయ్యో ! అశ్వా రూఢులై, దయ యన నేలేశమున లేని పలుమంది కిరాతు లతో, వాహనంబేదియు లేక భూమి నాధారము జేసికొని యెట్టి కఠినహృదయుని హృత్పేశికనైనఁ జలింపఁజేయు నీ లేఁ బ్రాయపు యువకు లిద్దఱుఁ బోరాడ వలసినదేగదా ! ఎటు లయినను విధివిధానమునకు వేఱువిధము లేదు. తెప్పపాటులో నిరుపక్షములవారును కలయఁబడిరి. పోరాట మతి భయంక రము కాసాగెను. తురుష్కభటు లీ సోదరుల పరాక్రమముఁ

జూచి యత్యాశ్చర్యము నొందుచుండిరి. ఎంతవఱకును దురుష్కులలో ధైర్యము వెనులాగుచున్నదికాని, యూబాలు లిద్ద ఱణుమాత్రమును వెనుకంజ వేయరాయె. అచ్చట నారేయి సగర సరళ సింహు లా తురుష్కులతోఁ బోరాడుట జూచి తీరవలయును. పోరాటము జరుగు స్థలమంతయు రక్తసిక్తమగుచుండెను. ఒకరి వెనుక నొకరు తురుష్కులు భూమిపైఁబడుచుండిరి. కొంతసేపైన తరువాతఁ జాలమంది తురుష్కులు పలాయితులయిరి. ఇట్టి పోరాటములో సగర సింహుని కటిప్రదేశమందలి తోలుసంచి జారి క్రిందబడెను. కాని దాని నాతఁడు కనుగొనలేదు. ఇదియే గొప్ప తప్పిదము. పోరాటము మఱింత భయంకర మాయెను. తురుష్కులు కొందఱా రజపూత వీరుల శౌర్యమునఁ దసూయ గలవారై వారివారి యశ్వముల దిగి యావీరుల దమ సందిటనొక్కి చంపదలఁచి సమీపమున కేగుచుండిరి. కాని వారిని సమీపించు నంతలో నీ వీరులు తమ శాతకృపాణంబులచే నా తురుష్కాధముల గృతాంత నిశాంతమున కంపుచుండిరి. నలువైపుల నుండియు నిశితఖడ్గము లా సుకుమారులపైఁ దాండవము జేయుచుండె గాని యాసోదరులు ధైర్యచ్యుతులు గాలేదు. అడుగు వెనుకకు బెట్టలేదు. అన్ని కత్తులను వారు దిరిగి యెదిరించుచుండిరి. అప్పటికి తురుష్కులసేన చాల భాగము పలుచనాయెను. అంతవఱకును శౌర్యము గ్రక్కుచున్న తురుష్కులు చాలమంది పడిసిరి. మిగిలిన తురుష్కుల మొగంబు లెఱ్ఱవాఱుచుండెను. పలువురతురుష్కుల జంపుటచే వారి శరీరములనుండి పైకెగయు రుధిరధార లన్నియు నా సుందరాంగుల పైఁబడి షోడశకళాపరిపూర్ణ చంద్రబింబము

నపహసించు వారి మొగములం గడు వికారములుగా జేయు
చుండెను. తురుష్కు లందఱును మట్టుమడసి పదిమంది
మాత్రము మిగిలిరి. వీర లా బాలురచేతిలోం బడిచచ్చుట
కిచ్ఛలేక పోరాటమునం దోడినను తోలుసంచి దొరకినందులకు
మిగుల సంతసించుచు బ్రతికియున్న బలుసా కేఁకుకఁ దినవచ్చు
నని దలంచి వారి యూరికేగ నిశ్చయించి పరుగిడుచుండిరి.
ఇట్టి స్థితిలో నా రసపుత్రవీరు లిద్దఱు నా పారుబోతుల నతి
కఠినవాక్యముల నొవ్వజేసి యుద్ధమునకు రండని కేకలిడ
సాగిరి. అపు డెత్తువారిలో నొక్కఁడయినం దిరిగి చూడఁడాయె.
తురుష్కులు కనుపడునంతవఱ కా బాలురు వారిని నిందించు
చునే యుండిరి. తరువాత వారు కొంతదూర మేగి పోరాట
ముచే భృశమ్మును జెన్నుదరిగి యున్నవారు గావున నచ్చో
విశ్రమింప దలంచిరి. కాని మఱికొంత తురుష్క సైన్యమువచ్చి
మరల బాధించునన్న భయముచే దగ్గఱ కనుపించు తోటం
బ్రవేశించి యందొక వృక్షచ్ఛాయ గొంతసేపు పరుండిరి.
పోరాటములో నలసియుండుటచే నొడలెఱుంగక హాయిగ
గుండెపై జేతుల నిడికొని నిదురించుచుండిరి. వారి ముఖ
పద్మములమీఁది యశ్రుబిందు సందోహములు ముత్తెపుసరుల
వలె భృకుటీతటంబుల నొప్పుచుండెను. వీరు నిదురించు
సమయమునఁ దురుష్కులకును వీరికిని జరిగిన పోరాటములో
వీరి ధైర్యశౌర్యాది గుణంబులఁ జూచి మెచ్చి యాదరణాతి
శయంబునఁ గేశముల నివురుచున్న దానింబలె మందమారు
తము వారి ముంగురులతో జెలిమి నొనర్చు చుండెను. తగు
వంతకాలము హాయిగ నిద్రించి యా వీరులు మేల్కాంచిరి.
తోడనే ప్రయాణమయిరి. త్రోవలో నెన్ని యిక్కట్లు సంభ

వించినను వీరు రాణావారి యాజ్ఞ శిరసావహించి మేవాడ్
దేశమున కేగవలయునుగదా! కనుక నా సౌందర్యమూరు
లిద్దఱు దారి నడచుచు బూర్వవృత్తాంతమును చిఱునగవుతో
ముచ్చటించుచు నడుమ నడుమ నాశ్చర్యములఁ జూపుచు
వెళ్ళుచుండిరి. పాప మంత సంతోష వాక్యముల మాటలాడు
నా సగరసింహుఁడు తాను తన తోలుసంచిని పోఁగొట్టుకొనిన
ట్లిసుమంతయైన నెఱుఁగఁడుగదా! తత్పూర్వము తన సంచివంకఁ
బలుమారు చూచెడువా డిప్పుడేల దానివంకఁ జూడడు? దాని
సంగతి మఱచియా? లేక నంతకుముందు జరిగిన పోరాటమున
గెలుపొందిన సంతోషమున మైమఱచియా? కాదుకాదు; పాప
మా సగరసింహుఁడు దాని విషయమై పూర్తిగ మరచియే
పోయినాఁడు. ఒకవేళ సగరసింహుఁడు మరచినను సరళసింహుఁ
డైన జ్ఞాపకముఁ జేయఁడా? పాప మాతఁడుగూడ మరచిపోయి
నాఁడు. అయ్యో! సగర సరళ సింహుల పని యేమికానున్నదో
గదా! వారిద్దఱుల ముచ్చట లాడుకొనుచుఁ గొంత
దూరమేగిన తరువాత వారిలో సగరసింహుఁడు వాడుక
చొప్పునఁ దన కటిప్రదేశమువంక దృష్టి నిగిడ్చి సంచినిఁగానక
'హా! సోదరా!' యని మూర్ఛిల్లెను. సరళసింహుఁ డించుక
మనోనైశ్చల్యము గలవాఁడు గాన నప్పుడు తానుగూడ నివ్వెర
పాటొందకఁ దన సోదరుని మూర్ఛకునైన కారణ మారయఁ
దొడఁగె. నల్దిశలుఁజూడగా నతని కితరు లెవరుఁగానిపించలేదు.
ఇట్టి స్థితిలో నతని కేమియుఁ దోచినదికాదు. అప్పటికి నడి
రేయి మీరియుండెను. సగర సరళసింహుల విపత్తు నెఱిగిన
వాఁడై వారి యవివేకమునుగూర్చి హసించుచుండెనో యన
నిశానాథుఁడు వియద్వీథీమధ్యంబున మఱింత శోభచే నొప్పు

చుండెను. సోదరుని దేహమంతయుఁ దడవి తోలుసంచినిఁ గానక నదియే మూర్ఛకుఁ గారణంబని సరళసింహుఁడు గుర్తించెను. ఎంత మనోనైశ్చల్యము గలవారైనను సంభవించిన విపత్తు ఘోరమైనది గాన నాతఁడుకూడ విస్మయుఁడై యల్లన నిలచెను. కొంతకాలమునకు సగరసింహుఁడు మూర్ఛదేరి తనలో నిట్లు విలపింపఁ దొడఁగె:— "హా! తండ్రీ! సర్వమయా! న్యాయాన్యాయ విచక్షణుఁడవయ్యు 'నహింసా పరమోధర్మ' మను నార్యోక్తిని పూర్ణముగా నెఱిఁగిన వాడవయ్యు, బాల్యమునుండి యేవిధమగు దుష్కార్యమునుఁ జేయనట్టి నన్నా నీవిటుల బాధించుట? ఆహా! నీవెప్పుడును గలిమిగలవారి యెడలనే ప్రేమఁ జూపుచు లేనివానియెడ దయఁజూపుటకు మారు లేనిపోని యిక్కట్టులనుఁగూడఁ దెచ్చి పెట్టుదుగదా! తల్లిదండ్రులు పిన్నవయసునందే మృతినొంద వారి విశ్వాసమునుబట్టి రాణావారు మమ్ములను కొల్వులో నుంచి మా కింత గంజి నిడ మే మెటులనో కాలమును గడుపుచుండ నాస్వల్ప జీవనముఁగూడ నీ నిర్భాగ్యుల చెంతనుండి లాగఁదలఁచితివా? తండ్రీ! ఈ స్వల్పజీవనమునుఁగూడ లాగి మమ్ముల నే చెట్టు నాశ్రయించునట్లు జేసెదవు? లేక నేపుట్ట పాలజేసెదవు? స్వల్ప జీవనమైనను పాడుపొట్టకై మోస మన నెట్టిదో యెఱుఁగక న్యాయము ననుసరించి సదా నీదాసులమా మమ్ములఁగూడ నిట్లు బాధింప నీ యొడిలో నేమిబడునురా తండ్రీ? సకలకష్టములఁ బడుచుండినను మనోధైర్యమును వీడక 'కలకాలము కష్టము లుండునా' యన్న ధైర్యముతో నెట్టెటులో కాలము గడుపు మమ్మా నీ విటుల సాధించుట? నిరుపేదలమై పొట్టల గట్టుకొని శీతాతపతైక్ష్ణ్యంబులకు లోనై

దేశదేశంబులఁ దిరిగి రాజాజ్ఞ నెరవేర్పఁ జూచు మమ్మిటుల బాధింప నీకేమి సిందురా? హా! నిశానాథా! రేయి యంతయు సకలకష్టంబులఁ బడుచుండ నీవు చూచుచుఁగూడ మాకిట్టి యిక్కట్టును తెచ్చిపెట్టితివిగదా? అయ్యో! తురుష్కులు నాకడకు రాకముందే జాగరూకుఁడనై యా సంచిని భద్రముగ నుంచనైతినిగదా! అయ్యో యింకెక్కడి సంచి! ఎక్కడి ప్రాణము! అందలి యుత్తరము నాతురుష్కభటులు తమ పాదుషాగారి కిచ్చియే యుండవచ్చును. సోదరా! మన మింకెటుల ఖేతసింగు నొద్ద కేగఁగలవారము? రాణానాకిచ్చిన యుత్తరమేది యని యడిగిన నేమి ప్రత్యుత్తరమీయగలము? అయ్యో! పొరలివచ్చు దుఃఖభరము నడ్డుకొనజాలక సేవాకృత్యమును మఱచుచున్నానే!".

అని యిట్లు సగరసింహుఁడు విలపించుచు కన్నీటిఁ దుడుచుచు బలుకు పలుకునకుఁ బొంగివచ్చు దుఃఖము నాపుకొనజాలక తన కుడికాలు ప్రక్క నొరలో వ్రేలాడుచున్న ఖడ్గమును గైకొని ప్రాణత్యాగ మొనరింప నెంచుచుండెను. అంతలో సరళసింహుఁడు ఖడ్గమును బట్టుకొని "సోదరా! ఎంతవెట్టివాఁడవు! రజపూతకులమునం బుట్టి తత్కుల భూషణుఁడగు లక్ష్మణసింహునకుఁ దనయుఁడవై పరికించి చూడ మోస మేమియు లేని యిట్టి స్వల్పకార్యమునకే భయమంది యాత్మహత్యఁ జేసికొననేల? అనుజా! యేమి! భయమా? రజపూతకులోద్భవున కెచ్చోనైన భయమను శబ్దము కర్ణ రంధ్రములఁ జొరవచ్చునా? ఏమి! భయమంది యాత్మహత్య నొనర్చుటా? ఆత్మహత్యకన్న నసహ్యాకృత్య మొండొకటి గలదా! ఊరకఁ బొగులనేల? విధిని దూఱనేల? మనము

తిన్నగ మేవాడ్ దేశమునకుబోయి శోతసింహునితో నీవృత్తాంతము విన్నవింతము. ఆతఁ డొప్పుకొనిన సరియే; లేకపోయిన నాతని చేతిలో జావకుండ మన రాణావారియొద్దకేగి మన మచటనే తలఁపడుదన కొఱఁదము. కాన, సోదరా! లెమ్ము. జాలతనంబున వగవనేల?" నని చెప్పి వానినూరడించెను. అంత వారిరువురును లేచి యథావిధిఁ దమత్రోవను బోవుచుండిరి.

---

రెండవ ప్రకరణము

## కో ప కా ర ణ ము

రజపూత వీరులతో బోరాడి చావగా మిగిలిన తురుష్కులు తమకు దొరకిన తోలుసంచిని దీసికొని స్వగృహాభిముఖులై పోవుచుండిరి. వారు తమకుఁ దోలుసంచి దొరకినందుల కత్యంతసంతోషస్వాంతులగుచు నొడలెఱుంగక యొకరిపై నొకరు పడుచుఁ దూలుచు వెఱ్ఱిగీతంబులఁ బాడుచు నభోమండలి భేదించు కేకలవైచుచు పాంథజనుల కత్యంతభయము గల్గించుచుఁ బోవుచుండిరి. ఇట్లు పోవుచు నగరప్రాంతమున కేఁగినతరువాత వారిలో "సంచిని పాదుషాగారి కెవ్వరీయవలయు" నను సంకోచ మొదవెను. అందఱు బాదుషా కాయుత్తరమునిచ్చి కీర్తిని సంపాదింపఁదలచినవారు గానఁ బ్రతిభటుఁడును 'నేనిచ్చెద నేనిచ్చెద' నని అంకెలువేయుచు ముందుకు వచ్చెను. ఇట్లు వారిలో వారికిఁ గలహ మంకురింప నొండొరులఁ బరుషోక్తులాడుకొనసాగిరి. తుదకు వారలందఱును గలిసి "మొదట నా సంచిని గనుగొనిన దెవరో వారే దానిని పాదుషాగారి కర్పింపవలయు" నని తీర్మానించుకొనిరి. వెంటనే

వారందఱుం బాదుషా దేవిడీకడకేగి యచ్చటనున్న భటులతో వారి వృత్తాంతముం జెప్పిరి. అప్పుడు దేవిడీలోపలం బాదుషా తన మంత్రియగు హమీరులాలుతోడను, తదితర భటుల తోడను సుఖాసీనుఁడై యుండి యేవియో కొన్ని రాష్ట్రీయ సంగతులను గుఱించి చర్చఁజేయుచుండె. అట్టియెడ నీ భటుఁడు పాదుషాతో నా తురుష్కుల రాక నెఱుఁగఁ జేయగా వారిని లోనికి రానిమ్మని పాదుషా యాజ్ఞ నొసంగెను. వెంటనే యా భటులు లోపలఁ బ్రవేశించిరి. అట్టి సమయమునఁ బాదుషా వారిని జూచి వారేపనిమీద నటకేగుదెంచిరో కనుఁగొనుమని హమీరులాలునకు సంజ్ఞఁ జేసెను. వెంటనే మంత్రి వారిని జూచి కడుఁ దొందరగా వారు పరువెత్తి వచ్చినందులకుఁ గారణ మడిగెను. వారు తామేదియో పనియుండి నగరప్రాంత మున గల తోటలోని కేగుచుండ రజపూతవీరు లిద్దఱు వారికిఁ గనబడిరనియు, వెంటనే వారిదగ్గఱ కేగి పోరాడి వారినిజంపి వారి యొద్దనున్న తోలుసంచిని లాగుకొని వచ్చితిమనియు జెప్పిరి. తోడనే యా సంచిని దీసి హమీరులాలున కిచ్చిరి. మంత్రి యా సంచి బరిశీలించి చూడ లోపల నొక కాగితము కానవచ్చెను. అద్దాని జూచినంతనె మిగుల నాతురతతో దానిని విప్పి యిటులఁ జదువసాగెను.

"మహారాజశ్రీ సర్దార్ ఖేతసింగు
బహదూర్ సాహెబ్ గారికి.

చిత్తూరు నగరాధిపతియగు యుదయసింహరాణావారు వ్రాయునది. మేము చెప్పినప్రకారము బాగుగాఁ బరిశీలించి నమ్మికగల సైన్యమును శీఘ్రమున తీసికొని రావలయును. ఆలస్యముఁ జేయవలదు. మీరు వచ్చినతోడనే మీతోఁ

గొన్ని విషయముల గుఱించి మాట్లాడవలసియున్నది. కావున సైన్యసమేతులై కాలవిలంబము సేయక బయలుదేఱి రావలయును.

ఇట్లు,

ఉదయసింహరాణా.''

హమీరునిలా యుత్తరముఁ జదివినంతనే సభవారంద ఱత్యాశ్చర్యముఁగలవా రయిరి. పాదుషా యమితాగ్రహమున సింహాసనమునుండి లేచి యతి కఠినవాక్యముల నుదయసింహునిఁ దూలనాడఁజొచ్చెను. సామంతరాజయ్యు, నుదయసింహుఁ డక్బరునొద్ద కెప్పుడును బోలేదు. ఇదిగాక నక్బరు శిక్షింపఁదలఁచిన బాజ్ బహదూరున కుదయసింహుఁడు శరణ మొసఁగె. ఈ రెండువిషయములు నక్బరు హృదయమును గడుఁగలఁచుచుండెను. వీటికిఁ దోడీ వార్త యగ్నిదేవుని కాజ్యముచందంబున, వాని హృదయరోషానలముఁ బ్రజ్వలింప జేసెను. మంత్రియు తదితరులును పాదుషా యమితాగ్రహచేతస్కులయి యుంట గుర్తెఱిఁగి తామా సమయముననేమి మాటలాడిన నేమిసంభవించునో యను భీతిగలవారై యూరక నిశ్చేష్టులై కూరుచుండిరి. తుదకుఁ బాదుషా చిత్తూరు నగరమును ధ్వంసముఁ జేసినగాని మృతినొందనని చెప్పి మరల సింహాసనమునం గూర్చుండెను. ఆయన యాగ్రహమునకు మితి లేదు. అక్బరుపాదుషా మిగులఁ జక్కనివాఁడు. ధైర్యశాలి, సర్వసద్గుణ సంపన్నుఁడు. ప్రజాహితైకతత్పరుఁడు, దయాస్వభావముఁగలవాఁ డయినప్పటికి నితర రాష్ట్రముల నాక్రమించుకొనుటయం దమితాభిలాషఁ గలవాఁడు, అట్టి విషయములో నీ యుత్తర మీతని కంటఁబడ నాతఁ డూరకుండునా?

రాణా తన్ను వైరిగాఁ దలఁపోయుచున్నాఁడని పాదుషా మన
మున బూర్ణముగా నాటెను. వెంటనే యక్బరు చిత్తూరు నగర
మునకు జుట్టుప్రక్కలలోనుండిన గ్రామములలోఁ బనిఁజేయు
చుండిన తురుష్కుల నందఱఁ బిలువనంపెను. ఉదయసింహుని
యెడఁ బూర్ణముగాఁ గ్రౌర్యము వహించెను. తరువాత
పాదుషామంత్రియగు హామీరులాలు నచటనుండ నియమించి
మిగిలినవారికి సెలవొసంగెను. పాదుషా మంత్రితో నాయుత్త
రముఁగుఱించి యాలోచింపఁ దొడఁగెను. హామీరులాలునకుఁ
గూడ నిజముగ నుదయసింహుఁ డా యుత్తరము నెందులకుఁ
బంపెనో తెలియదు. ఉదయసింహుఁడు కడు పిఱికివాఁడని
పేరుపు వెఱఁగినవారు కావున నాతఁడేయిట్టి యుత్తరమును
వ్రాసెనా లేక మఱొకరు వ్రాసిపంపిరా, యన్న సందేహము
వారికి జనించెను. తద్విషయమై వారు విశేషకాల మాలో
చనఁజేయ వారికేమియు గోచరము కాలేదు. తుదకుఁ జేయున
దేమియు లేక రాణా సంతకము క్రింద: గనబడుచుండుటచే
నాతఁడు వ్రాయకున్నను నా యుత్తరమును వ్రాయుట కంగీక
రించెనని తలఁచిరి. పిదప వారు చిత్తూరునగర మెట్టి వృద్ధిలో
నున్నదో కనుఁగొనుటకును, యుదయసింహుఁ డేదైనఁ గ్రొత్త
సైన్యముఁ దయారుఁజేయించెనో చూచివచ్చుటకును గొందఱు
భటులను రహస్యముగాఁ బంప నిశ్చయించిరి. హామీరులాలు
కొంతతడవైన తరువాత 'నేనుదయసింహుఁడే యిట్టి యుత్తర
మును వ్రాసి పంప సాహసించెనని నమ్మఁజాలను. అతఁడంతటి
ధైర్యశాలి కాఁడు. ఆయుత్తరమునకు దిగువనున్న సంతకము
కూడ నాతనిది కా' దనెను. ఈ మాటలను విని పాదుషా
యించుక కోపముగలవాఁడై హామీరులాలుతో మాటాడ

కూరకుండెను. కొంత సేపటివఱకు హమీరుఁడు లేవియో
మాటలఁ జెప్పుచుండఁ బాదుషా వాని విననొల్లకఁ బెడఁ
జెవిఁ బెట్టుచుండెను. ఇట్లు పాదుషా యాగ్రహపూరిత మన
స్కుఁడై యుండుట గుర్తెఱిఁగి యెట్లయినను బాదుషా చెలిమిఁ
సంపాదింపవలయునని తలంచి హమీరుఁడాలుకూడ నుదయ
సింహుని దుర్భాషలాడఁజొచ్చెను. అప్పటికే చాల ప్రొద్దు
పోయెను. నాలుగు వైపులనుండియు చీకటు లజాండము నాక్ర
మించుకొనుచుండె. అంతట నానావిషయములు వదలి వారి
దేవుఁడగు నల్లాకు నమాజ్ చేయుకాలము కాఁగ మసీదునకుఁ
బోయిరి.

---

## మూడవ ప్రకరణము

# పి ఱి కి త న ము

కవలసోదరు లిద్దఱు నెప్పటివలె నా దారిని నడచుచు
బోవుచుండిరి. నిమిష నిమిషమునకును వారికి మేవాడ్ దేశము
సమీపించుచుండెను. మేవాడ్ దేశము సమీపించుచున్న
కొలదిని వారికి మనస్సులో నాందోళన మెక్కుడగుచుండెను.
పాపమా నగరసింహుఁడు, తన సోదరుఁ డేదియో ధైర్యము
నూద విధిలేక మరల నడచుచున్నాఁడు, కాని నిజముగ
నాతనికి శరీరములో నూపిరియేలేదు. ఎంత నూపిరి లేనివాఁ
డయిన మాత్రమేమి? అతఁడు తప్పక ఖేతసింహునొద్ద కేగ
వలయునుగదా! అయ్యో! ఖేతసింగనుమాట యాతని చెవిఁ
బడినంతనే యాతఁడు మూర్ఛఁ జెందునేమో! దారిలో నెన్ని
శ్రమల జెందినను తుదకు గవలసోదరు లిద్దఱును మేవాడ్
నగరములోనికిఁ జొచ్చిరి. ఆ నగరమెంత సుందరముగ నున్న

నేమి? ఎట్టి యైశ్వర్యముం గలదైన నేమి? వారికదేమియు
గోచర మగుటలేదు. వారికెంతయు ఖేతసింగు నొద్ద [illegible]
మను కోరికయే తప్ప మరేవిధమగు భీతియు వారి హృత్పేటికం బట
లదు లేదు. భయకంపితులగు వారికేది చూచినను ఖేతసింగు
సర్దారేమో యను సందియ మొదవుచుండెను. ఇట్టి యువురును
భీతిచే జంచల మానసులగుచు నెటులనో ఖేతసింగు సర్దారు
యొక్క దేవిడీకడ కేగిరి. వీరటకేగి యా ద్వారమునందున్న
వారితో నేమియుం జెప్పంజాలక యూరకుండిరి. పాపము
వారేమని విన్నవింపంగలరు? ఏదైన నొక శుభసందేశముం
దెచ్చితిమని విన్నవింపం గలరా? లేక రాణావారేమైనం
గానుకలనిచ్చి పంపిరని చెప్పంగలరా? అయ్యో! పెదవుల
గదలింపనేర్తురా! పెదవిం గదలించినచో మొదలంటం దుది
వఱకు విషాదసూచక వృత్తాంతమేగాని యానందము గలుగం
జేయునంశ మిసుమంతైన వారినోట వెలువడదుగదా! అట్టిచో
వారిస్థితి వర్ణింపం గష్టతరము. ఇక నూహింపం గష్టతమము.
పాపము వారా ద్వారముకడ కేగి నిశ్చేష్టులై యూరకుండిరి.
ద్వారమునొద్దనే యిటులుండ నిక ఖేతసింగు నొద్ద కేగ వారే
రీతి నుందురో కదా? ద్వారపాలు రందఱును వీరిని జూచి
యత్యాశ్చర్యమునొంది 'మీరెవరని' ప్రశ్నించిరి. వారు తా
ముదయసింహ రాణావారి భటులమనియు నా వృత్తాంతమును
సర్దార్ సాహెబున కెఱుకం జేయుడనియుం బ్రార్థించిరి. ద్వార
పాలకు లాసంగతిని ఖేతసింహునితో జెప్పనాతడు వారిని
వేగమే లోనికి గొనిరండని చెప్పెను. అపుడా యువకులు విధి
లేక సర్దారు సాహెబుకంటం బడవలసివచ్చెను. ఆ సమయమున
వారు నఖశిఖాంతము గడగడ వణకుచు నెట్టులో ఖేతసింగు

సరదారు సముఖమున కేఁగిరి. వీరి ముఖకమలములు వాడి యుంటఁజేసి ఖేతసింగు వారికి సంభవించిన యాపద నెఱింగిన వాఁడయ్యుఁ దెలియనివానివలె వారిని బలుకరించెను. కొంత వఱకు వారేమియుఁ జెప్పలేకపోయిరి. తరువాత గద్గదస్వర ముతో జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగాఁ జెప్పిరి. చెప్పినతోడనే ఖేతసింగు కపటరోషముచేఁ దనపీఠమునుండి లేచి వారి నతి కఠినోక్తులఁ దూలనాడి దన కరవాలముతో వారి మీఁది కుఱుకఁ బ్రయత్నించెను. ఆహా! మూలుగుచున్న నక్కపై దాటిపండు పడినట్లు రజపూత వీరుల కీ నిష్ఠురోక్తుల వలన నెంత సంతాపము కలిగెనో చెప్పనలవికాదు. అయినను పైయధికారితో మారాడ నోడి వారు నిశ్చలులై యూర కుండిరి.

పైఁజెప్పఁబడిన విషయము లట్లుండనిండు. ఇఁక చిత్తూరు నగరములో నున్న యుదయసింహుని స్థితిఁ గనుగొందము. రాణా మంత్రియగు పుష్పమిత్రునితోఁ గూడి పేరోలగమున రాజ్యాంగ విషయికముల గొన్నింటిగూర్చి గాఢాలోచనఁ జేయుచుండెను. ఇట్లుండ గొందఱుభటు లతిశీఘ్రగతి బరువు లిడుచు రాణావారికడ కేగిరి. వారురాగా రాణాకూడ మిగుల తొందరగలవాఁడై వారేకారణమున నంతవేగముగ వచ్చిరో కనుగొన నిచ్ఛగలిగి వారిని బ్రశ్నించెను. వారపుడు సగర సరళసింహులు రాణావారి యాజ్ఞచొప్పున మేవాడ్ నగరో న్ముఖులై వెళ్ళుచుండ దారిలోఁ గొంతదూర మేఁగినతరువాత దురుష్కభటు లడ్డమువచ్చి వారితోఁ జాలసేపు పోరాడి రనియు, పోరెనను సగర సరళసింహు లతిధైర్యముతో వారిలోఁ గొందఱఁజంప, దురుష్కసేన యెక్కువగుటచే వారు లొంగ

వలసి వచ్చినదనియు, తిరిగి వారేగునప్పుడు సగరసింహుని కత్తి ప్రదేశమందున్న సంచిని బలాత్కారముగ లాగుకొని తమ పాదుషా కొసంగిరనియు జెప్పిరి. ఉదయసింహుం డా వృత్తాంతము నంతయు వినుచున్నవాఁడై 'సంచి' యని వినినంతనే సింహాసనములో నొరిగి పడిపోయెను. మంత్రియగు పుష్పమిత్రునకును, తదితర సభాస్థారులకును మొగంబు లెఱ్ఱవారఁ జొచ్చెను. వారిలో 'హా దుర్మార్గులారా!' యని కొందఱును, 'మీకాల మాసన్నమైనదిరా' యని మఱికొందఱును తమ యెలుఁగులెత్తి తురుష్కభటుల దృష్టిదీర నిందించిరి. కొంతసేపటివఱకును రాణావారు మూర్ఛనుండి లేవనేలేదు. తుదకుఁ గుర్చీలో సీడిగిలఁబడుచు లేచి, కన్నీరు మున్నీరై పాఱ దీనవదనుఁడై సభవంక మెల్లఁగా జూచెను. ఉదయసింహు నా స్థితిలోఁజూచి సభవారందఱు లోలోన నాతని పిఱికితనంబున కచ్చెఱువొందసాగిరి.




ఉదయసింహుఁడు దుర్బలుఁడు; విషయ లంపటుఁడు. అక్బరు పాదుషాకు నా తురుష్క లా తోలుసంచిని తీసికొని వెళ్ళి యిచ్చినంతమాత్రముననే యిట్లు నిశ్చేష్టుఁడై యాఁడుదానివలె నేడ్చుచుఁ దన బేలతనము బయటఁ బెట్టవలయునా? పర్యవసాన మెట్లుండినను లజ్జాభిమానమునకైన వెఱచి ధైర్య మూనరాదా? రజపూతకుల సంభవుండై, రజపూత్ర శ్రేష్ఠులలో

నధ్యక్షతవహించి రాణా యను బిరుదమునొందిన తానే యిట్లుబలవలె నేడ్చుచు రసపుత్రవంశమున కప్రతిష్ఠ దెచ్చుచుండఁ జూపకులకు నగుబాట్లు కాదా? ఇతరు లతనిజూచి హాసించిననేమి, యాడుదానవని పలుమా రెగతాళిఁజేసిన నేమి, యుదయసింహుఁ డెటులనో పిఱికిపందయే. ఇట్టివాఁడా ఘోరవృత్తాంతమునువిని ప్రాణంబులతో నిల్చునా? లేదు; ఆతఁడు వెంటనే కొందఱు భటులను పిలువనంపి వారిని ఖేతసింగునొద్దకుఁ దక్షణమేఁగి రాణావారు సైన్యముఁ దీసికొని రానక్కఱలేదని చెప్పిరారని పంప నిశ్చయించెను. ఇది యంతయు బుద్ధికుశలుఁ డగు పుష్పమిత్రుఁడు చూచి రాణావారి పిఱికితనంబునకు సిగ్గిలుచుఁ బైకిమందలింప నిశ్చయించి రాణావారిని సమీపించి 'అయ్యా! మీరింతమాత్రముననే భయకంపితులై భటులను ఖేతసింగునొద్ద కంపనేల? ఆ యుత్తరము గైకొన్నంతమాత్రమునఁ బాదుషా యేమిచేయగలఁడు? విచారించిచూచిన నా యుత్తరములో నేమిగలదు? మనము సైన్యముఁ బ్రోగుచేసి తీసికొనిరమ్మని వ్రాసితిమి గాని మఱొండు వ్రాయలేదుగదా! దీనిలో బాదుషా కాగ్రహము గలుగజేయు కారణ మేమిగలదు? నామాటల నంగీకరించి భటులఁ బంపవలదని మృదూక్తుల రాణా నెటులనో నమ్మించి సమాధానపఱచి భటులఁ బంపకుండఁ జేసెను. అటుల బుష్పమిత్రుఁడు ధైర్యముగలవాక్యముఁ జెప్పినను రాణా కిసుమంతయు జిత్తశాంతి కలుగలేదు. అప్పటివఱకును రాణా శరీరము గడగడ వడకుచునే యుండెను. ఇతరు లందఱికంటె బుష్పమిత్రునియం దెక్కువ నమ్మకముగలవాఁడు గాన రాణా కొంతసేపటికి భయరహితుఁడై శాంతినిబొందెను.

అక్బరు 1542 సంవత్సరమున నమరకోటలో జనన మందినవిషయము మనకుఁ దెలియునుగదా! ఈమహాపురుషుఁ డుదయించినతోడనే కొందఱు జ్యోతిష్కు లక్బరుపాదుషా రాణా వారి కత్యంత వైరియని చెప్పిరి. అప్పటినుండియు నుదయ సింహున కక్బరన్న గడుభీతి. ఇదియే గాక మహాతురుష్కుని పేరుఁ జెప్పినను నాతనికి భయమే. రసపుత్రాన్వయములో నిట్టి స్థితి విచారణీయమే! దివాంధమునకు బవలువ కెంతదూరమో రసపుత్రునికి బిఱికితనమున కంతదూరము. ప్రాప్తములేనిది పసిడికుప్పలోఁ బడి పొర్లాడినను ఫలములేదను పెద్దలాడు వచనంబురిత్తకాదు. వంశమా రసపుత్రవంశము; మాతాపితరులా, నిరుపమాన పరాక్రమశాలురు. తండ్రియగు రాణాసింగుని పేరు విన్న శత్రువులకు నిద్దురరాదు. సవతితల్లియగు జాహిరీబాయి యసమాన శౌర్యరాశి. ఇట్టివంశపుఁజాలుబట్టియైన నుదయ సింహునికి ధైర్యముండవలయునే! రసపుత్రకులప్రతిష్ఠఁ బాడు చేయు నీతఁడు జన్మించెఁగాబోలు! పాపము కర్ణావతి గర్భమున నిట్టివాఁడుదయించుట యేమెనోము కొఱతయో!

ఉదయసింహుఁడు రాజ్యకార్య కుశలుఁడుగాఁడు. రాజ్య కార్య వ్యవహారములయం దితనికి లక్ష్యమేలేక నెప్పుడు జూచిన విలాసమగ్నుఁడై యుండును. కాని రాజ్యకాంక్ష విస్తారమైన లాభమేమి? కొద్దినోమునోచి గొప్పలాభము నాశింప నదెట్లు లభించును? అట్లూరక గోరికలగోరు టందని పండ్ల కఱ్ఱులుజాపుటయెగదా. రాణాగారు పురోక్తముగ శాంతినొందినపిమ్మట నొక భటుఁడేతెంచి వారిదర్శనార్థ మెవరో ద్వారమునందున్నారని చెప్పెను. చెప్పగా రాణా వానిని లోనికి గొనిరండనెను. ఆ పురుషుఁడు లోనికి వచ్చి

నంతనె సభవారంద ఱాశ్చర్యమగ్నులయిరి. ఇతఁడే ఖేతసింగు. ఖేతసింహునిజూచి రాణా లేచి దూరదేశమునుండి మరలివచ్చు పుత్రుని కెదురేగి కడుప్రేమఁ గౌఁగిలించు జనకునిరీతి నాలింగనముఁ జేసికొని 'సైన్యముఁ దీసికొని వచ్చితిరా' యనెను. అతఁడు లేదనిచెప్పెను. చెప్పినతోడనే రాణా యత్యంతసంతోషముఁ గలవాఁడై మరల నింకొకపరి యాతని గౌఁగిలించుకొనెను. పిమ్మట సభలోని వారంద ఱాతని సైన్యముఁ దీసికొని రానందులకు గారణమేమని యడిగిరి. అడుగఁగా నాతఁడు సగర సరళసింహులు చెప్పిన వృత్తాంతమును విని, పాదుషాకా యుత్తరము చిక్కి యుండునని తలఁచి యట్లొనర్చితినని చెప్పెను. ఈ వృత్తాంతమును వినినసమయమున రాణాకుఁ గలిగిన హర్షమునకు మేరలేదు. అతఁడు నిజముగా నోడలెఱుఁగడు. మఱియు ఖేతసింహుని జాల గొప్పగఁజూచి మిగులఁ గొనియాడెను. తదనంతరము రసపుత్రు లందఱును ఖేతసింహుని సచ్చారిత్రమున కత్యంత ముదము నొందిరి. పయోముఖ విషకుంభమగు ఖేతసింగు చిఱునగవుతో 'నయ్యా! నే నంత పొగడ్తకుఁ దగినవాఁడను కాను. దేవరవారికి నాయందుఁ గల వాత్సల్యముచే నన్నిట్టుల స్తోత్రముఁ జేయు చున్నారు కాని వేరుకాదనెను. అంతట సాయంసమయము కాగా నాటికాసభ ముగిసెను. రాణావారును, మంత్రియుఁ దదితరులును దమతమ నివాసంబులకుఁ జనిరి.

---

## నాల్గవ ప్రకరణము

# పట్టమహిషి

రానురా నుదయసింహుని యవగుణములును, పిఱికి తనమును, రాజకీయవ్యవహారనిర్వాహణమునందసమర్థతయు రసపుత్ర కులమువారందఱికిం దేటతెల్లము గాఁజొచ్చెను. ఈ కారణముచేత వారందఱు గ్రమక్రమముగ నాతనియం దసూయా గలవా రగుచుండిరి. ఇట్లు ప్రజలెల్లరుఁ దనయం దసూయఁ జెందుచున్నారని తెలిసియు, నుదయసింహుఁడు తనమార్గముఁ జక్కబెట్టుకొనఁడాయె. మతిమాంద్యముఁ బోవిడనాడఁడాయె. ఉదయసింహునియందు దోసములున్నను సద్గుణములు విశేషముగా నుండినట్లయిన 'ఏకోహి దోషోగుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' అను నార్యోక్తి ననుసరించియైన నాతని సత్పురుషునిగా నెన్నవచ్చును. అట్లుగాక నీతనియందన్నియు దోసములేకాని సద్గుణములరుదు. ఇక శరీర సామర్థ్య మెన్నుదమన్న నుదయసింహుఁడు మిగుల బలహీనుఁడు, పొట్టివాఁడు. మానవుని శరీరసామర్థ్యమును బట్టియే గదా ధైర్యశౌర్యాది గుణంబు లుండుట; కనుక నీతఁడెంత ధైర్యశాలియో పాఠకులే గ్రహింపగలరు. ఇంత విశాలమైన రాజ్యమున కధిపతియయ్యు నుదయసింహుఁ డెక్కుడువైభవము ననుభవింపలేదు. ఏవరువచ్చి యేమి మొఱపెట్టుకొనినను నాతఁడు సావధానచిత్తుఁడై వినలేదు. ఒక వేళ వినినను తగు సమాధానము గూర్పనేరడు. ఇతరుల యంతఃకరణముల నాకర్షించుకొను సామర్థ్య మీతనియందు లేదు. ఇదిగాక నాపిత్సమయములో నీతఁడు బొత్తిగా మనసు నిలుపలేక బిచ్చివాని

రీతి సంచరించును. ఏదైన నొక కార్యమును జేయఁబూని యది కొంచెము సాగువఱకైన మనోనైశ్చల్యము నిలుపఁజాలఁడు.

ఉదయసింహునకు మితిమీఱిన ద్రవ్యము కలదు. ప్రతి దినమును విఘ్నవిరామము లేక ధనమును వెచ్చించు ధనాగారము లనేకములు గలవు. నోటివెంట మాట వెలువడకముందే విధేయులై కార్యసాఫల్య మొనర్చు భృత్య శతంబులు గలరు. అడుగడుగునకు జోహారు లిడు దాసదాసీజన సమూహంబులు గలవు. ఎట్టి బలవద్విరోధినైన నిమేషమాత్రమున నోడించి లాగికొనివచ్చి పాదసాన్నిధ్యమునం దునుచు పరివారము కలదు. సంకట సమయములలో మేలగు సలహానిచ్చి యెట్టి ఘోర విపదంబుధినుండియైనఁ దప్పించి హర్షాంబుధిఁ జేర్చు నమాత్యశేఖరులు గలరు. ఎన్నియున్న నేమిఫలము? ఎందఱు యోధాగ్రేసరులున్న నేమి? రాణాగారికి ధైర్యము లేనిచో సుందర ఫలవృక్షచ్ఛాయా నివాసి యగు నంధునిరీతి, సవన్నియు నిష్ప్రయోజనము లేకదా! ధైర్యమున నేమి? హృదయ చాంచల్యము లేక నిశ్చలత్వమును బొందుటయే. అట్టి గుణరాజ మీరాబాయివారియెడఁ గంచుఁ డివిటీల శోధించినఁ గానరాదు. రాజ్యకార్య ధురంధరుఁడు కానివాఁడు రాజత్వము నేల యంగీకరింపవలయును? పేరునకు మాత్రము రాజుగా నున్న సరియా? ప్రజలనెల్లఁ దనకన్నులలో నిడికొని వారి సుఖదుఃఖములఁ దనవిగా నెరయవలదా? పరాపరోక్తుల నెఱిఁగి విచారణ నేయనేరని రాజున్న నేమి, యూడిననేమి? 'యథారాజా స్తథా ప్రజా' యనురీతి నీరాజు తన ప్రజలయెడ నంత నిర్దయుఁడై యున్నవాఁడు. గావుననే వాని రాష్ట్రములోనివారు కూడ నాతని యందంత యసూయాగ్రస్తులయి యుండిరి.

ఉదయసింహుని గుణవిశేషము లిట్టులుండ నిఁక నీతని యంతరంగికులయిన గుణంబులు వర్ణనీయములు. వీరాబాయికిని రాణా వారికి నత్యంత తారతమ్యము గలదు. రాణావా రెంత పిఱికి వారో వీరాబాయి యంత ధైర్యశాలిని. విధిలేక నామెను స్త్రీయని పిలువవలసినదే కాని యామె శౌర్యాతిశయమునకు నిజముగా నే రజపూత వీరశిఖామణియుఁ జాలఁడు. ఎటుల నేర్చుకొనెనో గాని యామెకు రాజకీయ వ్యవహారములన్నియు గరతలామలకములు. రాజ్యాంగ విషయములలో జిక్కులు తటస్థించిన వాని సరిజేయు సమర్థులెవరు? వీరాబాయియే. కార్యసానుకూలమునకు యుక్తాయుక్తము లీమెకుఁ జక్కఁగాఁ దెలియును. ప్రజలనెల్లర నేరీతిఁ గాపాడిన రాష్ట్రము చక్కనగునో యీమెకు బాగుగాఁ దెలియును. ఉదయసింహుఁడు రాజుగానున్నప్పటికిని జాలవఱకు జనులందఱికి నీమె శక్తి సామర్థ్యములు విస్పష్టములు. ఆనాటి కానాఁటికిఁ బ్రజలందఱికి వీరాబాయియందు ప్రేమానురక్తియు, నుదయసింహుని యందసూయయు బోడమఁ జొచ్చెను. పాపము వారు మాత్ర మింకెంతకాల ముదయసింహుని పిరికితనము సహింపగలరు? ఇటులెన్నిరోజులు వారు లోలోన దిగులందగలరు! ప్రజలందఱేకగ్రీవముగఁ దమ కష్టనిష్ఠురములఁ దెలియఁజేసిన గాని పరులకెట్లు తెలియును? బాల్యమునుండి సకలకష్టములకు లోనై పెంచి పెద్దవానిజేసిన జననికూడ 'నమ్మా'యని బిలువ నిచో నన్నము బెట్టదే? ఉదయసింహుని రాజని పిలుచుటయే గాని రాజకీయ వ్యవహారము లన్నియు వీరాబాయివలననే జరుపబడుచుండెడివి. ప్రజలందఱకుఁ దన పత్నియందెనురాగ మెక్కుడగుట రాణాకు నొంతకాలమైన తరువాతఁ దెలిసినది.

రాణాకు నిజముగా మీరాబాయియొక్క గుణ విశేషములు తెలియును. ఎట్టెఁగియు నాతఁ డెఱుఁగనివానివలెఁ బ్రవర్తించెడి వాఁడు. మనంబులోఁగల పిఱికితనమునకు లజ్జగొనిన వాఁడయ్యు విధిలేక రాజ్యభారమును వహింపవలసి వచ్చినది. ఇట్లుకొంత కాలము జరిగినపిమ్మట జను లందఱు దమతమ యభిప్రాయ ములఁగూర్చి రాణాకొక యుత్తరముఁ బంపుకొనిరి.

ఆ యుత్తరములోఁ దమకు రాజకీయధర్మము లేమియు జరుగుట లేదనియు, దమ కెల్లప్పుడుఁ గష్టములేగాని సుఖము గల్గుటలేదనియు, నారీతి మఱికొంతకాలము జరిగినచో వారికి జీవనాధారము శూన్యమగుననియు విన్నవించుకొనిరి. ఆ యుత్తరము నుదయసింహుఁడు స్వయముగాఁ జూచెను. చూచి పాపమాతఁడేమి చేయఁగలఁడు? అయిన నాతఁడిటులఁ దీర్మానించుకొనెను. "ప్రజల కందఱకును మేలు గావిం పనిచో నేనుమాత్రము సర్వాధిపత్యము వహింపనేల? అయినను నేనొక సభ నేర్పఱచెదను. రాజ్యాధిపత్యము వహించి నిర్వహింపఁగలవా రెవరైనఁగలిగినచో నాసభయందే బయటికి రాగల" డనెను. అట్లు నిశ్చయించి యొకనాఁడు సభఁ గావించెను. తత్సభార్థమై నానాముఖములనుండి జనులా మహాసభ కరుదెంచిరి. రాజభవన మంతయుఁ గళకళలాడు చుండెను. ఉదయసింహుఁ డాసభకువచ్చి యథాస్థాన మలంక రించెను. అపుడు జనులంద ఱేకగ్రీవముగఁ దమకు రాణావారి పరిపాలన సుంతైనఁ దృప్తికరముగ లేదనియు వారి స్థానమున వారి ధర్మపత్నియగు మీరాబాయిని బట్టమహిషినిగాఁ జేసినచో వారి కన్నివిధముల లాభము గల్గుననియుఁ జెప్పిరి. ఉదయ సింహుఁడుకూడ జనులందఱుఁ దనయెడ నిరుత్సాహులొట

జూచి బహిరంగముగా వీరాబాయిని బట్టమహిషిగాఁ జేయుట కియ్యకొనెను. వెంటనే జనులందఱు సంతోషముతో మంగళ వాద్యములతో వీరాబాయి నా మందిరమునకుఁ దోడ్కొని వచ్చిరి. పిమ్మట నామెను రాణావారిచెంత వేఱొక సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి పుష్పహారములతో నామె నలంకరించిరి. తోడనె వారందఱామెను దోడ్కొని, వివిధనృత్య మధుర గీతారవంబులతోఁ బురప్రదక్షిణముఁ గావించిరి. నాటితోఁ బ్రజల కష్టములన్నియుఁ దీరెను.

---

అయిదవ ప్రకరణము

# వీరాబాయి

ఆకసమంతయు నీలజీమూతంబులచేఁ గాఱుచీఁకటులు గ్రమ్మ జనవిహంగ సముదాయములెల్ల హృదయాందోళనఁ జెందుచుండ నేమూలనుండియో నిజసహస్రకర ప్రసారముచే నంబుదముల బెగల్చుకొని భానుఁడల్లన వెల్వడ శుకపిక శారికాదులెల్ల మధుర గీతారవంబులఁ జెలంగి నిజేచ్ఛ నెట్లు విహరించుచుండునో యటులనే యుదయసింహుని పరిపాలనాంధకారమున రసపుత్రవీరు లెచటనో స్రుక్కి చేష్టలఁ దక్కి వీరాబాయి రాజ్యేందుబింబ చంద్రికలో దమతమ సహజ శౌర్య ధైర్యాది గుణంబులఁ జాటుచు నూతన తేజంబుల నొప్పుచుండిరి. చిత్తూరు నగరమెల్ల నత్యంత శోభచే నొప్పు చుండెను. ఏ రసపుత్రుని గృహముఁజూచినఁ బచ్చని తోరణంబులతో నొప్పి లక్ష్మీనివాసమున కాలవాలమై యొప్పు చుండెను. ఏమూలఁగన్నఁ గలకలలాడు నగుమొగంబులే.

ఏ గృహమందుఁ దిలకించిన వింతే. వేయనేల? నాదిన మందుఁ జిత్తూరునగర మంత్రియు మహావైభవమున నుండెను. చిత్తూరునగర మిట్లుండ, రాజమందిరము మఱింత శోభచే నలరారుచుండెను. మందిరములో వీరాబాయి సర్వాభరణాలంకృతయై, మంత్రి పరివార బృందముతోఁ బరివేష్టితురాలై యుండెను. భృత్యులందఱు నొకరితరువాత మఱొకరువచ్చి జోహారులిడుచు దీవన లందుచుండిరి. అదివరకెంత చనువుగా నామె దరికేగుచుండిన నాఁడెందు వలననో భృత్యులందఱు నామెనుజేర భీతినొందుచుండిరి. ఆమెగూడఁ దనగౌరవము గుర్తెఱిఁగినదై, కొంచెము గంభీరభావము వహించుచుండెను. ఆహా! స్థలవిశేషము లెంత మార్పును దెచ్చిపెట్టునోగదా! ఒకనివెనుక మఱొకరు భృత్యులామెకడ కేగుచుండ నామె కూడ వారిని బాగుగఁ దిలకించుచుండెను. వీరాబాయి సూక్ష్మబుద్ధిగలది. తత్పూర్వమే భృత్యులందఱితో నామెకు బరిచయముండుటచే నామెకు వారివారి నైజభావంబు లన్నియుఁ దేటతెల్లములు కనుక నెవరి నెట్లు జూడవలెనో నామెకు సంపూర్ణముగఁ దెలియును. ఆమె పట్టమహిషి కాకఁబూర్వమే యామెకు రాజకీయ వ్యవహారములన్నియు బాగుగ దెలియునను సంగతి మన మిదివఱకే చదివియుంటిమిగదా! ప్రతి రసపుత్రవీరుఁడును దేవిగారి ప్రేమ సంపాదించవలెనని లోన నెంత క్రోధముఁ గల్గిన బైకి గడు నమ్రత వహించియుండెను. వీరాబాయి పట్టమహిషి యైనందులకు మిగిలిన రసపుత్రులకుఁ గల్గిన సంతోష మట్లుండ, ఖేతసింగు, అభయసింగు, కుంభరాణాలకు గల్గిన సంతోష మత్యంతము. నిజముగా వారానందాబ్ధిఁ జొక్కి యొడలుమఱచిరి. వీరుముగ్గురు నుదయసింహుని

పూర్వులు. వీరు చాలకాలమునుండియు నీ చిత్తూరు సంస్థానమును గనిపెట్టుకుని యుండిరి. వీరు దేవిగారి సింహాసనమునకు దగ్గఱగాఁ గూరుచుండి యామెతో నప్పుడప్పుడు సంభాషించుచుండిరి. ఇట్లుండ గొంతసేపటికి మంత్రి పుష్పమిత్రుఁ డామందిరమునకు వచ్చి మొదటనుండియుఁ బ్రత్యేకముగఁ దనకొఱకేర్పరచిన స్థలములోఁ గూర్చుండెను. పుష్పమిత్రునిఁ గనినంతనె జనులందఱు నిశ్శబ్దముగా నూరకుండిరి. ఇట్లుండఁ బాప మెందులకో గాని మొదటినుండియు నంతఃజోరవుగ దేవిగారితోఁ బ్రసంగించు నా ముప్వురును ముకుళితవదనులై వారి యన్యోన్య సంభాషణలను వీడి యూరకుండిరి. పుష్పమిత్రుఁడుగూడ నెందులకోగాని వారివంకఁ జూడలేదు. ఇది యంతయుఁ బుష్పమిత్రునకు నా ముప్వురకుఁ దెలియును గాని మిగిలినవారికిఁ దెలియదు. ఎటులున్నను మొదటినుండియు సంతోషముతోనుండి యెవరో యొకపురుషుఁడు వచ్చినతోడనే ఖిన్నులై యుండిన ననుమానమునకు హేతువగునని దలఁచి యా ముప్వురును మొదటియంత దఱచుగ గాక పోయిన నప్పు డప్పుడు హీరాబాయితో బ్రసంగించుచునే యుండిరి. వీరు తనయెడ మిగుల విధేయతగా నుంట జూచి "యతివినయం ధూర్తలక్షణం" అను వార్యోక్తిఁ దలపునకుఁ దెచ్చుకొని హీరాబాయి వారి నోరకంటఁ జూచుచునే యుండెను. హీరాబాయికి బుష్పమిత్రునిగుణగణంబులు బాగుగఁ దెలియును. కావున నామెకు వానియెడ నెక్కువ నమ్మికయు, ననురాగమును గలదు. తన పెనిమిటి యగు నుదయసింహారాణా కెన్నివిధముల రాజ్యతంత్రములలో దోడునీడయై సాయమొనరించెనో యామెకుఁ బూర్ణముగాఁ దెలియును. అది

యునుఁ గాకఁ దనకుఁగూడ నిక ముందు సాయము కాగలఁ డనియుఁ దెలియును. మీరాబాయి మిగుల రూపవతి. ఈమె సద్వంశకుల సంజాతయై యందఱిని సమానభావముతోఁ జూచు చుండెడిది. ఎట్టి రజపూతాంగనతోనైన నీమె కలిమిలేములు విచారింపకఁ జక్కఁగా మాటాడెడిది. ఈమెకాత్మస్తుతి యన్న నమితకోపము. ఏమనుష్యుని జూచినను వానిస్థితి నిమిష మాత్రమున గ్రహింపగలుగు సామర్థ్య మామెకుఁ గలదు. అందువలన నెట్టి రసపుత్రవీరుఁడు నీమె దరికేగి మాటాడ వెఱచు చుండెడివాఁడు. ఆమె కాపదలయందమిత ధైర్యము, సంపదల యందేవిధమగు డాంబికమును లేదు. ఇవియెగదా సత్పు రుషుల సర్వదా నాశ్రయించు గుణములు! వేయేల, మీరా బాయి చిత్తూరు రాజ్యలక్ష్మియై, రాజపుత్రుల జయ లక్ష్మియై, యుదయసింహునకుఁ గీర్తిలక్ష్మియై తేజరిల్లు చుండెడిది.

ఆఱవ ప్రకరణము

# దుష్ట చతుష్టయము

ఉ॥ శిష్టులఁ బ్రోచి దుష్టజన శిక్షణముం బొనరింతువో! భవత్
సృష్టిని దుష్టమానవు లశేషవిధంబుల శిష్టులన్ సదా
కష్టములం బడఁ జేసి, కడు కల్మష వృత్తిఁ జరించుచుండ్రు దీ
దుష్ట జనాళి చేష్టలు దుఃఖకరంబులు సజ్జనాళికిన్. 9

తసింగు, అభయసింగు, కుంభరాణాలు, రాణావారి కొల్వులోఁ జాలకాలమునుండి పనిచేయుచుండెడివారు. మీ రెల్లపుడును రాణా కేమి కోపమువచ్చునో యనునటుల గడు విధేయతతోఁ బయికి గనుపడుచుందురు గాని వీరి యంతరం

గములు కలుషములు. వీరిలోఁ గుంభరాణా వయోవృద్ధుఁడు.
అయిన నీతఁడెక్కుడు భుజబలముఁగలవాఁడు. పగఱకు వెన్నిచ్చు
వాఁడుఁ గాఁడు; రాణావారితోఁడను వారిబంధుజనము
తోఁడను మిగులఁ జనువుఁగలవాఁడు. ఎవరి కేవిధమగు సలహా
కావలసివచ్చినను వారు కుంభరాణా పెద్దవాఁడు గాన నాతని
కడ కేఁగుచుండెడివారు. కుంభరాణావిగ్రహము కడుభయం
కరముగ నుండును. ఆ నిడుదకన్నులును, ఆ విశాలవక్షస్థల
మును, మెలితిరిగిన మీసముల సౌరును జూచినయెడ
నెవరు భీతి నొందరు? ఆతఁడువీధులవెంట సాయంతనపు వేళ
షికారుఁ జేయునపుడు జూచితీరవలయును. ఆ సమయము
నందుఁ జూచినవా రాతని నేనుఁగుగున్నయనియూహింపవలసి
నదే. ఈతఁడు చేయూపిన మాత్రనే వందలకొలఁది జన మీతని
సాయమున కరుదెంతురు. ఇతఁడాయూరఁ దిరుగుఁ బలుగాకి
మూక లందఱికి నాయకుఁడు. వారేవిధమగు కార్యము జేయఁ
దలఁచినను ముందుగ కుంభరాణా సలహాను గైకొనినఁగాని
చేయ సాహసింపరు. కుంభరాణాతో వారు మారాడరు.
అతని మాటలు వారు శిరసావహించి యెట్టి కష్టములఁ బడి
యైన నెరవేర్చుదురు. వేయననేల? వారంద ఱాతని బూఁ
బూజింతురు.

అభయసింహుఁ డున్నత వంశోద్భవుఁడు. ఇతఁడు కడు
సుందరమూర్తి; కుంభరాణాకంటెఁ జాలచిన్నవాఁడు. అయిన
నీతఁడుకూడ నాతనియంతటి ధైర్యశాలియే. సంసారము
నందు విరక్తి జెంది, కొన్నిదినము లరణ్యమందు నివసించి
తరువాతఁ జిత్తూరు నగరముఁ జేరెను. ఇతనికి గౌరవకాంక్ష
విస్తారము. దీనికొఱకీతఁ డనేక వ్యూహములఁ బన్నెను. కాని

యవియన్నియు నాతనికే చెప్పఁ గావించెను. ఉదయసిం
హున కభయసింహుని యెడఁ జాల నమ్మకము. దానింబట్టి
యుదయసింహుఁ డీతనికి స్వల్ప వేతనముమీఁద గచేరిలో
నుద్యోగము నిప్పించెను. కొన్ని వేళలయం దుదయసింహుఁ
డీతని నొంటరిగఁ బిలిపించి రాజకీయ వ్యవహారముల గురించి
మాట్లాడుచుండును. కాని దేనివలననో పీరాబాయి కభయ
సింహునియం దసూయత గలదు. అభయసింహుఁడుకూడ పీరా
బాయినిజూడ భయపడు చుండెడివాఁడు.

ఖేతసింగభయసింహుని చెలికాఁడు. ఇతఁడుకూడ మిగులఁ
జక్కనివాఁడు. కాని కుటిలస్వభావము గలవాఁడు. అవసర
మగుచో నభయసింహునకును ఖేతసింహునకును బ్రాణముల
నర్పించునంతటి యన్యోన్య మిత్రత్వము గలదు! వీరిద్దఱు
బాల్యమునుండియు నొకే పాఠశాలయం దొకే గురువునొద్ద
విద్య నభ్యసించిరి, తరువాత నొకమంచి రజపూత వీరునియొద్ద
ధనుర్విద్య నేర్చుకొనిరి. ఇద్దఱిలో బాణముల సంధించుట
యందు ఖేతసింహున కెక్కుడు నేర్పరితనము గలదు. వీరిద్దఱు
సాయంతనపు వేళల నొక విశాలమగు బహిరంగస్థలమున కేగి
యచట నొక మంటి బొమ్మను గొంతదూరమునఁ బెట్టి దాని
తమ బాణంబుల గూలనేయు చుండెడివారు. ఇటుల వీరిద్దఱు
క్రీడాలోలురై చాలఁ బ్రొద్దుపోవువఱకు కాచోటు వాయక
రాత్రివేళలఁ దమయింటి కేఁగుచుండెడివారు. భోజనానంత
రముఁ దిరిగి ఖేతసింగభయసింహుని యింటికేఁగి యచటనే
శయనించు చుండెడివాఁడు. ఖేతసింహుఁ డాత్మలాభపరా
యణుఁడు. ఇతఁడు దరిద్రుఁడయ్యు నొకరి యాజమాన్యముక్రింద
నుండక స్వేచ్ఛావిహారమ్మునం దిచ్ఛగలవాఁడు. కొన్నిరోజు

లైనతరువాత నభయసింగు రోజన క్షేతసింహుని రహస్య ముగాఁ బిలిచి 'యుద్యోగము' విషయమై నాశయేమైన గలదా? యనెను. అంత సౌఖ్యముగా జీవించుచున్నవాఁ డామాట వినునా? అయిన నభయసింగు క్షేతసింహుని జాలవఱకు మంద లించి ఏదైన నుద్యోగములోఁ బ్రవేశింపనిచో జీవనాధారము దుర్లభమనియుఁ జూపరులకు గూడఁ జులకనగా నుందుమనియుఁ జెప్పి తనకు రాణాతో నించుక పరిచయము గలదనియు దానేఁగి తద్విషయమై మాటలాడెదననియు జెప్పెను. తుద కెట్టులనో క్షేతసింహుఁ డొప్పుకొనెను. రెండవరోజున నభయ సింగు రాణాకడ కేగి క్షేతసింగు విషయమై శిఫారసుఁ జేసెను. రాణా యాముహూర్తమునం దేస్థితిలో నుండెనో కాని వెంటనే వానికి నుద్యోగము నిచ్చుట కియ్యకొనెను. క్షేతసింగు రాణా వారి సైన్యముపై జమాదారుగా నియమింపఁబడెను. క్షేత సింగునకు నభయసింహుని మాటవిననిచో గత్యంతరము లేదని తెలియును. కాన స్వేచ్ఛావృత్తిని విడువవలసి వచ్చెనని లోన గుందుచుండియు విధిలేక నుద్యోగమున కొప్పుకొనెను.

పైనఁ జెప్పఁబడిన ముప్వురకు జంద్రబాణుఁ డాగర్భశత్రువు. చంద్రబాణుఁడు వీరాబాయి సోదరుఁడు. ధనసాధనసంపత్తి గలవాఁడయ్యు నీతఁడు కడు వినయమునఁ బ్రవర్తించువాఁడు. పుష్పమిత్రునకు చంద్రబాణునకుఁ గల ప్రేమాతిశయములఁ జెప్పన నలవికాదు. చంద్రబాణుఁడన పుష్పమిత్రునికి బహిఃప్రాణమే; పుష్పమిత్రుఁడన జంద్రబాణు నరశరీరమే. క్షేతసింగు, అభయసింగు, కుంభరాణాలు రాణా ఘుం డమితవిశ్వాసము గలిగినట్టుల జరించుచుండినను వారికి లోలోన రాణాపైఁ గడు ద్వేషము కలదు. వీరుముప్వురు

రాణావారికిఁ బ్రియసఖుఁడు అక్బరుపాదుషావారితోఁ గలిసి రహస్యముగ నాలోచనలఁ జేయుచుండెడివాఁడు. వీనికి దైవవశమున మఱి యొక నాల్గవమిత్రుఁడు కనిపించెను. ఇతఁడే హామీరులాలు; పాదుషాగారి మంత్రి. ఈ దుష్టచతుష్టయము మొదటను రాణా వారి యోగునే కోరుచుండెడివాఁడు.

---

ఏడవ ప్రకరణము

## చతురంగశాల

దుష్టచతుష్టయములో బాదుషా మంత్రియగు హామీరు లాలు కడుఁ గ్రూరుఁడు. కాని యీతఁడు రాజకీయ విషయ ముల బాగుగ నెఱిఁగినవాఁడు. పాదుషా యెల్లప్పుడును హామీరులాలునం దత్యంత విశ్వాసము గలవాఁడై యాతని సలహావెంట నడచెడివాఁడు. హామీరు లాలునకు బాదుషా రాజ్యములోని విషయములేగాక రాణా రాజ్యములోని విషయములుగూడ బాగుగఁ దెలియును.

అందు ముఖ్యముగ రాణా మంత్రియగు పుష్పమిత్రుని గుణాతిశయంబులు పూర్ణముగఁ దెలియును. ఇతఁడు విధిలేక దుష్టచతుష్టయములో నొకఁడై యుండెను. శ్వేతసింహాదులు రాణానుగూర్చికాని, పుష్పమిత్రుని గూర్చికాని చుల్కనగా మాటాడినప్పుడెల్ల వారివాక్యముల నీతఁడు ఖండించుచునే యుండెడివాఁడు. పాదుషా యుదయసింహునియందు దోసఁగుల వెదకునెడ నట్టి ప్రసంగము హామీరులాలునకుఁ గష్టముగఁ దోచినను పాదుషా యేమనునో యన్న భీతిచేఁ దలయూఁచు చుండెడివాఁడు. దుష్టచతుష్టయ రహస్య ప్రసంగస్థానము

చతురంగశాల. ఇయ్యది విస్తారమైనట్టియు కేవలనిర్జన భాగములో నున్నది. దీనిచుట్టును వ్యాపించిన మహావృక్షముల కిరణంబులకును నభేద్యమగు నాంధకారము గలదు. ఈ ఘోరారణ్యగర్భంబునఁ జతురంగశాల గలదు. ఇట్టి రహస్య ప్రదేశముఁజేర దుష్టచతుష్టయమునకుఁ దప్ప మఱియొకరికిని సాధ్యముకాదు. దీని నత్యంత రహస్య సంకల్పముల ప్రాయమున గొప్ప శిల్పికారులచే గట్టించెను. ఈ శాల మంచి యున్నత స్థలముమీఁద నల్లగోడ సుందరాకృతితోఁ గట్టబడి యున్నది. శాలకుమధ్య నొక విశాలమగు ప్రదేశము గలదు. దీనిముందొక చక్కని సరోవరము గలదు. ఈ శాలకు నెల కొకతూరి యెవరో కొందఱు పాదచారులై ప్రయాణము వచ్చి కొంచెముసేపు మాట్లాడుకొని సాయంతనపు వేళ నిండ్లకు బోవుచుండువారు. ఒకనాటిరాత్రి రెండు జాములయిన తరువాత నెవరో ముగ్గురు మనుష్యు లా ఘోరారణ్యములోఁ జొరఁబడి యా చతురంగశాలవంక కేగుచుండిరి. వీరు ముగ్గురును దృఢకాయులు, నల్లనివారు, బలాఢ్యులు. అట్టి ఘోరారణ్యంబునఁ గాఱుచీఁకటులు గ్రమ్ము నా సమయంబున వీరు పోఁగలిగిరిగాని యితరులు పోఁజాలరు. వీరుముగ్గురుఁ జతురంగశాలలోఁ బ్రవేశించిరి. ఆ శాలయం దైదు కుర్చీలు వేయబడి యుండెను. వానిమీఁద నీముగ్గురును కూర్చుండిరి. కాని యెంతసేపటికి నెవరును రాలేదు. ఇట్లు చూచిచూచి కొంత సేపటికి వెళ్ళ నుద్యుక్తులై నా యరణ్యములో నేదియో సందడి వినరాగా నెవరో వచ్చుచున్నారని తెలిసికొని మరలఁ గూర్చుండిరి. తరువాత మెల్ల మెల్లగా మఱియొక భీకరాకారుఁ డతిరభసంబున వచ్చి నాల్గవకుర్చీ నలంకరించెను. ఇతఁడే

హమీరులాలు. మొదటవచ్చిన ముగ్వురే ఖేతసింగు అభయసింగు కుంభరాణాలు. అప్పు డభయసింగు హమీరులాలుం జూచి యిట్లడిగెను.

అభ—భాయీ! బాదుషా వచ్చుచున్నాడా?

హమీ—లేదు. వారియింటివద్దనే యున్నారు.

ఈమాటలు వినినంతనే మిగిలిన ముగ్వురు ఖిన్నవదనులై మాటలాడకుండిరి. ఏలయన పీరారోజున బాదుషా వచ్చునన్న యాశతో నుండిరి గాన దత్ప్రతికూలవాక్యము చెవి సోకగనే వారాందోళిత మనస్కులైరి. అంత హమీరులాలు చిఱునగవుతో బాదుషా వచ్చుననియు దాను పరిహాసము నకుఁ జెప్పితిననియుఁ జెప్పెను. అప్పటికివారి కిసుమంతధైర్యము గలిగెను. కొంచెము సేపయిన తరువాతఁ బాదుషాకూడ నచ్చోటికి వచ్చి యుచితాసనముపైఁ గూర్చుండెను. వెంటనే వారిటుల సంభాషింపఁ దొడంగిరి.

కుంభరాణా—భాయీ! మనమువచ్చి యిప్పటికిఁ జాలకాలమయినది; ఇప్పుడు షుమారు రెండుగంటలు కావ చ్చును. కనుక శీఘ్రమే కర్తవ్య మూహింపుడు.

హమీ—అయ్యా! నాదేమున్నది. అంతయు బాదుషా గారిదే. మనమందఱము వారెటులఁ జెప్పిన నటుల నడువ వలసిన వారమేకదా?

అభయ—అట్లే అంతయు బాదుషాగారిదే. వారు లేకున్న మన మీ యుద్యమమునకు సాహసించుటెట్లు?

ఖేత—అయ్యా! మీరందఱును 'కర్తవ్య మేమని' యూరకుండుటకుఁ గారణమేమి? కర్తవ్య మేమియో మీకుఁ దెలియదా? ఉదయసింహుని బరిమార్చి, [illegible]యిం జెరసాల నుంచవలయునను తలంపు తప్ప మఱియొకటేమి కలదు? పాదుషాగారు సెలవిచ్చిన దదియే. వారికేమి చెప్పెదరు?

పాదుషా—సెభాష్ ఖేతసింగ్! సెహబాష్. గడచిన వారందఱు కర్తవ్య మూహింపలేకున్న నీవు సరిగా సూచన జేసినాడవు. హమీరులాలు సాహెబుగారూ! మీరుగూడ నెఱుఁగని వారివలె నంతయుఁ బాదుషాగారిదే యని వచించెద రేల? మనము చేయఁబోవు కార్యము మీకు హితమైనది కాదా యేమి? నేను తమ కీ రోజున జరుగవలసిన వృత్తాంతమును ముందుగాఁ జెప్పియుండలేదా!

హమీ—సర్కార్! నేను మాటవరుసకుఁ జెప్పితినిగాని నాకు మాత్రముఁ దెలియదా? నేనుమాత్ర మా యుదయసింహుని నాకరవాలంబునఁ దునియలు చేయనా? మీకిట్టి భ్రమయేల? మీరుచేసైగఁ జేసినంత మాత్రమున నేనా యాపిఱికిపందను బట్టి మీకడకుఁ దీసికొనిరానా? అప్పుడునాకు, ఖేతసింగు, అభయసింగు, కుంభరాణాలు మాత్రము సాయముఁ జేయకుందురా?

ఈ తుదివాక్యమును వినినతోడనే ఖేతసింగు మొదలగువారు చివాలున లేచి తమ నిశితఖడ్గంబులఁ గరంబులఁ గైకొని, బాహువుల నెత్తి మైమఱచి భీకర స్వరంబులతో 'ఓరీ! యుదయసింహా! దుష్టా! నీరోజు సమీపించినదిరా! నీ వింకెక్కడి కేఁగఁగల' వని యఱచుచు నిలుచుండిరి. అపుడు

పాదుషా వీరికి న్యాయం దసూయత బాగుగనున్నయట్లు గ్రహించి తానూరకుండిన సమయోచితముగాదని దలచి వారి క్రోధావలంబమును మన్నించి కొంచెము జేయ నెంచి వారితో నిట్లనెను.

పాదుషా—అభయసింగు శైతసింహులారా! మీరు నా కెంతయో సాయ మొనరింతురని దలచి మీ కిట్లు పెత్తనము జేసి యూరకుండుట నా కేమియు బాగుగనుండలేదు. కావున మీరే యిట్లుండిన నాకుమాత్ర మీశ్రమయేల? ఉదయసింహుడుండిన నేమి? యూడిన నేమి? మీమాటలు వినినపిదప గదా నేను మీకు ద్రోహుడనని జెప్పినది! అట్టియెడ మీరూరకున్న నా కేమి? పాప మా యుదయసింహుడు నా కేమి హాని జేసెను?

ఇట్లు పలికి యటనుండి లేవ నుద్యుక్తు డయ్యెను. అప్పుడు కుంభరాణా మొదలగువారు పాదుషా నిజముగ లేచి వెళ్ళునని భయపడి యాతడేగినచో దమయాశ లన్నియు నడుగంటునని దలచి పాదుషాను సమీపించి వాని పాదముల బట్టుకొన ప్రయత్నించి యిట్లు ప్రమాణములం జేసిరి. మీ పాదముల సాక్షిగా మే మీక్షణమునుండి మీ రేది చెప్పిన నది చేయువారము కాని వేఱుగ వర్తించువారము కామని చెప్పి తమతమ ఖడ్గంబుల మీద జేతులువైచి భుజంబుల నిడినవారై నిలుచుండిరి. అప్పుడు పాదుషా కొంచెము శాంతి నొందుట జూచి మరల దమతమ స్థానంబుల గూర్చుండిరి. ఇంతవఱకును హామీరులా లేదో యాలోచనలో నుండెను. వానికీ జరిగిన వృత్తాంతజ్ఞాన మించుకయును లేదు. తరువాత బాదుషా హామీరులాలును జూచి యిట్లు ప్రశ్నించెను.

పాదు:—భాయీ! ఉదయసింహుని మంత్రి పుష్ప మిత్రుడు మిక్కిలి బుద్ధికుశలుడు కాదా?

హామీ:—సర్కార్, అవును. దానిబట్టియే యీరాజ్య మింతవఱకు బాగు నున్నది. అతడు లేనిచో నా శిక్షించిన యుదయసింహుడు నేమిచేయగలడు? ఇంతవఱకైన రాజ్యము చేయగలడా? అప్పుడే యేనాట్లో పట్టబడి పట్టుకొని పోవల సినవాడే.

పాదు:—అటులయిన నుదయసింహునిజోలి మనకేల? అతడుండినను లేకున్న నొకటే. కనుక బుష్పమిత్రుని నా చేయినుండి తప్పించు టెట్లు?

హామీ:—దాని విషయమే నే నింతవఱకు దీర్ఘాలోచ నలో నుంటిని. పుష్పమిత్రుని నాచేయినుండి తొలగించుట నిజముగ గష్టతరము. పుష్పమిత్రు డసామాన్యుడు, అని వార్య పరాక్రమోపేతుడు; అహీన బలాఢ్యుడు; అమాత్య శేఖరుడు. రాజకీయ వ్యవహారముల జిక్కుచెట్ట వారలలో నీతిని మొదల నుడివి పిదప నితరులకేరు జెప్పవలసినదేకాని వేఱుకాదు. ఎట్టియాపత్తు తటస్థించిన నెట్టి చింతల జిక్కిన నెట్టి కడగండ్ల బడుచుండినను బుష్పమిత్రు డించుకైన హృద యాందోళనములేక సహజ ధైర్యమును వెల్లడించుచుండును. ఏసమయమున నే విషయములో నెట్టి చమత్కృతి నూనవల సినదో యతనికి దెలియును. వర్తమాన భూత భవిష్యద్వృ త్తాంతము లన్నియు నాతనికి గరతలామలకములు. పుష్ప మిత్రునకు సాహసము మెండు. సద్వంశ సంజాతుడయ్యు నెట్టి మనుజాధముడు వచ్చి మొఱ్ఱబెట్టుకొనినను వాని సంగతి

సాసాంతము విని వానికిఁ దగుమేలొనర్చును. పుష్పమిత్రునికిఁ దుష్కృతుల మాటన్న నమితకోపము; వానిపొడయన్న దాపము. అతనికి నిజకార్యావలోకనముగాక నితర రాజ్యావలోకనముగూడఁ గలదు. అట్టివానిని మన మేయుయుక్తులఁబన్ని లోబరుప గలము? ఏ యుపాయంబులచే రాష్ట్రమునుండి వెడలఁగొట్టఁ జేయఁగలము? ఇవి రెండు వృథా ప్రాగల్భ్యములే. ఇంక నాతని రాజ్యమునుండి వెడలఁగొట్టుట కష్టతరమని తోఁచినయెడల నేదో యుపాయముఁ బన్ని వానిని మన పక్షమునకుఁ ద్రిప్పవలయును. అదిమాత్ర మెట్లు? అన్నివిధములు గుత్తెజేఁగి రాజ్యకార్య ధురంధరుండగు పుష్పమిత్రుఁడేడ? కించిజ్ఞులమై యెటువో కుయుక్తులఁ బన్ని వానిని సాధింపనెంచు మనమేడ? నిజముగ వానికిని మనకును హస్తిమశకాంతరము గలదు. పుష్పమిత్రుఁడు మన పక్షమునకు రాఁగలఁడని యెంచుట కమలమిత్రుఁ డపరాద్రి నుదయించుననుటయే. ఒకవేళ నే నెపముచేనైన నాతని రాజ్యమునుండి వెడలగొట్ట గలుగనేర్తుము గాని యతఁడు మన పక్షము నవలంబించునని కలలోనైన దలంపకుఁడు. ఆతనిని రాజ్యము నుండి వెడలఁ గొట్టుటమాత్ర మెట్లు? అదియు నసాధ్యమే. వేయేల! పుష్పమిత్రుని కేదైనఁ గీడు సల్పనెంచుట దంభోళిఁ బిడికిట బట్ట నెంచుటే.

హామీరులా లీ వాక్యముల నుడువుచుండ ఖేతసింగు మొదలగువా రాశ్చర్యమగ్నులై నోరుఁదెఱచుకొని కూరుచుండిరి. పాదుషా మాత్రము కించిత్ భీషణాకృతివహించెను. తరువాతఁ బాదుషా హామీరులాలు నిట్లు ప్రశ్నించెను.

పాదుషా——హమీరులాల్ సాహెబ్! అట్లయినఁ దమరు మాపక్షమునుండి విడిపోయెదరా! మీరు మేముచేయు నాలోచన యొకవేళ బాగుగ నుండకపోయిన మంచి యాలోచన దేనినైనఁ జెప్పరాదా? ఊరక వానిని మీరిట్లు స్తుతించెద రేల?

హమీ——సర్కార్ సాహెబ్! నేనుగూడ నిజముగ వానిని రాజ్యమునుండి తొలగించు నుపాయమునకై చూచుచున్నాఁడను. మీరిటులఁ జెప్పుటవలన నిజముగ నాకు మిమ్ముల జూడ సిగ్గగుచున్నది. మీయన్నముఁ దినుచు మీపక్షము నుండి బోవ నాకేమియవసరము? మీకు విరోధియగువాఁడు నాకు మాత్రము విరోధిగాఁడా! నే నేల వానిఁ ద్యజింపను?

పాదు-అట్లయిన తమ కేదియైనఁ దలంపునకు వచ్చెనా?

హమీ-సర్కార్! నేనింకను దానివిషయమై కొంత యాలోచనఁ జేయవలయును. ఇక రెండుమూడు రోజులలో దమకు మనవిఁ జేయుదును.

శ్వేతసింహాదు లీ మాటలు విని హమీరులా లాలోచన సేయుననియెంచి యానాటి కాసభ ముగించిరి. పాదుషా హమీరులాలు గలిసి యొక త్రోవబోయిరి. మిగిలిన వారె వరికిఁ గనుపడకుండ నా దుర్గమకాంతారముదాఁటి సడుగుల గొందమార్గముఁబడి యెట్టెటులోఁ దమతమ గృహములఁ జేరిరి.



ఎనిమిదవ ప్రకరణము

# సభ

హీరాబాయి రాజ్యాధిపత్యము వహించిననాటినుండియు ప్రతిదినమును ప్రజలు దుఃఖమును నెఱుంగనివారై సౌఖ్యమున నుండిరి. ఆమెగూడఁ ప్రజలయందెక్కుడనురాగముఁజూపుచు వారికేవిధమైన కొఱఁతను గలుగఁ జేయకయే యుండెను. దేవిగారి కొల్వులోనుండు యుద్యోగస్థులందఱును, రక్తస్పర్శ గల్గిన చుట్టములుఁగూడ మిగుల విశ్వాసముతోఁ బనిఁజేయు చుండిరి. ఖేతసింహాదులు ప్రతిదినమును దేవిగారి యొద్దకేగి దీవెనల నందుచుండిరి. వీరి హృదయాంతరంగ మెట్లుండినను హీరాబాయికి మాత్రము వీరియందు చాల నమ్మకము గలదు. వీరిని నమ్మి యామె వారలకు రాజకీయ వ్యవహార రహస్య ములఁగూడ మర్మబుద్ధిలేక చెప్పుచుండెడిది. ఇట్లు చేయుట పుష్పమిత్రుని కసమ్మతము. కాని యాతఁడు దేవిగారెటులఁ దలఁచునో యని యామెను మందలించెడివాఁడు కాఁడు. దేవిగారటుల దలఁచుచుఁ వారితో రహస్యాలోచనఁ జేయు చుంటఁజూచి సహింపక నొకరోజున నేకాంతమున నామెను జేరి యిట్లనియె. "తల్లీ! మీరన్ని విధములఁ దెలివిగలవారు గదా! సర్వసర్వంసహా చక్రము నేలు ధీరులుగదా? అట్టి మీరన్ని వేళలఁ గడుజాగరూకతతో నుందురుగదా? రాజ కీయ వ్యవహారములన్నియుఁ గడు రహస్యములుగదా! అట్టి రహస్యములు మన నోటనుండి యేకాంతస్థలములం దప్ప నొండుచోట వెలువడఁ గూడదే! ఎంతయాప్తునికైన, నెంత ప్రాణమిత్రునికైన రాజకీయ రహస్యములఁ జెప్పనగునా? చెప్పినచో మనకు ముప్పువాటిల్లదా? రాష్ట్రస్థితియంతయుఁ

పలుచనగాదా? మన సోదరునీతి నెంతజనువుగా మనచెంత మెలఁగుచుండినను వానిని నమ్మనగునా? ఈ దినము మనకు ప్రాణమిత్రులగు వారు రేపు ఘోరశత్రువులుగాఁరాదా? ఇట్టి చిక్కుల నిసుమంతైన విచారణఁజేయకే యీ విషయముల నితరులతోఁ జెప్పుట న్యాయముకాదు. ఇకవాఁక మీచిత్తాను సారము నెఱవేర్పవచ్చునని కొంచెము కఠినముగా మాట్లాడెను. ఈమాటలను హీరాబాయి విని యించుకించుకబూని తనలోఁదా నిట్లనుకొనఁదొడఁగె: "ఏమి! పుష్పమిత్రుఁడిట్టుల నాతో నింత కష్టముగా జెప్పుటకుఁ గారణ మేమైయుండును? నే నేమియు నజాగ్రతలో నుంటలేదే. నేను క్షేత్రసింహాదుల గూడి రహస్యప్రసంగములఁ జరుపుట నితఁడు కనిపెట్టినా డేమి? ఒకవేళఁ గనిపెట్టిన నితని మిత్రులగు వారితోఁ జెప్పఁ దప్పేమి గలదు? ఇతనికి వారియందేమైన ద్వేషముగలదా? పరికించి చూడ క్షేత్రసింగు మొదలగువారియం దేవిధమగు తప్పుఁ గనుపించదు. నిజముగఁ బుష్పమిత్రునకే వీరియం దసూయ యుండవలయును. దానిం జేసియే మంత్రియగు తనతోఁజెప్ప నితరులతో రహస్యములఁ జెప్పితినని క్రోధము వహించినాఁడు. చూడఁజూడఁ బుష్పమిత్రుఁడు స్వలాభపరా యణుఁడుగా నున్నాఁడని కొంతసేపు తనలో వితర్కించి తరు వాత నెమ్మదిగ విచారించెదమని పుష్పమిత్రునిపైఁ దిరస్కార భావముతో నూరకుండెను.

ఆహా! విధివిధానముఁ జూచితిరా! కాలమాన మెంత దుర్భరము! కాలమున ననుసరించియేగదా సర్వజ్ఞులౌ వారికిఁ గూడ మంచివారియం దసూయ గలుగుట! మానవుఁడెంత సన్మార్గవర్తనుఁడైన, నెంతవిధేయుఁడైన గాలమునకు లొంగి

వలసినదేగదా ! ఇతరులతో రహస్యాలోచనలఁ జేయఁ గూడ
దన్నమాత్రనే హీరాబాయికిఁ బుష్పమిత్రునియం దసూయ
వొడమవలయునా ? హీరాబాయి జ్ఞానహీనురాలా ? న్యాయా
న్యాయ విచక్షణార్హురాలుకాదా ? కాదు కాదు. ఇదంతయు
కాలవైచిత్ర్యమే. పాపము కాలమిట్లామెకు మతిభేదముఁ
గల్పించుచున్నది. చూచితిరా ? కాలమున కసాధ్యమగు
కార్యమొండు లేదుగదా ? ఎట్టి ధీరుఁడైనఁ గాలవశమునకుఁ
బాత్రుఁడు కావలసినదే. సర్వసామ్రాజ్యాధిపత్యము వహించు
నెట్టి రాజేంద్రుఁడైన ననివార్య కాలచక్రభ్రమణంబున గూలి
తెలలేకఁ దనరాజచిహ్నములన్నియుఁ బోనాడి పిచ్చివానిరీతి
నల్లల నాడవలసినదేగదా ? అందువలననే కాలవశమున నిజ
ముగ మిత్రులు శత్రులగుదురు. శత్రువులు మిత్రులగుదురు.
కాలముతో సరియగుదాని నింకొకటిఁగానము. హీరాబాయి
తన సౌధంబున కేఁగినతరువాత రాత్రిసమయమున శ్వేతసింహా
దుల బిలిపించెను. వారతిశీఘ్రగతి దేవిగారియంతఃపురమున
కేగిరి. రాగా వారిని దేవిగా రుచితాసనముల గూర్చుండ నియ
మించిరి. తరువాత హీరాబాయి వారిని "పుష్పమిత్రుఁడు
మీయనుంగు చెలికాఁడుకదా ?" యని యడిగెను. వారు
కడువిధేయత నభినయించుచు, అమ్మా ! వారు మా ప్రాణ
మిత్రులు, ప్రియసహోదరులు. వారి యాదరణవలననేగదా
మాకీ యాస్థానమున నింతకూడు దొరకుట. వారు లేకున్న
మము నీయాస్థానములోఁ గనులఁజూచు వారెవరు ? అమ్మా !
నిష్పక్షపాతియగు నాభగవంతుఁడు వారి కాయురారోగ్యై
శ్వర్యముల నీఁడుగాతమని మువ్వు రేకగ్రీవముగా నుడివిరి.
ఇట్లువారు కల్మషరహితములగు ప్రియవాక్యముల బలుకుటఁ

జూచి వీరాబాయి నిజముగఁ బుష్పమిత్రునికి వీరియందనూయత గలదనియు, వీరలది గుర్తెఱుఁగక వానియందు విశ్వాసముగలిగి యున్నారనియు మనంబున నూహించెను. తరువాత గొంతసేపు వారితో నేవో ముచ్చటించి నిద్రాసమయము గాఁగా వీరాబాయి వారికిసెలవొసంగి తాను నిద్రించెను. మరునాఁడు భోజనానంతరము యథాప్రకారము వీరాబాయి కచేరిసావిడిలోని కేఁగి యచటనున్న యున్నతాసనముమీఁద గూర్చుండెను. మంత్రిశేఖరుఁడగు పుష్పమిత్రుఁడును క్షేత్రసింహాదులును, దదితర పరివారజనంబును దేవిగారు మందిరమునకు రాఁగా లేచి తమ విధేయతఁజూపిరి. వీరాబాయి నాయున్నతాసనమునఁ గన్గొని జనులందఱు ఆశ్చర్యంబునొంది వింతవింతలుగఁ జెప్పుకొనుచుండిరి. తమతమ స్థితిగతుల రాణిగారితో మనవిఁజేసికొన నిచ్ఛగలవారై వందల కొలఁది జనులామందిరముఁ జుట్టుదిరుగుచుఁ గలకలధ్వని గావించుచుండిరి. కాని ద్వారములందున్న భటులు వారిని దేవిగారి యాజ్ఞలేనిది లోపలికి రానీరైరి. బయటనుండు సవ్వడిచే రాణిగారిసుమంత విసువుజెంది భటుల నావృత్తాంతముఁ గన్గొని రమ్మనెను. వారు వెంటనేవచ్చి జనులు తమదర్శనమునకు నిరీక్షించుచున్నారని చెప్ప నామె వారిని లోనికి రానిండని చెప్పెను. వెంటనే జనులందఱు లోనఁ బ్రవేశించి యొకరితరువాత నొకరు తమ కష్టసుఖంబుల నామెతో మనవిఁ జేయ దొడఁగిరి. ఆమెగూడ మిగుల నోర్పుతో వారివారి మొఱల విని ప్రతివానికిఁ దగుసమాధానములఁ జెప్పి పంపుచుండెను. ఇట్లుండ నీ కలవరము మధ్య నొక భటుఁడొక యుత్తరముఁ జేకొని కొలువులోనికివచ్చి వీరాబాయి చేతి

పంపిచ్చెను. ఆమె యా యుత్తరముదీసి చదువుకొనెను. చదువుచుండ వేళకోగాని యామె కనుబొమలు ముడివడ సాగెను; నేత్రము లెఱ్ఱవాఱెను. అంతలో, చెక్కిళ్ళు క్రోధస్ఫురితములయ్యెను; నిముసములో సర్వకళా సంపన్న శశిబింబము వినుమడించు నామె ముఖకమలము సంపూర్ణ వికలత్వము నొందెను. ఎటులనో యాయుత్తరము ముగించి యామె తనదగ్గఱనున్న యభయసింగున కద్దాని జదువనిచ్చెను. సభికులందఱు నామెనుజూచి యత్యాశ్చర్యము నొందసాగిరి. పుష్పమిత్రుఁడు కూడఁ గారణమెఱుఁగక చపలతఁ జెందెను. అప్పు డభయసింగు జనులందఱి నిశ్శబ్దముగ నుండుఁడని చెప్పి యా యుత్తరము నిట్లు చదువసాగెను.

“అల్లాసమానులగు శ్రీ అక్బరు పాదుషాగారి సముఖమునకు.

తమ విధేయుఁడు పుష్పమిత్రుఁడనేక సలాములఁ జేసి వ్రాయునది. తమ యాజ్ఞానుసార ముదయసింహుని బరిమార్చి మన మనోరథసిద్ధినొనర్ప నేను వివిధములఁ బ్రయత్నించు చున్నాను. దైవము మన కనుకూలము గావచ్చును. పురుష ప్రయత్నములో నున్న దంతయు మనము చేయుదము. మిగిలిన దీశ్వరాయత్తము. కొద్దిరోజులలోఁ జిత్తూరు మీస్వాధీనము కావచ్చును. మంత్రిగారికి నా యనేక సలాములు. ఎల్లప్పుడు దమ యభివృద్ధి నభిలషించు

భవద్విధేయుఁడు,

పుష్పమిత్రుఁడు.”

ఉత్తరముఁ జదివిన వెంటనే జనులందఱు నత్యాశ్చర్య మగ్నులై మాటాడనేరక కూర్చున్నవారలైరి. కుర్చీలలో నిడిగొలఁబడిరి. అంతకుఁ బూర్వమే పుష్పమిత్రుఁడు దిగ్గున లేచి నెండి తన కుర్చీనుండి క్రిందబడి మూర్ఛిల్లెను. చేతనంజాలనువారలు కూడ నాశ్చర్యము నభినయించుచుఁ బుష్పమిత్రుని వంకఁ జూపులఁజూచుచుండిరి. కొంతసేపటికి [illegible] దేవిగారు తెలివిఁదెచ్చుకొని తన పీఠమునుండి లేచి హస్తమునఁబట్టి కాల భుజంగంబు భంగి బుస్సలఁగొట్టుచు నిట్లు వాక్రుచ్చె: "సభా జనులారా! రజపుత్ర వీరశిఖామణులారా! నేటి యుత్తర ములోని యంశము మీరెల్లరు వినినారుగదా! కుటిలుఁడగు పుష్పమిత్రుని నీచత్వము మీకు వెల్లడియైనదిగదా! ఇఁక నీనీచుఁడు మనయెదుట నుండ నర్హుఁడుకాఁడు. భటులారా! వెంటనే యీ విశ్వాసహీను నవలకుఁ గొనిపోయి మన రాష్ట్రమునుండి వెడలఁ గొట్టుడు. లేకున్న మీశిరంబుల నా కరవాలంబున నేలఁ జేసెద." అట్టుల శనిపాత సదృశంబులగు దేవిగారి మాటలవిని యంతవఱకు మూర్ఛఁ దేరని పుష్పమిత్రుని యా భటులు లాగుకొనిపోవ నుద్యుక్తులైరి. కాని చంద్ర బాహుఁడు పుష్పమిత్రుని వెన్నంటి యుంటచే నటుల జేయ వీలులేకపోయెను. చంద్రబాహుఁ డారసపుత్ర భటుల వారించి మిగిలిన రజపుత్ర సోదరుల పక్షమున నిటుల దేవిగారితో మనవిఁజేసెను. "అమ్మా! మేమందఱము నేటి యుత్తరము విని జాల చింతనొందినారము. పుష్పమిత్రుఁ డట్టి నీచుఁడై నను గాకపోయినను నేఁడీయుత్తరమువలన నట్లు భావింప వలసి వచ్చినది. అయినను మీరు న్యాయాన్యాయముల వరయకయే యింత కఠినశిక్ష విధించుట కష్టముగా నున్నది.

పుష్పమిత్రుఁడు మూర్ఛఁదేరిన తరువాతనైన నాశిక్ష విధింపు
డనెను. ఇట్లు ప్రజలందఱుఁ బుష్పమిత్రు పక్షావలంబు లగుటఁ
జూచి వీరాబాయి కొంత శాంతించి పుష్పమిత్రుఁడు భూమి
మీఁదనుండి లేచువఱకు నాగెను. కొంచెము సేపటికిఁ బుష్ప
మిత్రుఁడు తెలివిఁ దెచ్చుకొనెను. వీరాబాయి వాని నా
యుత్తరముగూర్చి ప్రశ్నజేయఁ బుష్పమిత్రుఁడు లేచి కరం
బులమోడ్చి తానేమియు నెఱుఁగనని చెప్పెను. వీరాబాయి
యామాటల సరకుసేయక వానిని పలువిధముల దూలించి
యా మరునాఁడుదయమున నాతఁడు తనపురములో గానిపించిన
యెడఁ జంపింతుననియు శీఘ్రమే రాజ్యమునుండి పోవలసిన
దనియు నాజ్ఞఁజేసెను.

---

తొమ్మిదవ ప్రకరణము

## సాకేతపురము

చిత్తూరు నగరమున కనతిదూరమున నొక సుందరమగు
పట్టణము గలదు. దానికి నాల్గుప్రక్కలను తోఁట లనేకములు
గలవు. ఏ ప్రక్కఁజూచిన నుద్యానవనములే. అట్టి యా వన
ప్రాంతములఁ గాలిబాట నడచు పాంథజనంబు లనేకులా
తరుచ్ఛాయలఁ బవ్వళింతురు. ఈ పథికులకీ యుద్యానవనము
లెంత సౌఖ్యప్రదాయకములు! ప్రయాణక్లేశముచేడస్సియున్న
రనుచు నా యుద్యానవన ప్రాంతముల కెప్పుడేగుదమా యని
నోట నురుగులు గ్రక్కుచువచ్చి యచ్చటఁ జటాలునఁబడి
యొడలెఱుఁగక పోయిన నిద్దుర జెందుదురు. అంత నిద్రలేచి
యా ముసాఫరులందఱా వనముల రామణీయకముఁ గన్గొన

లోనఁ బ్రవేశించెను. నానా వనములలోఁ [illegible]
[illegible] మధుర [illegible]
[illegible] రవంబులె! [illegible]
[illegible] ఫలముల నిచ్చి సౌఖ్యముఁ జేయు [illegible]ములె! [illegible]
[illegible]
[illegible] యమునే! [illegible]
[illegible]
ములే! [illegible]? [illegible] రామణీయకముఁ [illegible]
నలవికాదు. ఇది యిట్లుండ నాయూరి చాతుర్వర్ణ్యమువారి
నడవడిక లత్యాశ్చర్యములు. బ్రాహ్మణు లందఱు నిత్య
సత్య వ్రతులు; నిరతాన్న ప్రదాయకులు. కల్లయనఁ గల్లైన
నెఱుఁగనివారు. ఏ భూసురులఁ జూచిన భోగభాగ్యములచే
దులఁదూగువారే. ఇక క్షత్రియు లందఱు ధనుర్విద్యాకుశలులు.
వైశ్యులన్న మోసమెఱుఁగక సంపత్తితో సఖ్యమైత్రిని సంచ
రించువారు. శూద్రులు జాలభాగము పాలికులై కమతపు
వ్యాపారములఁ జూచుకొను చుండెడివారు. ఎట్టి హీనజాతో
ద్భవుని నోటనుండియైనఁ బరుషవాక్యము వినుట దుర్లభము.

అట్టి యీ సాకేతపుర బాహ్య ప్రదేశవనములో నొక
కుటీరము నిర్మించుకొని దానిలో నొక రసపుత్రుఁడు తన
భార్యాపుత్రాదులతో జీవనముఁ జేయుచుండెను. ఇతఁడు
భాస్కరసింహుఁడు, హీరాబాయి తోడఁబుట్టినవాఁడు; చంద్ర
భానుని కగ్రజుఁడు. చాలఁ దెలిసినవాఁడు, వేదాంతి. అందు
వలననే జనసంపర్కము లేకుండ నూరివెలుపల జీవించుచుండెను.
ఇతఁడు ప్రతిదినము ప్రాతఃకాలమున లేచి యీ వనాంతరమున
నుండు కొలనులో స్నానముఁ జేసి యచటనే రెండు జాములు

వటుకును జప మొనర్చు చుండును. ఈతనియొద్ద ననేకులు శిష్యులు పాఠములఁ జదువుచుండురు. వారలకీతఁడే యన్నమిడి పోషించు చుండును. భాస్కరసింహుని యింటిలో నొక గొప్ప పుస్తక భాండాగారము కలదు. భాస్కరసింహుఁ డెల్లప్పుడు నా భాండాగారమునందే ప్రొద్దు బుచ్చుచుండెడి వాఁడు. సాయంతనము వేళలఁ దన శిష్యబృందముతో నా యుద్యానవనములోని తటాకమునకు సంధ్యావందనాది కృత్యములఁ దీర్చుకొనుటకుఁ బోవునప్పుడు భాస్కరసింహుని జూచి తీరవలయును. భాస్కరసింహుఁ డొంటరిగా నా ప్రదేశములో నివసించియున్నను ప్రతిదినమును వేలకొలఁదిజన మాతనికడ కేఁగుచుండురు. ఎందఱు వచ్చినను భాస్కరసింహుఁ డించుకైన విసువుఁ జెందక వారందఱికి దగు సలహాలను జెప్పుచుండెడివాఁడు. ఈతనికొక పుత్రుఁడును, బుత్రికయుఁ గలరు. ఇతని యర్ధాంగి వరుణాబాయి మిగుల గుణవతి. ఆమెకు శాస్త్రమునందుగూడ బాగుగఁ బ్రవేశము గలదు. ఇది యంతయు నామె తన భర్తయొద్దనే నేర్చెను. ఆ యూరి జనులందఱామెను గడు గౌరవముతోఁ జూతురు.

భాస్కరసింహుఁడు తన సోదరియగు వీరాబాయి యొద్దకు సాధారణముగ వారమున కొకతూరి వెళ్ళుచుండును. ఇతనికి, నుదయసింహునికి వీరాబాయికిని గల తారతమ్యము బాగుగఁ దెలియును. రాణాకొల్వులో నుండు యుద్యోగస్థులను, పరివారజనంబును నీతఁడు బాగుగ నెఱుఁగును. అందఱికంటెఁ బుష్పమిత్రుని గుణంబులును, ఖేతసింహాదుల గుణములు నీతఁడు బాగుగఁ గాచి వడఁబోసినాఁడు. వారందఱు

భాస్కరసింహునకు ముఖ్యస్నేహితులు. అందులోఁ బుష్ప
మిత్రుఁడు ప్రాణసమానుఁడు; పుష్పమిత్రునిపై ప్రేమఁజూప
నెడ చంద్రబాహు భాస్కరసింహులలో నెవరెక్కుడో చెప్ప
వీలుకాదు. చంద్రబాహుఁడు పుష్పమిత్రుని దైవముగఁ బరిగ
ణించును. భాస్కరుఁడు నట్లే. భాస్కరసింహుఁడు చిత్తూరు
నగరమున కేఁగినప్పుడెల్లను పుష్పమిత్రుని జూడక యొక
గడియయైన నుండఁజాలఁడు. ముందుగా సోదరియింటికి వెళ్ళ
బహుమారు పుష్పమిత్రుని యింటికే వెళ్ళుచుండెడివాఁడు.
ఇట్లాతనియం దమితానురాగముఁగలవాఁడై యాతనికేదైన
నాపద వాటిల్లెనని వినిన నూరకుండఁగలఁడా? భాస్కరసింహుఁ
డొకరోజున సాయంత్రము తన గృహమునం దొక వేదికపైఁ
గూర్చుండి శిష్యులకుఁ బాఠములఁజెప్పుచుండఁగా నొకభటుఁడు
వచ్చి యిట్లు చెప్పెను: “అయ్యా! పుష్పమిత్రుఁడు పాదు
షాతో రహస్యాలోచనల సలుపుచున్న ట్లొక యుత్తరము
మీరాబాయిగారికిఁ జిక్కినది. అద్దాని దేవిగారు సభలో నంద
ఱకిఁ జదివి వినిపింపఁజేసిరి. తరువాతఁ బుష్పమిత్రుని యా
వృత్తాంతము నడుగ నాతఁడేలనోగాని జవాబుఁ జెప్పలేదు.
అపుడు దేవిగా రధిక కుపితురాలై, పుష్పమిత్రుఁడు మౌన
ముగాఁ గూర్చుంటఁ గని నిజముగా నాతఁడు ద్రోహియని
మనంబునఁదలఁచి వానిరాత్రి నుండియుఁ దన రాష్ట్రములో
నుండఁగూడదనియు, మరునాఁడు గన్పడిన శిరచ్ఛేదనము
గావింతుననియు సెలవిచ్చెను. ఆ రాత్రియే పుష్పమిత్రుఁడు
రాజ్యమునుండి వెళ్ళినటులఁ గాన్పించుచున్నది. రెండవరోజు
చిత్తూరునగర మంతయు శోధింపగా నాతఁడెచటను గనుపడ
లేదు.” ఇట్టి దారుణవాక్యములు భాస్కరసింహుని చెవిసోక

గనే వారిరువురు కరిసింగు ప్రాణములై పోవుటకు మూర్ఛిల్లెను.
అప్పుడు శిష్యులందరు వెలవెలబోయి తమ గురువుగారి
మూర్ఛకు కారణం తెలియలేక ఊరక గగ్గోలుపడసాగిరి.
వారిరువురు మొగమున నీరుచల్లుచు భాస్కరసింహుని
స్థితిమారగా శిష్యులుపక్కి నిష్క్రమించిరి. ఒకగంటకు భాస్కర
సింహుడు మూర్ఛదేరి యిట్లు విలపింపఁ దొడఁగెను:— “హా
ప్రియమిత్రా! ప్రాణమిత్రా! నీకా యిట్టిదురవస్థ! నీవేమి!
పాపమాచరించి నమ్మి ప్రాయమునేమి! తేజస్విగాలి పోకి
నంత మాత్రాన నిరపరాధిని బద్ధముచేసి నడికి నురుకు హీరా
బాయిలకుఁ గమ్మ శిక్షించుట! ఏమి! యిదంతయుఁ గల్ల.
నీవిరోధులెవరైన వ్రాసియుండవలయుఁ గాని నీవిట్లు వ్రాయ
సాహసింతువా? ఒకవేళ నట్టియుత్తరము కానిపించినను
హీరాబాయి యించుకైన విచారింపవలదా? విచారించి దానిని
గల్పితమని గుర్తింపవలదా? రాజ్యభారము నూనువా రసా
ధారణ ప్రజ్ఞగలవారై యుందురే! ఎట్టి విషయమునైన
బాగుగ నరసి దాని నిజము గ్రహింతురే! సర్వజ్ఞురాలగు హీరా
బాయికూడ నిట్లునీయందనుమానము వహించెనుగా! అయ్యో
చిఱుతప్రాయమునుండియుఁ జిత్తూరు నగరము నభివృద్ధికిఁ
దెచ్చి రాణా కెంతయు సాయ మొనరించు చుండిన నిన్నే
యిట్లు హీరాబాయి పరిభవించెనుగా! హా! కాలనిధి. ప్రియ
మిత్రా! రాజ్యమునుండి వెడలఁగొట్టఁబడి నవే సీమ కేగితివో
గదా! ఎచ్చోట నెట్టి యిక్కట్టుల పాలగు చుంటివోగదా!
సకల సంపదలచేఁ దులఁదూగు చిత్తూరు సామ్రాజ్యమున
కధిపతియగు రాణాకు సమాత్యుఁడవై మంత్రులలో నగ్ర
గణ్యుఁడవై యుండు నీకా యిట్టి దండనము! రాజు తలఁచి

కొనిన దెబ్బలకుఁ గొమవాయనివటుల వధకారము గలదు గదాయని మనుజుఁ డెట్టివాఁడైనదియు నాలోచింపకనే యిట్టి కఠినకార్యసిద్ధించితివా? అయ్యో! నీశిరముఁజూచి నానేత్ర పత్రి యెంత పొగులుచున్నదియో గదా! సకల విద్యా విశారదుఁడగు నీసుతుఁడు మిహిరకుమారుఁ డెంత యవస్థ నొందుచున్నాఁడో! ఏమిచెప్ప! స్నేహితుఁడనగు నేనే యిప్పు కన్నీరు మున్నీరుగనేడ్చుచుండ నిక నీ దారిఁ బ్రయాణము చెప్పు టొకవింతయు! అయ్యో! పుష్పమిత్రా! యింతలోనే నన్ను విడిచిపోయితివా! నీసుందర వదనారవింద దర్శనభాగ్యము లేమిని కళలుడుగు నాకన్నులకు పండువుసేయవా? నీ శాంత మృదుమధుర వచఃశ్రవణము లేమిని శ్రుతిపడిన నాచెవులకు విందొనర్పవా? మిత్రగాత్ర పరిష్వంగ సుఖంబులేని బెండు వారిన మత్కరంబుల గౌరవింపవా? యని యిట్లు వగచుచుఁ బలుమారు పొరలి పొరలివచ్చు దుఃఖము నాపుకొననేరక కొంతసేపు నిశ్చేష్టుఁడై యూరకుండెను.

---

పదియవ ప్రకరణము

# ఏకాంతము

పుష్పమిత్రుఁడిటులఁ బదభ్రష్టుఁడైన పిదప రాణా కొల్వులో నాతని స్థానము నాక్రమింపఁదగిన మంత్రివరుఁ డెవ్వఁడును గానిపించడాయె. కొలువులో నెచటఁ జూచిన నంతయుఁ గలహములే. పుష్పమిత్రుని పక్షమువారు కొందఱు, నాతని విరోధులు కొందఱుఁ గలిసి యెప్పుడును వివాదము లాడుచు నుండెడివారు. వీరి కక్షలను దీర్చుటకుఁ దగినవాఁ డెవఁడును

పోయెను. కొన్నినాళ్ళయిన తరువాత హీరాబాయికిఁగూడ బుష్ప
మిత్రుని వెడలఁగొట్టినందువలన నష్టము కనుపడెను. పాప
మామె యేమిచేయఁగలదు ! నిండు పేరోలగమునందుఁ బుష్ప
మిత్రుఁడు వ్రాసిన యుత్తరము తనచేఁ జిక్కఁ గ్రోధవివశు
రాలై యట్లు వ్రాసినవాని కంత శిక్ష విధించుట తప్పగునా ?
అట్టి వానిని క్షమింపనియెడలఁ బ్రజలు సైతురా ? హీరా
బాయిని రాజ్యకార్య ఘటనములు తెలియని స్త్రీయని నిందఁ
జేయుదురా ? పుష్పమిత్రుని గుణములన్నియు నామెకు విదిత
ములు. నీకు నామెయొక్క దుఃఖ మింతయని చెప్పనలవి
కాదు. పుష్పమిత్రుఁడు సామాన్యుఁడా ? హమీరులాలు
పుష్పమిత్రుని గుణంబులు వర్ణింప మన మేడవ ప్రకరణములోఁ
జదివియే యున్నాము. అట్టి వానిని బోగొట్టుకొని హీరాబాయి
యూరకుండఁ గలదా ? ఇక నామెకు రాజ్యతంత్రములలోఁ
దోడ్పడువారేరి ? ఆపద సమయమున దరిజేరి ధైర్యము
నూదువా రెవరు ? ఆమె యెంత వివేకవతియైన నేమి ? మంత్రి
లేకున్న నామె యెట్లు రాజ్యాంగములఁ జక్కఁబరచుకొన
గలదు ? మంత్రిలేని రాజ్యము నిశానాథుఁడు లేని రాత్రియు,
దినకరుఁడు లేని పవలును, కమలములేని కొలను గదా ?
హీరాబాయి పుష్పమిత్రుని వెడలఁగొట్టినదాది కన్నార నిద్దురఁ
గాంచుటలేదు; కడుపార భుజించుటలేదు. మామూలుగాఁ
గచేరికి వెళ్ళుటలేదు. చిత్తూరు నగరమంతయు వన్నెవాసి
కడుదీనభావము వహించెను. ఏయింటఁజూచినను సందడిలేదు.
సంతోష మంతకు ముందే లేదు. ఏగృహము జూచినను పాడు
పడిన యింటిపగిదిఁ గన్పట్టు చుండెను. దేవిగారి కోటలో
దాసదాసీజనంబుల కలకలమే లేదు. అంతఃపుర స్త్రీ లందఱుఁ

చింతా వ్యాకులితయై సంతాపాబ్ధిలో మునింగి దీర్ఘనిద్రం జెందు వారివలెం గన్నులు మూసికొనుచుండెను. హీరాబాయిని జూచినవా రెవ్వరు నామెను బట్టమహిషిగా దలంపరు. ఆమె మలినాంబర ధారిణియై కళారహిత వదనయై [illegible] జాలనంత స్థితిలో నుండెను. పుష్పమిత్రుని [illegible] నామె తనయంతఃపురములోని [illegible] ములు మూసి [illegible] ముల [illegible] జాలక [illegible]. పుష్ప మిత్రునిపై నామెకెంత యాశకలదో కదా! అట్టివాడు తన కన్నివిషయముల నెంత తోడ్పడెడి [illegible] భావించెనో కదా! హీరాబాయి యీయుత్తరము నమ్మి తనలో నిట్లను కొనుచుండును.

"హా పుష్పమిత్రా! నిన్నెంత నమ్మితినోయీ! బాల్యము నుండియుం జిత్తూరు నగరంబుననుండి పెద్దవాండవైనం దరు వాత రాణావారికి మంత్రివై, సకలవేదాంత మర్మముల, సర్వ రాష్ట్రీయ రహస్యముల నెఱింగిన నీవేనా యిట్లొనర్చుట! తురుష్కులం బొడగనిన, మృగసంచయముల పైకెగయు పంచాస్యంబనబరంగు నీవా యిట్టి యుత్తరము వ్రాయుట! ఏమి? మిగుల సందేహాస్పదముగా నున్నదే! చిన్నప్పటి నుండియుం గడునమ్మికతో సంచరించువారే యిటుల మోస పుచ్చుచు నుండ నిక నెవరిని నమ్మవలయు? మానవులు మాన వులనమ్మక మఱి యేదానవుల నమ్మవలయు! అయ్యో! నిజ ముగా బుష్పమిత్రుండే యీ యుత్తరమును వ్రాసెనా లేక యిది కల్పితమా? ఓయీ సర్వమయా! నీవైనం జెప్పరాదా? దైవముకూడ నాకు బ్రతికూలుం డయ్యెనుగదా! అయినను

నేనిట్లు చింతింపనేల! నిజముగా పుష్పమిత్రుఁడే యీ యుత్త రమును నా కిట్లు వ్రాసియుండవలయును. కాకున్న నింకొకఁడు వ్రాయ నేర్చునా! ఈయుత్తరమునందేయుఁ జిత్తూరు నగర ములోనుండి మహారాష్ట్రుని గుట్టంతయు రట్టుచేయ వానికిఁ దక్క మఱియొకనికి శక్యమా!" ఈ రీతిఁ గొంతసేపు విచారించి యికఁ జింతించిన లాభము లేదని దలఁచి మరలఁ దెలివిఁ దెచ్చు కొని యూరకుండెను.

భాస్కరసింహుఁడు శోకరోదన మీరాబాయి చింతాకుల స్వాంతయై యున్నసమయంబున నచ్చోటి కేఁగెను. అపుడు మీరాబాయి యాతనిఁ జూచి విచారము నొందుటమాని ధైర్యముఁదెచ్చుకొని తమ్ముఁడా! ఇటురమ్మని తనచెంతనున్న యొక కుర్చీమీఁదఁ గూర్చుండ నియమించెను. అతఁడు కూర్చుండిన పిదప నామె కుశలవార్తలడిగి, శీతలోదకమును తెచ్చి యిండని యొక పరిచారిక కాజ్ఞాపించెను. ప్రయాణము వలనఁ జాల దాహముఁగొన్నవాఁడు గావున నాశీతలోదకముఁ ద్రావి భాస్కరసింహుఁ డల్లన విశ్రమించెను. కొంతసేపటికి మేల్కాంచి తన సోదరితో నిట్లు సంభాషించెను.

భాస్క:—అమ్మా! మనమంత్రియగు పుష్పమిత్రుఁడు క్షేమముగా నున్నాఁడా?

మీరా:—సోదరా! హాయిగా మనము మన బంధుగుల కుశలవార్తల ముచ్చటించుచుండ నా కులద్రోహి పేరుఁ దెచ్చి నాకేల సంతాపము గావించెదవు! వాని పేరు నాకడ నుడువకుము.

భాస్క:—ఏమి! అమ్మా! నేను పుష్పమిత్రునివిషయ మడుగుచున్నాను. మఱియొకరి సంగతి కాదు. మన పుష్ప మిత్రుని విషయమే!

వీరా:—అవును: నాకది తెలియును. వాఁడు మన పుష్పమిత్రుఁడు కాఁడు. ఒకవేళ నీయొక్క మిత్రుఁడు కావచ్చు గాని నాకు మిత్రుఁడు కాఁడు; శత్రుఁడు.

భాస్క:—అమ్మా! నాకు మీమాటలు వినినఁ జాల వింతయగుచున్నది. పుష్పమిత్రుఁడేమి! మీకు శత్రువగు టేమి! మీరు కలవరించుచున్నారా యేమి!

వీరా:—సోదరా! యింతకుబూర్వమే నిమరమేల్కాం -చిన నీవు కలవరించవలెను గాని యన్నివిధముల మేల్కాంచి ప్రవర్తించు నే నెట్లు కలవరించెదను?

ఈ మాటల వినినతోడనె భాస్కరసింహుని హృత్పీ ఠిక చలించెను; యొడ లడలసాగెను; నేత్రయుగ్మమున నీరు గ్రమ్మెను. అయినను ధైర్యముఁదెచ్చుకొని యిట్లుయోచించె. 'ఏమి! పరునిసహితము మాటాడువేళఁ గసరికొట్టని యీామె సోదరుఁడ నగు నన్నిటుల నిష్ఠురోక్తుల నొవ్వఁజేయుచున్నదే! దీనికేదియో తగుకారణ ముండవలయును.' అని మరల సంభా షింప సాహసించెను.

భాస్క:—అమ్మా! పుష్పమిత్రుఁడేదైనదోష మొన రించెనాయేమి? నేను వినఁగోరెద.

వీరా:—లేదు; లేదు. అతఁడు నిర్దోషి, నేను దోషిని. అతఁడు నాయెడల దోష మొనరించునంతటి వాఁడా?

భాస్క:—నేని యెడలఁ దమ రిట్లాతనిపైఁ గినుక వహింపఁ గారణమేమి!

హీరా:—నేనాతనిపైఁ గినుక వహించినట్లు నీ కెట్లు తెలిసెను? సోదరా! అన్నియు నీవోటనే నుడువుచున్నాఁడవు. నే గినుక వహించియుండిన నది వేఱొకనిపైఁ గాఁగూడదా?

భాస్క:—అమ్మా! నేను మొదటినుండియు నింతవఱకు బుష్పమిత్రుని గుఱించినదే మాట్లాడుచుండుటఁ బట్టియు నేనడిగిన ప్రశ్నలకు మీరు సరియగు నుత్తరమ్ములఁ జెప్పక నాగ్రహ మనస్కులయి యుండుటచే నిటు లూహించుటకును గారణమయ్యెను.

హీరా:—అయినను సోదరా! నీ వా స్వామి ద్రోహుని వృత్తాంతము నాయొద్దఁ జెప్పి యూరక నిష్కారణ వైరము బెంపఁదలఁచెదవేల? అతఁడు మా చిత్తూరునగరములో నుండ వలసినంత కాలముండి యాతనిపని తీరగ మాపురిఁ బాసి వెళ్ళినాఁడు.

భాస్క:—అట్లయిన నాతఁడిపుడు మీరాష్ట్రమునుండి వెడలిపోయెనా యేమి?

హీరా:—వానిని వెళ్ళవలసినదని యాజ్ఞాపించితిమి. అందు వలన నాతఁడు వెళ్ళిపోయెను.

భాస్క:—అమ్మా! అతఁడు రాజ్యమునుండి వెడలిపోయి నందుకుఁ గారణముఁ జెప్పవేఁడెద. ఆగ్రహపడవలదు.

హీరా:—అటులయిన వినుము. ఆతఁడు తురుష్కులతోఁ గలిసి సంచరించుచున్నట్లొక యుత్తరము మాకుఁ జిక్కినది.

దానిమీఁద నట్టివానిని రాష్ట్రములో నుంచఁగూడదని తలఁచి వానిని రాజ్యమునుండి వెడలఁగొట్టితిమి.

భాస్క:—అమ్మా! అతఁ డట్లు జేసియుండునని మీరు విచారించితిరా!

హీరా:—సోదరా! విచారించితినో లేదో నీకు నేను చెప్ప నవసరము లేదు. నీ వడిగినదానికి సమాధానము జెప్పితిని. ఇక నన్ను మాఱడుగవలదు.

భాస్కరసింహుఁడు మరల దర్కించి యడుగఁ జర్విత చర్వణంబగుననియు, నదియును గాక దేవిగారికి మఱింత యాగ్రహము గలుగుననియుఁ దలంచి కొంచెము సేపయినఁ దరువాత దేవిగారు శాంతినొందెదరని యూహఁజేసి యావలకుఁ బోయెను. అంతట నామెకూడ మఱియొక గది లోనికిఁ బోయెను. కొంచెముసేపటికి భాస్కరసింహుని హీరాబాయి పిలువఁబనిచి, సోదరా! యింతదనుక మన కిదివఱకు జరిగిన సంభాషణలోఁ బ్రసంగవశమున నేను నిన్ను తూలనాడియుండవచ్చును. కనుక నన్ను క్షమింపఁగోరెద నని వినయపూర్వకముగఁ జెప్పెను. అప్పుడు భాస్కరసింహుఁ డదియే యదనని తలఁచి 'అమ్మా! నిష్కారణముగ నా కల్పితపత్రిక నమ్మి మనఁ గష్టకాలమందుఁ గాచునట్టి పుష్పమిత్రుని రాజ్యమునుండి వెడలఁగొట్టితిరి గదా' యని మెల్లగా ననెను. హీరాబాయి కూడ నిజముగఁ బుష్పమిత్రుని యెడ నేవిధమగు కల్మషవృత్తియు లేనిది గావున భాస్కర సింహునితో నిట్లుచెప్పెను. సోదరా! గడచిన పనికై వగచుట గతజలబంధనమగుఁగాన నిక విచారింపఁ బనియేమి! విధికి

ప్రాచీనదాస్యమై మానవహృదయమున నటుల జేయవలసివచ్చినది. అప్పుడు నాకు న్యాయస్థానములలో విచారణఁ జేయుటకుఁ గూడ మనస్కరించదైకాదు. అయినను కొంతకాలమైన తరువాత నిజము వెలువడక మానదు. జారచోరాళి నీచకృత్యము లోకుల కంటబడక యెప్పటికిని మాటుమణగి యుండఁగలవా? కొలఁదికాలమున దాసినను నిజస్థితిఁ బిమ్మటనైన జను లారయరా?

భాస్క:—అమ్మా! అప్పుడు వెలువడిన ప్రయోజనమేమి? మన పుష్పమిత్రునిఁ బోగొట్టుకొంటిమి గదా! అట్టి మిత్రుఁడు మనకు జన్మశతంబులకైన దొరకునా? లేక జన్మసహస్రంబుల కైన దొరకునా? లేదు, లేదు.

హీరా:—సోదరా! నాకిఁక నా సంగతిఁ దలఁపునకుఁ దీసికొని రాకుము. నాకు దుఃఖ మెక్కుడగు చున్నది.

ఇట్లు చెప్పి హీరాబాయి యచట నుండనోల్లక దన యంతఃపురమున కేఁగెను.

---

## పదునొకండవ ప్రకరణము

# పేరాస

ఆశ సక్రమమైన, సౌఖ్యంబు గూర్చు
క్రమముదప్పిన నదియె ముప్పుం దెచ్చు
ఆత్మవిషయాభివృద్ధికై యహరహంబు
నాశ హితకరమగుం గాని, పేరాసతగదు.

శతసింహాదులు పుష్యమిత్రుని రాజ్యమునుండి వెడలించి నందుల కమందానందముచే నోడలెఱుంగక నిజేచ్ఛను విహరించుచుండిరి. ఇట్లుండుటయే గాక ప్రజలందఱికి నానాటికిం నా యుత్తరమును జెప్పికిం దెప్పుచు లేనిపోని కొండెములఁ గూడఁ గల్పనఁజేయుచుఁ బుష్యమిత్రునియం దెక్కుడు ద్వేషము కలుగునటుల చేయుచుండిరి. వీరెన్నికల్పనల జేసి ప్రజలకు బోధించినను వీరిమాజ్ఞ జెట్టినా రేమియు లేదుకదా! ఇక వీరిష్టానుసారము రాజాగారి కొల్వులో నధికగర్వమున మెలఁగుచుందురు గదా! ఇట్టి చెడునడతల నడచుచుండినను వీరిపై నంకుశమువలె నుండు పుష్యమిత్రుఁడు వీరి చెంతలేఁడు గదా! అట్టి యంకుశమే యుండినచో వీరిట్లు సంచరింపరు. పుష్యమిత్రుఁడు లేకున్న నీ మానవరూప మహోరగంబులు తమ తల లెత్తకుండ మొత్తఁజాలు చంద్రబాహుఁడైన లేఁడు కదా! పుష్యమిత్ర చంద్రబాహు లున్నంత కాల మీ దుష్టు లా మార్గమునఁ బోయెడువారు కారు. ఆ పురుషయుగ్మమన్న వీరి కొక బెబ్బులి జంటగా నుండెనుగాని వేఱుకాదు. ఇప్పుడు వీరు పుష్యమిత్రునికంటె నెక్కుడుగాఁ బరిగణింపఁబడు చున్నారు. “గోవులేనియూర గొడ్డుబోతు శ్రీమహాలక్ష్మి”

యను చందమున హీరిప్పటికాలములోఁ జిత్తూరు నగరమున హీరాబాయి కొలువులో నగ్రగణ్యులుగా నుండిరి. వీ రితరుల చెంతనెట్టుల సంచరించు చుండినను హీరాబాయి సమక్షమున మాత్రము కడు వినయముతో సంచరించుచుండెడి వారు. వీరిలో నాలవవాఁడగు హమీరులాలుగూడఁ బుష్పమిత్రుఁడు రాజ్యమునుండి వెడలిపోయెననుసంగతి వినినంతనె యపరిమితా నందము నొందెను. ఈ దుష్ట చతుష్టయమునకు మొదటి నుండియు రెండుముఖ్యమయిన కోరికలు గలవు. ఈ రెండు కోరికలు దుదముట్టుటకై వీరు పలుబాట్లు పడుచుండిరి. వీరిలో మొదటిది పుష్పమిత్రుని రాజ్యమునుండి వెడలగొట్టుటయే. ఇది సమకూరెను. వీరి యాశలన్నియు సిద్ధినొందవలెనన్నఁ బుష్పమిత్రుని బరిమార్చవలెను. కాని లేకున్న వీరి యాటలు సాగిరావు. పాప మీ దుష్టచతుష్టయము పన్ను త్రోవల కన్నిఁటికిఁ బుష్పమిత్రుఁడు పెనుగొండయై యుండెడివాఁడు. అట్టివాని నెట్టులనో సాగనంపిరి. ఇఁక రెండవ యాసగూడ గొనసాగవలయును. ఇది హీరాబాయినిగూడ బరిమార్చుటయే. ఆహా! వీరి యాశకు మితిలేదు కదా! ఆమెనుగూడఁ బరి మార్చి సర్వసామ్రాజ్యాధిపత్యము వహించుటకుఁ గాఁబోలు వీరిట్లు దురాలోచనలఁ జేయుట! ఆహా! పేరాశ యెంత పనిగావించును! దీని విషయమై వారలతి నమ్రతతో హీరాబాయి కనుపడి నప్పుడెల్లను వంగి వంగి నమస్కారములఁ జేయుచు నామె కెప్పుడు కోపము వచ్చునో యని వణకుచు వెంట భృత్యులవలెఁ దిరుగు చుందురు. పాపము! కపటము గలవైన నెటుగని హీరాబాయి కీ సంగతి యణుమాత్రమైన దెలి యదు. ఆమె వీరు తనయందు నిజముగ గౌరవభావముతోఁ

దినుచున్నా రనుకొనును గాని వీరు దుర్మార్గులనియు కుయుక్తులు గలవారనియు స్వప్నమందైనఁ దలఁచుటలేదు.

పుష్పమిత్రుఁడు రాజ్యమునుండి వెళ్ళిన తరువాతఁ గొలఁదిరోజులవఱకు రాణావారికచేరియు నితరుల కచేరీలును వారిదక్షిణ యుండెనని మనపాఠకులు గ్రహింతురు ! అట్టిదినములలో ఫతెసింహాదులు దేవిగారి యంతఃపురమున కేగి యామెతో "అమ్మా ! అదుష్టుఁడగు బుష్పమిత్రుఁడు రాజ్యము విడిపోయినపిదప సంతోషముగ నుండుటకుమాని చింతాకుల స్వాంతులై యుండుటేల ? మేము తమ భృత్యులము. మీరేమి యాజ్ఞాపించిన మేము చేయకుందుము ? మీరాజ్యమున కేమి కొఱఁతగలిగినదని మీరిట్లు వగచుచుందురు. పదివేల గజశ్రేష్ఠములుండ, నలువదివేల తురంగములుండ నాజిలో నెట్టిశత్రువునైన డీకొనునట్టి పరాక్రమోపార్జునులుండ, నెట్టి కార్యమునైన నిమేషమాత్రమున గోటమీటుకొని రాఁగల భృత్యశతంబులుండ, రాజ్యకార్య తంత్రంబుల నాలోచనలఁ జెప్పుటకు మాబోఁటి యమాత్యశేఖరు లుండ నింక మీకేమి కొదువ ? అమ్మా ! మామనవిఁ జెవినిడి యీరోజునుండియు రాజ్యంబును యథావిధిగ నేలవలయు. ఆ యథమునకన్న మేము నూఱుమడుంగు లెక్కుడుగా రాష్ట్రముఁ జక్కఁబఱుప గలమని యనేక మృదూక్తులఁ బలికి యామెనూరడించుచుండెడివారు. ఆమెగూడ నెంత దుఃఖములోనున్నను వీరి మాటనమ్మి తాత్కాలిక శాంతినొందుచుండెడిది. కానివారా స్థలమును వీడగనె మరల యథారీతిని వగచుచుండెడిది.

దుష్టచతుష్టయము వీరాబాయియొక్క సంగతిఁ బలుమారుచూచి వేసారి, యామెను బ్రతిమాలినను లాభము

లేదని తలంచిరి. మీరాబాయి పుష్పమిత్రునియందే కష్ట నమ్మికతో నున్నటుల వారు భావించి యిక దమయాటలు సాగవని లోనదిగులొందఁజొచ్చిరి. పాపము ! నిజముగా వారు తలంచినటులే యయినది. దినము వెంట దినము గడుచుచుండెను. కచేరి యెప్పటివలె నుండెను. రాజ్యమల్లకల్లోలమగు చుండెను. ఎంతవఱకును మీరాబాయి మరి తిరుగకుండెను. దీనిఁజూచి వారందఱు బెరాస దుఃఖ కారణమనుట నను భవముచే నెఱిఁగినవారై యామెకుఁ దాము బ్రతికక్షులోనివార మని బహిరంగముగ జెప్పుట కుద్యుక్తులయిరి. ఇటుల గొన్ని రోజులు గడచినపిమ్మట వారొక యుత్తరమును మీరాబాయి కంపిరి. దానిలో దామిన్నాళ్ళనుండియు నామెయెడ నిష్కారణముగ భృత్యులరీతిఁ జరించుట లేదనియు, నామెయందు మొదటినుండియు శత్రుభావమునే వహించి యుంటిమనియు, నిక గుట్టంతయు నెఱిఁగినవారమై పాదుషాపక్ష మవలంబించితి మనియు వ్రాసిరి. ఆయుత్తరము నొకభటునిచేతికిచ్చి యితరుల కెవరికి నియ్యక మీరాబాయికే యిమ్మనిచెప్పిరి. ఆభటుఁడటులే యంతఃపురమున కేఁగెను. తత్సమయమున మీరాబాయి యనివార్య సంతాపాబ్ధిలో మునిఁగియుండెను. అట్టుండియు నామె యా యుత్తరమును దీసికొనెను. ఆమె దానిలోని విషయముల నప్పుడు చూడలేదు. అత్తఱి భాస్కరసింహుఁడు గూడ నచటనే యుండెను. అతఁడుకూడ మీరాబాయి యాజ్ఞ లేనిది యా యుత్తరముఁ జూడనొల్లక యూరకుండెను. భాస్కరసింహుని మీరాబాయి ఎంత గసరికొట్టుచున్న నాతఁడు పుష్పమిత్రునియందు బద్ధానురాగము గలవాఁడై యాతని పక్షము గుఱించియే మాట్లాడుచుండెడివాఁడు. మీరాబాయికిఁ

గోపము వచ్చునేమోయని జంకి యాతఁడు పుష్పమిత్రుని గొనియాడుట మానునా? లేదు. పుష్పమిత్రుఁడన్న భాస్కర సింహునకు బహిఃప్రాణముకాని వేఱొండుకాదు. వేయికష్ట ములువచ్చి భాస్కరసింహు నావరించిన నాతఁడు పుష్ప మిత్రుని స్మరణ మానఁడు. అతనిపైగల ప్రేమానుబంధంబు వీడఁడు. పరులకోపమున కోడఁడు. ప్రజల యాక్షేపణకు వెఱచి మఱే యితరకార్యమునైన జేయఁగలఁడుకాని, చిర కాలమునుండియు నొండొరుల శల్యాంతర్భాగములఁ జిక్కు కొని మెలివేసికొనియున్న యనురాగలతను కోసివేయఁగలఁడా? అయ్యది శక్యమా? దినములు గడచినకొలఁది వీరాబాయి యున్నపానాదుల నొల్లక గఱుఁ గృశించుచుండెను. ఆ పుత్రుల ప్రియాలాపములచే నామె యాదుఃఖముఁ బాయుచుండెను.

---

పంద్రెండవ ప్రకరణము

# సంతాపము

పుష్పమిత్రుఁడు రాజ్యమునుండి వెడలిపోయినసంగతి యుదయసింహునకుఁ గొన్నిదినములకుగాని దెలియలేదు. ఏల యన నుదయసింహుఁ డెప్పుడును తన సౌధములోనుండి సాధా రణముగ బయటకురాకుండును. బయటి కొకవేళ వచ్చినను తన సౌధద్వారమునందుండు భటులతోఁ దప్ప మఱెవరి తోడను మాటలాడఁడు. తన రాష్ట్రములో నేమి జరుగుచున్న దియో యొకరోజైన నాతఁడు తెలిసికొనఁ గోరడాయె. ఉదయ సింహుఁడు రాజ్యాధిపత్యమును వహించి యుండినపుడే తన రాష్ట్రములో జరుగు సంగతులఁ దెలిసికొనఁగల్గుట తక్కువ.

ఇఁక వీరాబాయి సర్వాధిపత్యము వహించినప్పటినుండియు
నా స్వల్పముకూడఁ బోయినది. అప్పటిలో నతనికి నెత్తిమీఁది
కొంత క్రిందికి దింపినట్లాయెను. పుష్పమిత్రు నితఁడు బాగుగ
నెఱుఁగునుగాన నాతని వృత్తాంతము వినినప్పటినుండియుఁ
జాల విచారముతో నుండెను. ఇంత విచారముతో నుండు
నాతఁడు వీరాబాయి కడ కేఁగి తగు కారణ మారయఁడాయె.

ఉదయసింహునిసంగతి యిట్లులుండ నిక వీరాబాయి
తన యంతఃపురములో నెట్లుండెనో యొకతూరిఁ జూతము.
ఆరోజున భటుఁడు తీసికొనివచ్చి యిచ్చిన యుత్తర మాపె
బల్లమీఁదనే యుండెను. ఆదుఃఖాబ్ధిలో నామె దానినిఁ జూడనే
లేదు. తరువాత భాస్కరసింహుఁ డాయుత్తరము విషయమై
వీరాబాయికి జ్ఞప్తిఁ జేయగా నామె తటాలున లేచి యా
యుత్తరముఁ దీసికొని చదివెను. చదివినతోడనే యామె
కాళశక్తిరీతి మండిపడి, లోపలినుండి వచ్చు తీవ్ర క్రోధాన
లముచే మాటలు తొట్రుపాటొందఁ గొంచెమునే పూరకుండి
తరువాత నయనంబుల నగ్నికణంబుల రాల్చుచు హా!
ఖేతసింహా! ఓరీ కులద్రోహులారా! యని మూర్ఛిల్లెను. ఆమె
యిట్లు మూర్ఛిల్లుటఁజూచి భాస్కరసింహుడుగూడ నా యుత్త
రముఁ జూడనెంచి దానిని దీసికొని చదివెను. చదివినతోడనే
యాతఁడుగూడ మూర్ఛావశుఁ డాయెను. కొంచెముసేపయిన
దరువాత వీరాబాయి లేచి ఇట్లనుకొనసాగెను. ఓరీ! ఖేతసింహా!
నీవు రసపుత్ర కులమునం దెల జనియించితివిరా? సర్వకలా
పరిపూర్ణుఁడగు నా నలువకూడ నిన్నెటుల నీ పవిత్ర రసపుత్ర
వంశమునం దుద్భవించునటుల జేసెరా? చిన్ననాటినుండియుఁ
జిత్తూరునగరమునందు రాణావారి కొల్వులోఁ గుక్కతినినటుల

దిసి నే చేతులు నా తురుష్కుని పాదములఁ బట్టితివిరా? నామీద నీకుఁ గ్రోధముండినట్లయిన నీ కులమునైనఁ జూడక పోయితివిగదా! ఓరీ! నీచా! నిన్న మొన్నటిదాక దినుట కేమి యు లేక చచ్చుచున్న నీకింత నన్నుమిఁద నా విశ్వాసమైన నీకు లేదుకదరా? ఓరీ! కృతఘ్నుఁడా! పరమ మిత్రుఁడనని దలఁచి నీకు నా రాజ్యముయొక్క గుట్టంతయు బయలు పుచ్చితిఁగదరా?

ఓరీ! అభయసింహా! పుట్టినదాది మొన్న మొన్నటి దాఁకఁ జిత్తూరునగరమం దింటింట నింత బిచ్చ మెత్తుకొని జీవించుచుండిన నీవుకూడ నిటులఁ జేయుటకు సాహసించితివిగా! సుమారు రెండుమాసముల క్రిందనేగదా నేను నిన్ను ముప్పది రూప్యముల వేతనముమీద నా కొల్వులో నియమించినది? పైకెంతవిధేయతగ గన్పట్టినను నీ బొట్టలో నెంతటి విష మున్నదిరా? ఆహా! కుక్కకు నెయ్యి యిముడదన్నట్లు నీవంటి మనుష్యునకు మా కొల్వులోని సొమ్ము దక్కునటరా!

ఓరికుంభరాణా! కులకలంకా! నీవుకూడ నిట్లయితివా? స్వప్నమందయిన నీకు నే నెట్టి యపకారముఁ జేసి యెఱుఁగనే! ఇంటఁగుడిచి యింటివాసముల లెక్కించినట్లు మే మింతగంజి నిడుచుండ హాయిగఁగుడిచి గూర్చుండలేక మమ్ముల సాధించుపని నీ కేలరా? ఓరీ! కులభ్రష్టా! నే నెన్నివిధముల నిన్ను వృద్ధిలోనికిఁ దీయదలఁచితిరా? ఓరీ! దుర్మార్గులారా! మీ దౌష్ట్యము నడగింప దుష్టమానవ భయంకరుఁడగు మా చంద్రబాణుఁడు లేఁడే! అయిన నేమికొదువ? మీరుముప్వు రును నా రాజ్యమువీడి యా పాదుషాచెలిమిఁ జేసినంతమాత్ర నె,

నాకు లోబడునని తలంచితిరా ? మీరా పాదుషాతోc గలసి
యుండెనన్న నెపముతో మా చిత్తూరునగరముమీదికి వచ్చినను
మేముగూడ శౌర్యమున్నంతవరకుc బోరాడి తుద కాత్మ
హత్యc గావించుకొందుముగాని తుచ్ఛులగు మ్లేచ్ఛుల మా
తనువుల నంటనిత్తు మనుకొంటిరా ? నీచులై, క్రూరులై,
మానవాధములై, సర్వజనకంటకులై, యభిమానము బాసిన
నాడి లోకమునైనc బాటింపక మీరా మ్లేచ్ఛాధము నాశ్ర
యించి వాని పాదములc గడిగి యా నీటిc ద్రావుచున్నారు
గాని, శూరులై, పూజ్యులై, మానవశ్రేష్ఠులై, సకలజన రంజకు
లగు రసపుత్రవీరులందఱు మట్టుమణిగి యున్నారనుకొం
టిరా ? మీరీతిc బుంసత్వముc బోవిడచి యంటుగాజుల దొడిం
గుకొని మూలనున్నారనుకొంటిరా ? రసపుత్రవీరుల శౌర్య
ధైర్యములను, రసపుత్రవీరాంగనల పతివ్రతా ధర్మములను
మీ రెఱుంగరటరా ? మీ రా హీనుని చెంతc జేరినంతమాత్ర
మున మీ నైజగుణములను లోకమునకు వెల్లడి చేసితిరిగాని
మా కేమైన గీడు మూడునని యెంచితిరా ? లేదు, లేదు,
నేను త్రిశుద్ధిగc జెప్పుచున్నాను. మా రజపూతవీరుల [illegible]
లలోc బ్రాణము లున్నంతవరకును మేము మిమ్ము విడువ
మురా ! సర్వేశ్వరుని కృప బాగుగనుండినచో మీరు మాకుc
జిక్కకపోరురా !

అని కసిదీర వారినిc బరుషోక్తులాడి హృదయాంతరం
గము నుండి వెగలివచ్చు సంతాపానలముచే డస్సి యచ్చటనే
పరుండెను. ప్రియమిత్రునిc బోగొట్టుకొనినందులకే సగమైన
యా యబలామణికి 'గోరుచుట్టుపై రోకటిపోటుc బడి' నట్లీ
ఘోర వార్తకూడ నెంతహృదయాందోళనc గావించెనో

కదా ? ఎట్లులయినను వీరాబాయి మనోధైర్యమును వీడక, కానున్నది కాకమానదని తలంచి, యారీతి నెల్లప్పుడును దుఃఖములో నుండిన రాజ్యమంతయు నల్లకల్లోలమగునని యెంచి తనదృష్టి నప్పటినుండియు రాజ్య కార్యాలోకనార్థము త్రిప్పెను. రాజ్యముఁ జక్కఁబరుపవలెనన్న నామెకుఁ బుష్పమిత్రునివంటి మంత్రివరుఁ డొకఁడుండవలయును. అట్టివాఁడిప్పుడామె కెచ్చోట నెట్లులలభించును ! ఆ విషయమై యామె చాలరోజులు విచారించినది కాని యామె సంగతి "యొడిలో బిడ్డనిడుకొని యూరంతయుఁ గలయదిరిగిన" ట్లాయెను. దైవవశమున నామెకు బుష్పమిత్రుని సమానుఁడే దొరకెను. ఇతఁడు మిహిరకుమారుఁడు. పుష్పమిత్రునిపుత్రుఁడు. మిహిరకుమారుఁడు రూపరేఖావిలాసంబుల విద్యావైపుణ్యమునఁ బూర్ణముగఁ బుష్పమిత్రుని బోలియుండును. వీరాబాయి మిహిరకుమారుని మంత్రిగా నెన్నుకొన నిశ్చయించి ప్రజలందఱికి నాసంగతి దెలియఁజేయ నొక్కచో బహిరంగసభ గావించెను. ఆసభ కందఱును విచ్చేసిరి. ఉదయసింహ రాణావారుకూడ వచ్చిరి. నాటి సభాభవనమంతయుఁగడు చిత్రములగు నలంకారములతో నిండియుండెను. పురజనులందఱు సామంతరాజులును రాణావారి బంధుజనమంతయూ నా సభనలంకరించిరి. అప్పుడు వీరాబాయి లేచి సభాస్తారు లందఱితో నాదినము వారందఱచట సమావేశమగుటకు గారణము నుడివి, మిహిరకుమారుని మంత్రిగా నొనర్చుట కేదైన నాక్షేపణగలదా ? యని ప్రశ్నించెను. అందులకాసభకు విచ్చేసిన వారందఱేకగ్రీవముగ నెట్టి యాక్షేపణయు లేదని సంతోషముతో ప్రత్యుత్తరము లిచ్చిరి. మిహిరకుమారు నెన్నుట సర్వజనాంగీకారము కాగా వీరాబాయి

యొక పుష్పహారము దెప్పించి వానికలంకృతి గావించెను.
జనులందఱుఁ గరతాళధ్వనులతో దమ యమందానందమును
వెల్లడిచేసిరి. ప్రతి రసపుత్రవీరుఁడును వికసితాంతరంగుఁడై
యుబ్బి తబ్బిబ్బు లగుచుండెను. తరువాత వారందఱుఁ దమకుఁ
బుష్పమిత్రుఁడుండు రోజులు మరల వచ్చినవనియు, నిక
నెప్పటియట్టుల జిత్తూరునగరము శోభఁజెందఁగలదనియు, రస
పుత్రులందఱు నూతన తేజస్సులతో నిజశౌర్యములఁ జూపు
చుందురనియుఁ దలఁచిరి. మిహిరకుమారుఁడు కూడ దన
జనకుని స్థాన మధిష్ఠించి దేవిగారియెడఁ గృతజ్ఞుఁడగు తన
తండ్రివలె దానకూడ గీర్తి సంపాదింపఁ బ్రయత్నించు
చుండెను.

---

పదమూడవ ప్రకరణము

## శంకర మఠము

ఆరావళీ పర్వతప్రాంతముల రజతపురమను నొకగొప్ప
పట్టణము గలదు. ఆ పట్టణములోని రసపుత్రులు రాఠోడ్
వంశజులు. రసపుత్రులలో రాఠోడు లొక తెగవారు. వీరు
మిగులఁ బౌరుషవంతులు. మిగిలినజాతి రసపుత్రులకన్న
నెక్కుడు ధైర్యము గలవారు. వీరందఱు మిగుల ధనవంతులు.
ఎట్టి సాహసకృత్యమునకైనను వెనుకంజ వేయువారు కారు.
ఈ రజతపురము దాటినది మొదలు పైకి పోనుపోను అటవి
ప్రదేశము. ఎచటఁజూచినను గుట్టలే. ఏవైపు దిలకించినను కర్ణ
ములఁ దిమ్మెరవోవు శబ్దములతో దుముకు సెలయేటిబారులే.
అయ్యది గ్రీష్మర్తువగుటఁజేసి, మధ్యందిన దినకరాతపతైక్ష్ణ్యం
బున భూనభోంతరాళమంతయు మలమల మాడుచుండెను.

అజాంతమంతయుఁ జండకరుని సహస్రకిరణానల జ్వాలలం
జిక్కినో యన నిశ్శబ్దత వహించెను. కనుదృష్టి మేర నెటుఁ
జూచిన బాంధజనుల కడియాసలఁ గొల్పు మృగతృష్ణా ప్రవా
హంబు లే. ఎటుఁజూచిన నా ప్రదేశమున నరసంచారమే లేదు.
విహంగ సంచార మంతకుముందే లేదు. మైళ్ళకొలఁది నెటుఁ
జూచినను సలసలఁగాగు సైకతస్థలము లేగానియించుక సేపు సేదఁ
దీర్చుకొనుటకు భూరుహ మొక్కటియైనఁ గానరాదు. అట్టి
సమయములో నెవరో యిద్దఱు మనుష్యు లాదారి నుండి
పోవుచుండిరి. పాపము వారు పిపాసాయత్తచిత్తులై యెంతకుఁ
దాళలేక గాబోలుఁ దడబడు చరణంబులతో నెట్టెదుటలో
దగ్గరగాన్పించు సెలయేటి దగ్గరకేగి తమ దాహముఁ దీర్చు
కొనఁదలచిరి. మిగులఁ గష్టముతో నెట్టులనో యా సెల
యేటిదగ్గర కేగిరి. వారెంతతొందరగా నేగవలయునో కాని
యచటి నిర్మలోదకముఁ గనుపారఁ ద్రావి మరల నాదారిని
బడిపోవుచుండిరి. ఆ సుందరమూర్తుల శరీరములు మేలిమి
బంగారమును దిరస్కరించుచుండెను. వారిలో పెద్దయగు
నాతఁ డొకబైరాగివలె గానుపించుచున్నాఁడు, అతఁడు
కంఠమునుండి బొటనవ్రేళ్ళవరకు జీరాడు కాషాయవసనమును
ధరించి, తలకురు లాననంబునకు దగ్గఱగా మెలిబెట్టి, యొకచేఁ
గమండలువునూని మఱియొకచేత ఛత్రముఁదాల్చి, చరణం
బులఁ బాదరక్షల దొడిగి కడువేగమున నడచుచుండెను.
అతనిపేరు గోకులదాసు. రెండవమనుష్యుఁ డాతనికన్నఁ జిన్న
వాఁడు. దీర్ఘబాహువులు కలవాఁడు. ఇతఁడుగూడఁ బెద్దవాని
వెంట తొందరగా నడచుచుఁ దాపమున కాగలేక తాళవృం
తము గైకొని విసరుకొనుచుఁ బోవుచుండెను. ఈ చిన్నవాని

సహజసౌందర్యమునుబట్టియో లేకయాతనినామధేయమదియో కాని పెద్దవాఁడీతని 'సుందరా' యని పిలుచుచుండెను. ఏదైననేమి? మనము ప్రస్తుతమాతని సుందరుఁడని పిలుతము. అప్పుడప్పుడు దారిలో నా బైరాగి యెండవేడిమి కోర్వలేక 'జయ్ సీతారామభగవాన్' యని బిగ్గఱగా నఱచుచుఁ బోవుచుండెను. గగనమండలమున దివాకరుఁడు కడు తీక్ష్ణగతి నుండుటచేఁ గాంతి కడు స్వచ్ఛముగా నుండెను. అందుచే బాటసారుల కన్నోయి కించుకఁ జంచలత్వ మొదవుచుండెను. ఇటులఁ గొంతదూర మేగగా నాబైరాగి మఱింత దాహముచే దగ్గరనున్న మఱొక వాగుకడకేగి యచటదాహముఁ దీర్చుకొనెను. కడుపార నా నిర్మలోదకముఁ గ్రోలి గురుశిష్యు లిద్దఱచటనే పరుండిరి. దీర్ఘప్రయాణముచేఁ గడు నలసటఁ జెందియుండిరి గాన వా రొడలెరుగక గుఱ్ఱులు పెట్టుచు శయనించిరి. వా రటుల జాలసేపు నిదురనొంది మేల్కొనగా నప్పుడే యజాండమం దంతయు నాల్గువైపుల నుండిఁ గటిక చీకటులు క్రమ్మసాగెను. దుష్పహోఋపముచే నిశాకన్యాలలామ శరీరమునుండి వెడలు ఘర్మబిందువులో యన నక్షత్రము లాకసమునం బొడమచుండెను.

ఇట్టిసమయమునఁ బాప మా గురుశిష్యు లిద్దఱును వెంటనే లేచి నడువసాగిరి. ఆ కటికచీఁకటిలో వారికి చూపు నక్షత్రముల వెలుఁగుతప్ప మరేమియులేదు. వారిద్దఱికిహృదయాంతరములనున్న యాతురత వారిని మందలించి వెంబడించుచుండ వా రతివేగమున నడచుచుండిరి. ఈ రీతి వారు కొంతదవ్వేగిన తరువాత వారి దృష్టికి దాపునఁ గొండ రాళ్ళతో గట్టిన నొక చిన్నగృహము కానవచ్చెను. ఆ

గృహము వాకిట నొక పెద్దనాసము నిలుపఁబడి దానికొనకొక వింతపతాకము గట్టఁబడియుండెను. ఆ గృహముఁజూడ నూతననిర్మాణముగ గన్పట్టుచుండెను. అదియే శంకరమఠము. [illegible] కీ పురుషులిద్దఱామఠముఁజేరి యచట లోపల బరుపఁబడియున్న కృష్ణాజినములపై సిద్ధఱు గూర్చుండి తమ కమండలువులోని నీటితోఁ గాళ్లు కడిగికొనిరి. అంతట గోకుల దాసు శిష్యునిఁ జూచి "సుందరా! నామూలమున నీ వెట్టి వెతల నొందుచున్నా" వనెను. అనినతోడనే శిష్యుఁడు 'సద్గురూ! మీతోడనుండ నాకెట్టి కష్టములయినను సౌఖ్య ప్రదాయకములుగ నుండును. ఒకవేళ మీరు శ్రమనొంది యుండవలెఁగాని నా కిసుమంతయు శ్రమకనుపడలేదని' గోకుల దాసుగారి పాదముల నొత్తసాగెను. దాసు శిష్యుని వలదని చెప్పి, బయట నెవరైన దమకొఱకు వేచియున్నచోఁ గను గొని రమ్మనెను. సుందరుఁడు బయటకేగి నంతనే వందలకొలఁది జనులు గోకులదాసు దర్శనార్థమై నిరీక్షించుచుండిరి. దాసునకు జ్యోతిష్యములోఁ జాలఁ బ్రవేశముకలదు. ఈ విషయమును గుఱించియే జనులందఱీతని కొఱకు వేచియుండిరి. వీని కా ప్రాంతపు బళ్ళెటూళ్ళలో నెక్కువ పలుకుబడి కలదు. పాప మా గోకులదాసునకుఁ బవలంతయుఁ దీఱుబడి యుండనే యుండదు. కొన్ని సమయములందు రాత్రివేళలఁగూడ [illegible]తనికి విశ్రాంతి యుండదు. ఎప్పుడుఁజూచిన నొకరో యిద్దరో సలహాకొఱకు వచ్చుచునే యుందురు. ఆరోజున గోకులదాసు వచ్చినవారందఱి కెటులనో సమాధానముజెప్పి పంపివేసెను. వారందఱు వెళ్ళునప్పటికి రాత్రి షుమారు తొమ్మిదిగంట లాయెను. అప్పుడు గురుశిష్యులిద్దఱును బయ

టను విశ్రాంతికొఱకు వచ్చి షికారుఁజేయుచుండిరి. దాసు
చేత నొకమాలికధరించి యిటునటుఁ దిరుగుచుండెను. అట్లు
తిరుగుచు నాకసమువంకఁ జూచుచు సుందరునకానక్షత్ర
ముల గుఱించి బోధచేయుచుండెను. సుందరుఁడు సూక్ష్మ
బుద్ధిఁగలవాఁడు. గోకులదాసు చెప్పినంతనే యాతఁడొక
దానివెంట నొకదానిని సులభముగ గ్రహించుచుండెను. ఇట్టి
సమయములో నొక తురుష్కభటుఁడు పరుగెత్తుచు వారి
కడకునచ్చి పాదుషా రమ్మనెనని పిలిచెను. దాసునకుఁ
బాదుషాతోఁగూడ నెక్కువ పరిచయము కలదు. పాదుషా
దాసును బూర్తిగా నెఱిగినవాఁడై యాతనిని రాజకీయ
సంబంధమగు సలహాకొఱకుఁ దఱుచుగఁ బిలిపించు చుండును.
ఆ భటుఁడు రాగా దాసు కొంచెముసేపుండి వత్తునని కబు
రంపెను. ఆ భటుఁడు తిరిగివెళ్ళెను. కొంచెముసేపయిన తరు
వాత నప్పటికి రాకపోగాఁ బాదుషా మఱొకభటుని తత్క్షణమే
పంపెను. అతఁ డతిశీఘ్రమునఁ బరువెత్తి శంకరమఠమున
కేగగ నా మఠకవాటము మూయఁబడి యుండెను. పాప
మాతఁడు చాలసేపు తలుపు బ్రద్దలగునట్లు గ్రుద్దుచుఁ గేక
లిడెనుగాని లోపలివారుపలుకనేలేదు. పాదుషాకు బని చాల
తొందరగా నుండెను. అట్టి సమయమున నీభటున కింత
యాలస్యమైనందునఁ బాప మాతఁడు పాదుషా యేమనునో
యని గడగడ వణకుచుండెను. అతఁడెంత మొత్తుకొనినను
వారు లోపలనుండిరో లేదో కాని జవాబురాదాయె. అతఁడు
తిరిగి వెళ్ళినచో నిజముగాఁ బాదుషా వానిని జంపించును.
అప్పటికి దాదాపు రెండుజాములు కావచ్చెను. ఆనడిరేయి
వాని కెవరుదిక్కు ! ఆప్రదేశములో నాగృహ మొక్కటి

దప్ప మఱియొక కొంపయును లేదు. చాల దూరమునుండి వినఁబడు సెలయేళ్ళ మ్రోతలు తప్ప నే యితరమును వాని కర్ణేంద్రియములు సోకుటలేదు. మత్తమాతంగ సదృశములగు గుట్టలగుంపులుతప్ప వాని నేత్రయుగ్మమున కేయితరముఁ గన్పట్టుటలేదు. మెల్లమెల్లనఁ బ్రాకు మేఘసంచయములనుండి నిక్కిచూచు రిక్కసముదాయములు తప్ప నేవియు వానిని జూచుటలేదు. వానికిఁ జుట్టుప్రక్కల నెవరును సహాయము లేరు. అతఁడాచోటునుండి తిరిగి వెళ్ళుటకు వీలులేదు. ఎంత సేపటి కాతలుపు మూయఁబడియున్న, నంతవర కాతఁడచట గని పెట్టుకొనియే యుండవలయును. కొంచెమసేపూరకుండి తరువాత మరలఁ దలుపు దట్టసాగెను. అప్పటికిఁ గూడ నేమియు జవాబు రాలేదు గాని, లోపలమాత్ర మించుక శబ్దమువినవచ్చెను. అప్పటి కాభటునకుఁ గొంత మనశ్శాంతి కలిగెను. అప్పుడు వారు పలుకుదు రన్న నాశతో మఱింత బిగ్గఱగఁ దలుపుదట్టగఁ బాప మాతనికి విముక్తిగల్గెను. లోపలినుండి యొకపురుషుఁడు వచ్చి తలుపుఁదీసెను. వెంటనే యా భటుఁడు లోపలికి వెళ్ళెను. అపుడు గోకులదాసు వానిని 'ఎవరునీవని' ప్రశ్నజేసెను. ప్రశ్నఁ జేయగా నాఁతడు 'నేను పాదుషాగారి భటుఁడను, విమ్ముల దీసికొని బోవచ్చితి' నని బదులుచెప్పెను. వెంటనే గోకులదాసు 'సుందరా!' యని పిలిచి తన పాదరక్షలఁ దొడిగికొని బయటకు వచ్చెను. సుంద రుఁడుకూడ బయలుదేఱెను. ఆ నాఁటిరాత్రి నాముర్వు రతి వేగమున నడచుచుండిరి. కొంత దూరమేఁగిన తరువాత గోకుల దాసు భటునితోఁ "బాదుషాగా రిపుడేమి చేయుచున్నా" రనెను. అతఁడు బాదుషాగా రొక కార్యము దలఁపెట్టిరనియు

దానికి శుభముహూర్తముఁ బెట్టుటకు మిమ్ములఁ బిలుచుకొని రమ్మనిరనియుఁ జెప్పెను. అప్పుడు దాసుగా "అట్లయిన నింత యర్ధరాత్రివేళ నిన్నేల బంపినా" రని యడిగెను. దాని కాభటుఁడు జవాబియ్యలేదు. దాసుగారది యాభటునకుఁ దెలిసియుండదని తలఁచి వానినడుగుటఁ జాలించెను. కొంత దూరము పోయినతరువాత నొకతోట వీరిదారి కడ్డమురాగా నాభటుఁడు వీరికి గానరాకుండఁ బాఱిపోయెను. దాస సుందరులు పలుమారాతనిఁ బిలిచిరి. కాని వాడప్పుడే యేమూలకో పాఱిపోయెను. అప్పుడు దాసు తమ కేదియో మోసముజరిగె నని తలఁచి తమదగ్గరనున్న కరదీపికాసాయమున నాప్రదేశము నలుదిశలఁ బరీక్షించిరి. పరికించిచూడ నది పాదుషా నివాసమునకు మార్గముకాదు. అది ఘోరారణ్యము, దుర్గమ కాంతారము. అట్టిప్రదేశమున వారు చిక్కుపడవలసినచ్చెను. వారు చాలసేపువఱకు కాభటుఁ డెవ్వరైయుండునో యని యాలోచించిరి; కాని వారికి గోచరముకాలేదు. అయినను వానిని కనుగొనలేక పోవుదుమా యన్న ధైర్యముతో వారు తిరిగి శంకరమఠోన్ముఖులయిరి. వీరు తిరిగి వెళ్ళునప్పుడు వెనుక నెవరో నడచుచున్నటుల వీరికిఁ బొడగట్టుచుండెడిది. కాని తిరిగిచూడ నేమియు లేకుండెడిది. ఇట్లు వీరు తమ మఠమున కేగునంతవఱకు దారివెంట భీతిజెందుచునే పోవుచుండిరి. తుదకెటులనో చావుదప్పి కన్నులొట్టవోయె నను నట్లు తమ నివాసముఁ జేరిరి.

---

పదునాల్గవ ప్రకరణము

# వేణువనము

చిత్తూరునగరమున కొక మైలుదూరమున సంతత పరి-
పక్వ ఫల మహీరుహ మనోహరంబగు వనం బొండుగలదు.
ఆ వనమునకు జుట్టు నొక గొప్ప గోడ కట్టబడియుండెను.
దాని ముఖద్వారమున కిరుపార్శ్వములందును, రసపుత్రులలో
నెక్కుడు వీరులనిపించుకొని తురుష్కులతోఁ జాలకాలము
బోరాడి వీరస్వర్గమునొందిన రణపటిష్ఠులగు రసపుత్రుల
విగ్రహములు రెండు నల్లఱాతితో నిర్మింపఁబడి యుండెను.
ఈవనములోనికి రాణావారును, వారి బంధువులును దప్ప
నితరులు వెళ్ళుటకు వీలులేదు. ఆవనములోని నానావిధవృక్ష
సముదాయముల పలువిధ పుష్ప సంతానముల నికుంజ
పుంజముల శుకపికశారికా నినాదముల రామణీయకము
వర్ణనాతీతము. అట్టి ఈ వేణువనములో నొకరోజు సాయం
తనపు వేళ నిద్దఱుస్త్రీలు, ధవళాంబరధారిణులై, నల్లనిశిరోజ
ములు ముఖపద్మములపై వ్రాలఁ గరపల్లవంబులఁ జిన్ని
చిన్నిబుట్టలఁ గైకొని మల్లికాకుసుమంబులఁ గోయుచుండిరి.
వీరిలోఁ గమలాబాయి రాణావారికి దగ్గఱచుట్టము. సుఖలా
బాయి, కమలాబాయియొక్క చెలికత్తె. వీరిద్దఱు ఎల్లవేళల
నెడబాయకుండెడివారు. ఆనాటి సాయంత్రము వీరిద్దఱు
మల్లికాకుసుమగుచ్ఛంబులఁ గోయుచుండ సుఖలాబాయి
దక్షిణనేత్రం బదరె. అప్పుడు సుఖలాబాయి కమలాబాయిని
చూచి, అమ్మా! యిఁక మనము పుష్పములగోయుట మాన
వలయును. మనమిచ్చోట నుండరాదు. మనకుఁదప్పక ముప్పు

వాటిల్లు నని యతిపరుసముగ నామెతోఁ జెప్పెను. కమలా
బాయి యామెమాటలు లెక్కఁగొనక తనతో దనచెలి యొక
పక్షము లాడుచున్నదని తలఁచి యచ్చోటు వాయక,
బుఱ్ఱలఁ గోయుచునేయుండెను. సుఖలాబాయి యెన్నివిధ
ముల బ్రతిమాలినను కమలాబాయి పట్టినపట్టు విడువ
కుంటజూచి తాను వెళ్ళసాగెను. అప్పుడు కమలాబాయి
యామెనుజూచి, సుఖలా! నీవెంత వెట్టిదానవు! పరు
లెవ్వరును రాపీలులేని యీ వేణువనమున నీకేమిభయము?
మననగరముకూడ నిచ్చటి కెంతయో దూరము లేదే. అట్టి
యెడ నీవింత యధైర్యము నొందనేల? రమ్ము నేనుగూడ
నిచ్చట విశేషకాలముండనని యామెను బిలువసాగెను.
కాని సుఖలాబాయి తిరిగిరానొల్లక, కొంతదూరమేగి యచట
నిలుచుండెను. తరువాతఁ గమలాబాయికూడ తనచెలికత్తెను
కష్టపెట్టనొల్లకఁ బుఱ్ఱలఁగోయుట ముగించి యామెదగ్గఱకు
వెళ్ళెను. అప్పుడు సుఖలాబాయి "అమ్మా! ఎచ్చోట నేవేళ
నెట్టిచతురోక్తు లాడవలయునో మీ కింకఁ దెలియదుగదా!
తమకేవిధమగు నవస్థ కల్గినను మీచెలికత్తెయగు నాకేకదా
రాణావారిచే జీవాట్లు! అట్టియెడ మీ రిసుమంతైన నాపక్షము
మాటలాడరుకదా! మీకు పరిచర్య కావలసి వచ్చినప్పుడే
మమ్ము బిలిచి పలుకరించెదరుగాని, లేనిచో మీరు మమ్ముల
మీ క్రీగనులనైనఁ జూడరు. తమ తమ యవసరముం బట్టి
తత్కాలోచితముగ బొంకులాడి తమ కార్యముల నెగ్గించు
కొందురుగాని యవసరము తీరినంతనే యెవరికి వారేకదా?
నిశ్చలతలేని యనురాగ మున్ననేమి? లేకున్ననేమి? అమ్మా!
మేమి యెట్లున్నను దాస్యము పరిచారికాంగనావిధి కాని

వేళుగాదుగదా? అయ్యో! మాటలచే దెలివిహీనురాలనై కర్తవ్యము మఱచితిని. మనమింక వెళ్ళితీరవలయును. వేఱు మాటఁ జెప్పక నావెంట నడువు" మని యామెను నిర్బంధిఁ బెట్టసాగెను. అప్పుడుకూడఁ గమలాబాయి యామెను సరకు సేయక 'సుఖలా! ఆచోటుబాసి యిక్కడకువచ్చినను యింక నెక్కడకు రమ్మనెదవు? ఇయ్యది సురక్షితమగు స్థలము కాదా? కానియెడ నీ వనములోనే, మరియు సురక్షితమగు చోటున కేగుదము. ఈ వనమునుండి యింత తొందరగా బోవనేల?' యని యనెను. కమలబాయి సహజముగ కోపముగలది. ఆసంగతి సుఖలాబాయి జ్ఞప్తికిఁ దెచ్చుకొని యింకనొకనారి పలుకరించినచో నామెకుఁ గోపమువచ్చునని తలఁచి యామె యిష్టానుసారమే నడువఁదీర్మానించుకొనెను. తరువాత వారిద్దఱు నచట నొక పొన్నమ్రాను క్రింద గూర్చుండి కోసినపువ్వులను దండలుగా నొనర్చుచుండిరి. అప్పటికి షుమారు రారుగంటలాయెను. పరిపక్వముఁ జెంది వృక్షమునుండి పడు పచ్చని పండుచందంబునఁ జండకరుఁగు వృద్ధత్వము నొందినవాఁడై యపరాబ్ధిలోనికి జారెను. గగన మార్గంబున నానావిధ విహంగ సంతానంబులెల్ల బారులు దీర్చి తమతమ గూండ్లకుఁ బోవుచుండెను. ఆ యువతీమణు లిద్దరును దండలుగాఁగూర్చి నేలపైఁబరచిన నెఱ్ఱపూదండలో యన నింగిపై సంధ్యాచాయలమరె. అంత పొద్దుపోయినను కమలాబాయి కిసుమంతైనఁ దొందరయే లేదు. సుఖలా బాయి మాత్రము లోలోపలఁ గంపుచుండెనుకాని, కమలా బాయియేమనునో యని పైకిమాత్రము నుడువదాయె. ఇట్లు వారకొంతసే పచటనేయుండ మెల్లమెల్లఁగ వీచుచున్న

జల్లవాయువు లన్నియుఁ బోయి పెనుగాలిగా మారెను. తత్ప్రచండాహతిచే నావనములోని వృక్షములన్నియు సమూలముగ నేలఁ గూలుచుండెను. మఱికొంత సేపటికి నిర్మలముగానున్న నాకసమంతయు ఘోరనీలాంబుద వ్యాప్తమై దుర్భర మేఘగర్జనములచే భయావహ మగుచుండెను. వర్ష సూచకమగు చల్లనిగాలి వీవసాగెను. అప్పుడు వారిద్దఱును తొందరగా వారు గ్రుచ్చిన దండలఁ బోఁగుఁ జేసికొని యింటికి వెళ్ళుటకుఁ బయనమయిరి. కాని లేచినంతనే వర్ష బిందువులు వారిపైఁ బడనారంభించెను. ఇక వారేమియుఁ జేయునది లేక నాచెంతనున్నఁ బూవుటింటిలోఁ జొరఁబడిరి. వర్ష మంతకంత కెక్కుడుగాఁ గురియ నారంభించెను. ఆ ప్రదేశమంతటఁ గాఱుచీకటులు గ్రమ్మెను. వేణువనములోఁ జెల్లెక్కుడుగ నుండుటఁ జేసి యచటఁ జీకటి మఱింత దట్టముగనుండెను. అట్టియెడ, నా నికుంజములో నుండిన యా యువతీమణుల యునికి కడు దుర్భరమయ్యెను. ఎప్పుడును విచిత్ర మణిమయములగు దీపకాంతులఁ బొద్దుబుచ్చుచు నలఘుమాణిక్యకాంతులఁ దేజరిల్లుచుఁ జీకటియన నెట్టిదో యెఱుఁగని యా స్త్రీరత్నము లిద్దఱు నిబిడాంధకారముచే నొత్తుగఁ గప్పఁబడిన యా యుద్యానవనములో నుండవలసి వచ్చెనుగదా! ఆసమయములో వీరిని గాచువారెవరును లేరు. నభోంతరాళముఁ బెకలించు మేఘ గర్జనంబులకు మూర్ఛిలుచు, తెప్పపాటులోఁ గనఁబడి మాయమగు మెఱుపుఁ దీవెల కులికిపడుచు, శీతలాధిక్యముచే నొడలదుర వడఁకుచు వారచ్చో నుండవలసినదిగదా! వారికిఁ గీడులో మేలనునట్లాకవిషయము మాత్రము బాగుగనుండెను. వారు ప్రవే

శించిన పొదరిల్లు మిగుల దట్టముగా నుండుటచే లోనికి వర్ష బిందువులు జారుటలేదు. అయినను వారాశీతమున కోర్వలేక గడగడ వణఁకుచునే యుండిరి. ఈ స్థితికిఁ దగినట్లాసమయమున నా వనములో నొకమూల జనుల కాలిసవ్వడి వినవచ్చెను. తచ్ఛ్రవణంబున నా యబలారత్నము లమితదుఃఖము నొందుచుండిరి. పాపము! కమలాబాయి రూపమునకు మాత్ర మచట నున్నదియేకాని యామెకుఁ బ్రాణములులేవు. ఆ పూవు టింటిలో నామె యొకమూల నొఱిగి పడియుండెను.

ఆహా! యెల్లప్పుడును హంసతూలికాతల్పముల దాసీజనంబు పరిచారముసేయ హాయిగ శయనించు నామె యారాత్రి చీఁకటిలో ఆనేలఁ బరుండవలసి వచ్చెనుగదా! ఏ ప్రాణి కేయెడ నెట్టిసంకటస్థితి కలుగునో నూహింప నసాధ్యము. దైవనిర్మాణమునకు వేఱుమార్గములేదు. సుఖలాబాయి మాత్రము కొంచెము ధైర్యముఁదెచ్చుకొని కమలాబాయికి నుపచారములఁ జేయుచుండెను. కాని, కమలాబాయి కనులనైనఁ జూడలేదు; నిదుర మేల్కాంచలేదు. ఇంతలో నాసందడి మఱింత యధికమగుచు దగ్గఱగా వినవచ్చెను. ఇక సుఖలాబాయికూడఁ బ్రాణంబులమీఁద నాశ వదలినదై తానుగూడ నాపెచెంత నొఱగిలఁబడెను.

పదునైదవ ప్రకరణము

# జీర్ణ దేవాలయము

వేణువనములోఁ గమలా సుఖలాబాయిల స్థితి యిట్టు లుండఁ జిత్తూరు నగరములోని సంగతు లొక రీతిగ నుండెను. కమలాబాయి సౌధములోని దాసీజనము తమ దేవి రానందులకు దిగులందుచు వీరాబాయితో మనవిఁజేసిరి. ఆమెకూడ మిగుల నాశ్చర్యముఁనొంది వెంటనే కొందఱు నా వేణువనమునకుఁబోయి వారిం దోడ్కొనిరండని చెప్పెను. అట్లులనే వారందఱు నావనమునొద్ద కేఁగిరి. వెళ్ళి చూడగా నా వన ద్వారము తీయఁబడియుండెను. వారు లోపలికేగిరి. కమలాబాయియు నామె చెలికత్తెయు మామూలుగఁ గూర్చుండు స్థలమున కేగి చూచిరి. వారచటఁ గానిపింపలేదు. తరువాత నా వనమందలి స్థలము లన్నిఁటిని వెదకిరి. ఎచటను వారు కానరాలేదు.

ఇఁక వా రాశలన్నియు నిరాశఁజేసికొని యొకచోటఁ జింతాక్రాంతులై కూరుచుండిరి. పాపము! వారు దేవిగారితో నేమని విన్నవింతురు? వారిలోఁ గొందఱు మరల దేవిగారి యొద్ద కేఁగు టనుచితమనియు నెచ్చటికోపోవదగుననియుఁజెప్పిరి. దానికందఱును సమ్మతింపలేదు. తుదకు వారు దేవిగారి యొద్ద కేఁగునటులనే తీర్మానించుకొనిరి. అయినను వెళ్ళునపు డింకొక సారి వెదకిచూతమని తలఁచి యా వనము నంతయుఁ గలయ వెదకిరి. కాని వారి జాడయే కానరాలేదు. తరువాత వారు వెళ్ళునపు డా వనద్వారమునకుఁ దాళమువేసి పోయిరి.

ఆహా ! ఆ యువతీమణుల సంగతి యేమయ్యెనోకదా? వారల నీ భటులు కనుగొందురా లేదా యని యెచ్చటనైన దాగిరా? లేక పరులపాలబడిరా ? నిజముగా వారలు పరులకుఁ జిక్కియే యుండవచ్చును. ఏలయనఁ జీకటియనఁ గలనైన నెఱుఁగనివారై ప్రతిదినము నా వనమునకు వెళ్ళి తిరిగి తొందరగనే తమనగరమున కేఁగువా రా రాత్రి యంత ప్రొద్దుపోవువఱ కా వనములో నుందురా? ఒకవేళ వర్షమువలన వారు రా లేక నా వనములోఁ జిక్కుపడినను వారి భటు లట కేగుదెంచిన తరువాతనైన సంభ్రమమున వారి కగుపడరా? అట్టిసమయములో భటులు వారిని కనుగొందురా లేరా యని వారు డాగియుండి రనుమాట కల్ల. నిజముగ వారికేవో కీడు మూడియే యుండవలయును.

కమలాబాయియు నాపె చెలికత్తెయు నా రాత్రి పొదరింటిలో నుండగా నొకశబ్దము వినవచ్చెననియు నా శబ్ద మంతకంతకు వారిని సమీపింప సుఖలాబాయికూడ మూర్ఛిల్లెననియు మనము పదునాల్గవ ప్రకరణాంతమునఁ జదివియుంటిమి. ఆ సందడి నిజముగ నితరపురుషుల కాలిసందడియే. వారెప్పుడేమూలనుండి యావనములోఁ బ్రవేశించిరో ఎవరికిని తెలియదు. వారయిదుగురు మనుష్యులు; మువ్వురు రసపుత్ర యువకులు, యిద్దరు తురుష్క భటులును. వీరంద ఱా తెరవఁబడియున్న ద్వారముగుండి వనములోనికిఁ బ్రవేశించిరి. అపుడు వర్ష మెక్కుడుగానుండి యా ప్రదేశ మంతయుఁ జీకటిగానుండెను. కాన వీరి నెవరును చూడలేదు. దేనికొఱకోగాని యా తురుష్క భటు లిద్దఱుఁ దమ భుజములమీఁద నొక మేనాను మోసికొని పోవుచుండిరి. ఆ మేనాను వారొక వృక్షముక్రిందఁ బెట్టి యచట

గూర్చుండిరి. మిగిలిన ముర్వు రా వనము నంతయు శోధింప సాగిరి. వనమంతయు వెదకి తుద కా యువతీమణు లిద్దఱును మూర్ఛిలి పడియున్న పూవుటింటికడ కేగిరి. అయ్యో! వారా నారీమణుల గొంపోవచ్చినారా యేమి? ఆ పొదరింటినికూడ. శోధింప లోని కేగిరి. వెళ్ళగా దానిలో వారు మూర్ఛా క్రాంతులై ప్రాణములను వీడి కొనయూపిరిలతో నున్న స్త్రీయుగ్మముం గనుఁగొనిరి. కనుఁగొనినంతనె వారమితానంద భరితులై యొడలెఱుంగక దమ మనోరథ మిన్నాళ్ళకు సమా కూఱినందుల కచ్చెరువందుచు సమీపముననే మేనాను కాచు కొనియున్న తుపుష్క-భటులను రండని మెల్లగా కేకనైచిరి. వారటులనే యామేనా నాపూవుటింటికడకుఁ దీసికొనిపోయిరి. తోడనే యా మువ్వురు రసపుత్రులును లోనఁ బ్రవేశించి యా స్త్రీలను తమచేతులపై నెత్తి మేనాలోఁ బరుండబెట్టిరి. వెంటనే యాతురుష్క-భటు లా మేనాను భుజములపైఁ బెట్టుకొని యతి శీఘ్రమున వెడలిపోయిరి. ఆ రసపుత్రులును నాయుధపాణులై మేనావెంటఁ బోవుచుండిరి. వారా వనమును దాటునప్పటికిఁ జిత్తూరు నగరములోని కోటలోఁ బన్రెండుగంటలు కొట్టుట వారికి వినవచ్చెను. అపుడు వారు తమ గమ్యస్థానము చాల దూరమున్నదనియు, దానిని చేరఁ జాలకాలము బట్టుననియు రహస్యాలోచన జేయుచు నతిశీఘ్రగతిని పోవుచుండిరి. ధారాళ ముగా వర్షము కురియుచుండుటచే నా యర్ధరాత్రిసమయ ములోఁ బోవుచుండఁగా నెవరు వీరినిగుర్తించగలరు? ఆ చీఁకటికిఁ దగినట్లు వీరందఱు నల్లయంగీల దొడిగియుండిరి. వారికరంబుల నున్నఁ గరవాలంబుల మెరపుతప్ప మరేమియు నితరులకు గాను పించుటలేదు. వీరు చాలదూర మేగినతరువాత నొక రహస్య

స్థలమున నా మేనాను దింపిరి. అపుడా ముప్వురు రసపుత్రులు నా మేనాతలుపుఁ దీసిచూచిరి. చూడగా నేమున్నవి? ఇద్దఱు స్త్రీలయొక్క మృతకళేబరంబులు కలవు, ఆ స్త్రీలంతవఱకును మూర్ఛనుండి లేవలేదు. ఈ మనుష్యులా వనములోనికి వచ్చుటయు వారివద్దకువచ్చి వారిని చేతులకూఁద నెత్తి మేనాలో బరుండబెట్టి తీసికొని పోవుటయుఁగూడ వారికి గుర్తు లేదు. ఆ వనములో వారు ప్రవేశించినపుడు కలిగిన సందడి మాత్రము వారెఱుఁగుదురు. మిగిలిన వృత్తాంతమంతయు వారికి గోచరములేదు. అట్టిసమయమున నా రసపుత్రులెంత పిలిచినను వారు మారుపలుకలేదు. కనులఁ జూడనైనలేదు. దానినిబట్టి వారు నిజముగ మృతినొందిరనియే వారనుమానము నందిరి. అయినను జేయునదిలేక వారు మరల నామేనాను భుజములమీఁద బెట్టుకొనుడని తురుష్కభటుల కాజ్ఞాపించిరి. వెంటనే వారు దానినెత్తుకొని మఱికొంతదూరమేగిరి. అపుడా రసపుత్రు లేలకోగాని యడుగుఁదీసి యడుగు బెట్టజాలక యధికకష్టముతో నడచుచుండిరి. ఎటులనో నడచి యొకనొక నిర్జన ప్రదేశముఁ జేరిరి. అచట నొక చెట్టుగాని చేమగాని యేమియు లేదు. ఒకచోటునమాత్రమొకటి పెద్ద ఱాతివలెఁ గనుపించు చుండెను. దానిదగ్గఱకువెళ్ళి చూడగా నదియొక జీర్ణదేవాలయము. అదియే కాళికాలయము. అది యంతయుఁ దగు జాగ్రత్తలేమిచే శిథిలమై యుండెను. వారు మేనా నచట దింపిరి. మరల నాముప్వురు రసపుత్రులును మేనా తలుపులఁ దీసిరి. అప్పటి కా యువతీమణు లించుక తెలివినొందినట్లు వారు గ్రహించిరి. వెంటనే యా రసపుత్రులలో నొకఁడు "కమలా! కమలా!" యని పిలిచెను. కాని వాని నామెకనులఁ

జూడలేదు. నోటఁబలుకలేదు. పలుకకుండుటఁజూచి యాతం డామెపైఁ జేయివేసి 'కమలా! యిఁకనైన నన్ను పరిగ్రహింప రాదా! ఇటుఁ జూడవేల? నేను నీకేమి యపకారమొనర్చితి'నని వినయముగాఁ బలికెను. పరపురుషునిహస్తస్పర్శకమలాబాయికి సోకగానే యామె నేత్రము లెఱ్ఱఁబాఱి క్రోధస్ఫురితములై వానియంతట నవియే తెఱువఁబడెను. మేనెల్లగగుర్పాటుఁ నొందెను. కనుబొమలఁ జిఱుచెమ్మటలుఁ గ్రమ్మెను. తోడనే యామె 'మూఢా! నీచా! నన్నంటకురా'యని వానిచేతినవలకుఁ ద్రోసెను. అప్పుడాతఁ డాగ్రహము గలవాఁడైనను సమ యముఁబట్టి యూరకుండి మరల 'సుశీలా! నీవైన బలుకరాదా' యనెను. అటుల నాతఁడెన్నిసారులు బ్రతిమాలినను వారిలో నొకరైన బదులుఁజెప్పలేదు. తరువాత మిగిలిన యిద్దఱును కూడ నామేనాచెంతఁ జేరి పలువిధముల నా బాలారత్నముల బ్రతిమాలిరి గాని ప్రయోజనము లేకపోయెను. తుదకు వారు వేసాఱి యీసారి బలుకకున్న గాళికాదేవికి బలియిత్తుమని భయ పెట్టిరిగాని వారప్పుడైనను మాఱుఁబలుకలేదు. ఇఁక వారిని కాళికాదేవికి బలినీయ గృతనిశ్చయులై వారినిబట్టి మేనాలో నుండి క్రిందకులాగిరి. తరువాత నాగుడి కెదురుగానున్న కంబ మునకు వారిరువురఁ ద్రాళ్ళతోఁ గట్టిరి. ఆ మేనానుండి వారిని క్రిందికి బలాత్కారముగా లాగి త్రాళ్ళతోఁ గట్టునపుడా కాంత లెట్లుండిరోకదా! ఆహా! యాసమయములో నా సుకు మార శరీరుల ట్లిడుమలఁ బడుచుండ నెవరుచూచి సహింప గలరు? చూచినంతనే యెట్టి మనస్థైర్యముఁగల మానవుఁడైన నార్ద్రీహృదయుండై దుఃఖాబ్ధి మునుఁగకుండునా?

పాఠకులారా! ఈ యబలారత్నముల నిట్లు కష్టముల పాలొనరించువా రెవరో మీరు చెప్పగలరా? ఇంచుకయిన గుర్తింపగలరా? అయిన నొకసారి యూహఁజేయుడు. ఇట్టి నీచకృత్యములకై బాల్పడువా రితరు లుందురా? ఇతరులింత నిర్భయముగ నావేణువనములోని కేగి యచ్చో గర్మవశమునఁ జిక్కుపడియున్న నా యువతీమణుల బలిమిమైఁ బట్టితెచ్చి కాళికి బలినీయ సాహసింతురా? ఇతరుల కా కన్యారత్న ముల రహస్య ప్రదేశమార్గము లన్నియు గోచరమగునా? కాదు. కాదు. కలనైన వీరి నన్యులుగా భావింపవలదు. వీరందఱు మనకుఁ దెలిసినవారే. వీరే ఖేతసింగు, అభయ సింగు, కుంభరాణాలు. వీరు రాణావారి కొల్వులో నుండు నప్పుడే యీ రజపూతాంగనలపై వలపుఁగొనిరి. కాని వారి కప్పుడయ్యది లభింపమిచేఁ దరువాతఁ బాదుషా పక్షమును వహించి వారి వాంఛఁ జెల్లించుకొన దలఁచిరి. వారియూహకు దగినటులనే యాసమయము దొరకినది. కాని దొరకినదానిని దక్కునటుల జేసికొనుట కష్టముగదా! ఈ రసపుత్రు లిది వఱకు రాణావారి కొల్వులో నుండుటచే వీరి కా స్త్రీ లేయే సమయముల వేణువనమున కేగుదురో తెలియును. దీనిని గుర్తెఱిఁగియే వారా తోటలోనికి బోయి యం యంగనా మణులఁ గొంపోవగలిగిరి.

ఖేతసింహాదు లాస్త్రీలను కాళికాదేవికి బలినీయబోవునెడ నొక చిత్రము జరిగెను. ఏమూల నుండియోకాని కొందఱు భిల్లు లా ప్రదేశమున కశ్వారూఢులై వచ్చి యా దుర్మార్గుల నడ్డగించిరి. వారు వచ్చుటఁజూచి యా రసపుత్రు లా స్త్రీలను బంధవిముక్తులఁ జేసి మేనాలో నిడుకొని పరుగిడసాగిరి. కాని

యా భిల్లులు కడువేగమునవచ్చి వీరలఁ గలిసికొనిరి. వెంటనే రెండు పక్షములవారికిఁ బోరాటము జరిగెను. కొంతదూర మేగినతరువాత మఱికొంత మ్లేచ్ఛసైన్య మా రసపుత్రులకు సాయమురాగా వారు నిలిచి పోరాడిరి. మఱికొంత తడవయిన తరువాత నింకఁ గొంతసైన్యము సాయమగుటచే భిల్లులు పరుగిడవలసి వచ్చెను. అయినను మరల నా స్త్రీలను బలిసిత్తు రేమోయని యా గుడియొద్ద నించుక సేపాగి తరువాత వెళ్ళిరి. ప్రాణములపై నాశవీడి పరుగిడుచున్న సమయమునఁ దలవని తలంపుగా జయము కలిగినందుల కా రసపుత్రులు సంతసించుచు నెచటను నిల్వక ఢిల్లీనగర మెప్పుడు చేరుదుమా యని కడువేగ మునఁ బోవుచుండిరి. అట్లుపోవు సమయమున దారిలో వారు శంకరమఠమార్గము ననుసరించి వెళ్ళవలయును. అదియే వారి దారి. కనుక వారు శంకరమఠమునకుఁబోయి గోకులదాసుగారి నా స్త్రీలవిషయమై ప్రశ్నింపదలఁచిరి. అటులనే శంకరమఠము సమీపించగా వారా యాందోళిక నచటికిఁగొంపోయిరి. అప్పుడు దాసుగారు మఠముయొక్క సావడిలో గడ్డమును దువ్వుకొనుచు రుద్రాక్షమాలికఁ జేతఁద్రిప్పుచు బచారు జేయుచుండిరి. వీరిని జూడగానే దాసు 'సుందరా! చాపగొనిరమ్మ'ని పిలిచి వారి నా చాపమీఁదఁ గూర్చుండ నియమించెను. అంతట వారు దాసున కా స్త్రీలఁజూపి 'స్వామీ! వీరు మా కదృష్టవశమున లభించిరి. వీరిని మేము పరిణయమాడదగునా? లేదా?' యని ప్రశ్నఁజేసిరి. దాసును బాగుగా నాలోచించి యా స్త్రీలను పరి గ్రహించినచో వారికిఁ దప్పక ముప్పు వాటిల్లుననియు, బంధు నాశనముగూడ నగుననియుఁ జెప్పెను. దాసుగారిమాట యన వారికందఱకు జాల నమ్మకము. కనుక దాసుగారు తమ

క్షేమముకొఱకుఁ జెప్పినారని తలఁచి నిజముగ నా స్త్రీల నిర్బంధపెట్టి పరిగ్రహించినచో దప్పక మృత్యువు చేకూరునని భీతినొంది మరల నా స్త్రీలను కాళికి బలినిత్తుమని చెప్పి పయనమయిరి. వారటుల బోఁగా వారిలో నొకఁడటుల జేయనొల్లక యా స్త్రీల జీవములతో నుంచియె, వారిచేఁ బలువిధములగు నీచకృత్యములఁ జేయింపుచోఁ దమ మనోరథం బీడేరుననియు, ఒుదపు వారే పశులగుదురనియుఁ జెప్ప, వార లా స్త్రీల దాసునకే పరిచారికాంగనలగా నిత్తుమనిరి. దాసుగూడ "సన్యాసినగు నాకీ స్త్రీలయుపచార మేల'యని చెప్పియు, మరల నేలకో వారల గైకొనియె.

ఉ॥ అంతిపురంబుదాటి యడుగైనఁ గదల్పని పువ్వుబోండ్ల నా
వంతయు జాలిమాలి బలవంతముగాఁ గొనితెచ్చి, దాస్యపుం
గాంతలుగా నొనర్చి, కడుకష్టములం గుడువంగజేసి, యి
ట్లింతలు జేసెఁగా గడవ నేరిక శక్యము కర్మజాలముల్.

గీ. మానవులెకాక, దైవసమానులైన
కాలవశముసఁ గష్టాల పాలగుదురు;
దేవదేవుని నెత్తిపై తేజరిల్లు
చందురుఁడు గూడ క్షీణత నొందఁ గనమె!

పదునాఱవ ప్రకరణము

# త్రివేణి

చిత్తూరునగరమున కొకమైలుదూరమున వేణువనమను నొక వనము కలదని మనము చదివియుంటిమి. ఆ వనమున కనతి దూరమున నిర్మలాంబుపూరితమై, యుత్తుంగ తరంగ రింగణభీకరమై యొప్పుచు నొక నది ప్రవహించుచుండును. అదియే త్రివేణి. ఆ నది మూడుపాయలై ప్రవహించుటచే దాని కీ నామమబ్బె. దాని కిరుపార్శ్వములయందును సుందర తరుసంతతులు కలవు. ఇదిగాక యచ్చటచ్చట కనులకు విందొనర్చు నిసుకతిన్నెలుంగలవు. మైళ్ళకొలఁది నుభయపార్శ్వములయందును దట్టముగా బెట్టెఁగి చూపఱుల కనుల పండువు సేయు మెత్తని పచ్చికగలదు. అట్టి యీ నదీ సికతాతలంబున నొక రోజు సాయంత్రమున షుమారు రాఱుగంటలసమయమున నొక స్త్రీయును పురుషుఁడునుఁ గూరుచుండి యేదియోవిషయమును గూర్చి ముచ్చటించుచుండిరి. వీరిద్దఱునుచూడ రజపూతకుల సంజాతులుగా నుండిరి. వారెవరో యెఱుఁగుదురా? ఆ కోమల ముఖారవింద లావణ్యాతిశయము వెలిఁబుచ్చు నారీమణి వీరాబాయియే, ఆ ఘన బాహుబలాతిశయముఁ జాటు పురుషసింహుఁడు మిహిరకుమారుఁడే. వీరిద్దఱకును రాజ్య వ్యవహారముల నేకాంతమందు విచారణఁజేయు టల వాటు. ఆనాఁడు సాయంత్రముఁవేళ వీరాబాయి యేలనోగాని విచారము నాపాదించు ముఖముకలదై మిహిరకుమారునితో నిట్లు సంభాషింప దొడఁగె.

వీరా—మిహిరకుమారా! చిన్ననాఁటనుండియుఁ గడు విశ్వాసముతో సంచరించుచు ద్రోహచింత యణుమాత్రము

లేనట్టియు సర్వవిద్యా విశారదుఁ డగునట్టియు మీతండ్రి పుష్పమిత్రుఁ డిటుల వంచనము సేయునని కలనైనఁ దలఁపలేదు కదా ?

మిహి—అమ్మా! సర్వము నెఱిఁగిన మీరుసహితము దానినింకను వంచనగాఁ దలఁపోయుచున్నారా ? మొన్న ఖేతసింగు మొదలగువారు పాదుషాపక్షముఁ జేరినతరువాత నయినను మీకది వంచనయో కాదో తెలియలేదా! ఆయుత్తరము పుష్పమిత్రుఁడే వ్రాసినచో ఖేతసింహాదు లతఁడు లేనందున సంతసించి మీకొల్వులో నిజేచ్ఛ నుండుటకు బదులు పాదుషాపక్ష మేల నవలంబింతురు? వారటులఁజేయుట మీరు కొన్నిరోజు లయినఁదరువాత నా యుత్తరముయొక్క సత్యాసత్యము లెఱిఁగి వారిని దండింతురను భీతిచేఁగదా ?

వీరా—మిహిరకుమారా! ఆ యుత్తర మాతఁడు వ్రాయనిచో నేనాతని సభలో బ్రశ్నించినప్పుడైనఁ దగు జవాబు జెప్పకుండునా ?

మిహి—అమ్మా! కల్పితమగు యుత్తరమును విని నంతనే విస్మయమునొంది నేలపడియున్న మనుజుఁ డా సమయమునఁ దమకేమి జవాబుఁ జెప్పనేర్చును ? అత్యాశ్చర్యకరమగు వృత్తాంతము విన్నచో నెవరికైన మనం బించుక జపలత నొందదా !

వీరా—ఒకవేళ సభ ముగించి యింటియొద్ద కేఁగినప్పుడైన నాదగ్గఱకువచ్చి యథార్థముఁ జెప్పరాదా? నేనతనికిఁ గ్రొత్తదానవనా? నన్నాతఁ డెఱుఁగడా ?

మిహి.— అమ్మా! యూరిలోయున్నయెడ శిరచ్ఛేద నము గావింప గాఢప్రతిజ్ఞ మీ రొనరించియుండ నా కెట్లు మీ సమ్ముఖమునకు రాగలఁడు? అట్టి ఘోరప్రతిజ్ఞ మీ నోటివెంట వెడల మరల మీ సమక్షమునకు రా నెవనికి శక్యము?

వీరా.—అయ్యో! అటులయిన నాయుత్తరము కల్పిత మేనా? మీ తండ్రి పుష్పమిత్రుఁడు వ్రాసినది కాదా?

మిహి.—అమ్మా! ఇంకను సందేహమేల? మా తండ్రి గారి గుణాగుణములు మీ రెఱుంగనివా?

వీరా.—(మిహిరకుమారుని వాక్యములఁ బట్టియు, దా నెఱిఁగినంతవఱకు బుష్పమిత్రుని యపూర్వగుణాతిశయం బులఁబట్టియుఁ బశ్చాత్తాపము నొందినదై యిట్లు వాక్రుచ్చు.) అయ్యో! పాప మతఁడిపుడెచట నున్నాఁడో కదా?

మిహి.—అమ్మా! మీరు నా కా సంగతి స్మరణకుఁ దీసికొనిరాకుడు. మీ కిట్టి భ్రమయేల? పుష్పమిత్రుఁడింక జీవించియుండునా?

వీరా.—అయ్యో! అతఁడు జీవించియుండక నిట్టి స్వల్ప కార్యమునకే ప్రాణంబుల వీడియుండునా? కొలువులో నెవ రైనఁ దప్పుఁజేసినచోఁ దగు దండనము విధించుట రాజ ధర్మముగదా! అట్టి దండనకే మానవుఁడు ప్రాణంబులఁ ద్యజించునా?

మిహి.—దేవీ! మీ కది స్వల్పముగానే యుండును. కాని మా బోంట్లకంత యవమానముకన్న వేఱుకలదా? పుష్ప

మిత్రుఁడు రసపుత్రుఁడు కాఁడా? రసపుత్రుల శౌర్యధైర్యములు బాగుగ నెఱిఁగియు మీరిటుల సెలవిచ్చెద రేల! రసపుత్రకులములో నగ్రవంశ సంభవుఁడై తోడిరసపుత్రులలో నెల్ల నగ్రస్థానమువహించి నిండు పేరోలగమున నట్టి యపవాదు సంభవింప నాతఁడిఁక బ్రాణత్యాగముఁ జేసికొనక యూరకుండునా?

ఈ మాటలువిని మీరాబాయి గద్గదస్వరముతో, 'మిహిరకుమారా! అట్లయినఁ బుష్పమిత్రుఁడు గతించెనని తలంపవలసిన దేనా?' యని మొగంబావలికి ద్రిప్పి కన్నీటిని బొటబొటఁ గార్చెను. మిహిరకుమారుఁడుకూడ నేత్రములఁ బాష్పములు గ్రమ్మఁ, దుడుచుకొనుచుఁ గొంచెముసే పూరకుండెను. తరువాత మీరాబాయి వ్యాకులముతో నిట్లనియె:

"హా! పుష్పమిత్రా! నీవు ప్రాణములు విడుచునప్పుడు నన్నెంతదూరితివోగదా! అయ్యో! నీవంటి పురుషసింహమును బోగొట్టుకొనిన నా జన్మమింకఁ గాల్పనా? మంత్రులందఱిలో నగ్రగణ్యుఁడవగు నీ యట్టి పురుషోత్తముని బోఁగొట్టుకొని యుంటినిగదా! ఆహా! నీవులేనిచో నన్నియు లేనటులదోచుచున్నవే. నీవు మా చిత్తూరునగరమును వీడినప్పటినుండియు మా చిత్తూరునగర సామ్రాజ్యలక్ష్మికూడ నీతోనే యంతరించెనుగదా! ఎట్టి సమయమునందైనఁ గట్టి పట్టుదలతో రాజ్యముఁ జక్కఁబెట్టు నీయట్టి దిట్టను రట్టొనర్చి నే నట్టి దాననై తిసిగదా! అయ్యో! రాజ్యాంగముఁ జక్కబెట్టువారు నా కింకెవ్వరు గలరు? సర్వసామ్రాజ్య శకటచోదనాచతురుఁడవగు నిన్ను విడనాడి నేనింక నీ దౌర్భాగ్యజీవముతో

నుండిననేమి ? లేకున్ననేమి ? అయ్యయ్యో ! నా పాపములు శతసహస్రంబులవటకు నన్ను లోకులెల్లఁ బలువిధములఁ దిట్టు దురుగదా ! గుణగరిష్ఠుఁడగు మంత్రిశేఖరుని రాజ్యమునుండి యకారణముగ వెడలఁగొట్టిన మతిహీనురాలనని జనులు నన్నెంతఁ దూలనాడుదురోకదా ! ఎన్నివిధములఁ బరిహసింతురోకదా ! చంపకసౌరభముఁ జంచరీక మెఱుంగిసి గతి సర్వజ్ఞుఁడవై సకలగుణ సంపన్నుఁడవగు నీబుద్ధికుశలతను జ్ఞానవిశేషమును నల్పురాలనగు నేను గ్రహింపఁగలనా ? అయ్యో ! ఎంత మందభాగ్యను ! 'వినాశకాలే విపరీతబుద్ధి' యనునట్లు మాచిత్తూరునగర రాజ్యభాస్కరుఁడస్తమించు సమయమున నాకిట్టిపాడుబుద్ధి పుట్టెగాఁబోలు. అయ్యో ! సర్వ సర్వంసహాచక్రతలము నావరించు నా భగవానుఁడు నే నిట్లుఁ జింతాంబుధి మునింగియుండ నా పశ్చాత్తాపమునైన జూచి నన్ను దరి జేర్పడా ? హా ! పుష్పమిత్రా ! నీ పవిత్రనామము స్మరణకు దెచ్చికొనునపుడెల్ల నా కెంత హృదయాందోళన మగుచున్నదోయీ ! నీ వేగినప్పటినుండియు మాకుగష్టములే సంప్రాప్తమగుచున్నవి. తండ్రీ ! నీవు మా నగరమునుండి కాలు గదల్చినవెంటనే మా కమలా సుఖలాబాయి లెచటికో పోయిరికదా ! ఏ ధూర్తునాధీనములో నుండిరో కదా ! మా ప్రియమిత్రుఁడగు చంద్రబానుఁడుకూడ నెచటికో పోయెను. అయ్యో ! క్రోధ మెంతపని జేయించును ? కర్మవశంబున బుద్ధిహీనురాలనై యానాఁటిసభలో నాకల్పితపత్రికనునమ్మి నిన్ను వెడలగొట్టినందులకుగదా నాకిట్టి యిక్కట్టులుకల్గుట ! ఒకవేళ కమలాసుఖలా చంద్రబానులుకూడ మీయందుఁగల ప్రేమాతిశయములచే నెచటనయినఁ బ్రాణములవిడచిరా ? ఓ త్రివేణీ !

సర్వ పాపసంహారిణీ! నిర్వాణపదనిర్దేశినీ! నీవైన మాకమలా
సుఖలాబాయిలజాడఁ దెల్పరాదా? ఆ సుందరీలలామలు వారి
ప్రాణముల నీకర్పించినారా! అయ్యో! పాపినగు నాకతన
నీముద్దులింత యవస్థనొందవలసివచ్చెనుగదా. ఛీ! యితరుల
గష్టఁబెట్టిన ప్రాణి యుండనేమి, లేకుండిననే" మని పలుమా
రాత్మనిందఁ జేసికొని, మిహిరకుమారుని జూచి అయ్యా!
మీకైనను మన స్త్రీరత్నముల సంగతి తెలిసినదా? మీప్రాణ
సమానుఁడగు చంద్రబానుని తెఱఁగైన నరసితిరా యనెను.
మిహిరకుమారుఁ డామాటలు విని "అమ్మా! నిన్నటిదాక
మా తండ్రిగారివలన గలిగిన దుఃఖములో మునిఁగి నేఁడు
మీ కంటబడిన నాకుమాత్ర మా యువతీమణుల వృత్తాంత
మెటుల దెలియును? నేను కూడ నాదినము వారు కనుపడ
లేదన్న సంగతి విని చాల పరితపించితిని. కాని చేయునదేమియు
లేక నిట్టూర్చకుండవలసి వచ్చినది. అయినను వేయివిధముల
వారి నా తుచ్ఛులగు ఖేతసింహాదులు మ్లేచ్ఛుల సాయముతో
గొనిపోవలయుఁ గాని మఱొండు కానేర"దని దేవితో విన్న
వించెను. వీరాబాయి యప్పటికి నిజమైన వృత్తాంత మెఱిఁ
గినదై, యిదంతయుఁ గ్రూరులగు ఖేతసింహాదులవలనఁ గలిగి
యుండవచ్చు ననితలఁచి వారిని సాధించుసమయ మెన్నాళ్ళకు
సమకూరునాయని యోచన జేయుచుండెను. మిహిరకుమారుఁ
డా మాటలనాలకించి దేవిగారితో 'అమ్మా! దైవము మన
యందు బరిపూర్ణానుగ్రహముతో నున్నచో మనకు వారిని
సాధించు సమయము చిక్కక బోదు. అట్టిసమయము చిక్కి
నచో వారు ప్రాణంబులతో నుండ' రనిచెప్పెను. మిహిర
కుమారుని శౌర్యసూచకవాక్యంబుల వీరాబాయివిని యాతనిని

రెండవపుష్పమిత్రునిగా భావించి యాతఁ డుండినచో మరల బుష్పమిత్రుఁ డుండినయటుల రాజ్యాంగము చక్కనగునని లోన సంతసించుచుండెను. ఇంతలో రాత్రి వేళ కాఁగ వారిద్దఱు జిత్తూరు నగరోన్ముఖులయిరి. త్రివేణియు నా నిరుపమాన సుందరవిగ్రహంబుల వియోగముచే సంతాపము నొందుచు మరల వారిని పవనచలిత తరంగహస్తయై పిలుచుచున్నదో యనున ట్టిరుపార్శ్వముల గట్టులపై కెగయుచుండెను.

---

## పదునేడవ ప్రకరణము

# జ్యోతిషము

అక్బరుపాదుషా యుదయసింహుని సామర్థ్యముఁ బూర్ణముగ నెఱిఁగి యవ్వానిరాజ్య మేయుపాయంబుల నాక్రమింప నగునాయని పలువిధములఁ బ్రయత్నములసల్పుచు, మంత్రుల బిలిచి యాలోచించుచు, గూఢచారుల నుదయసింహుని రాష్ట్రమునకంపి, తద్రహస్యంబుల నరయుచు, వారి యుదంతంబులచేఁ దనియక నాప్తులగు వారిఁ గూడ బ్రచ్ఛన్న వేషంబులఁ బంపుచుఁ, దనకు సంతోష మొదవు వార్తలఁ దెచ్చువారికిఁ బారితోషికంబుల నిచ్చుచు శత్రురాజ వినాశంబున కెదురు చూచుచుండెను. అట్టిపాదుషా యజమీరు సంస్థానాధీశుఁడును, బలవంతుఁడునగు నుమరల్ శాహో గూడఁదన కనుకూలుఁడని తెలిసి కడు సంభ్రమోపేతుఁడై, యెపుడు సమయము వచ్చునా, యేవేళ నుదయసింహుని రాజ్యముపై దాడి వెడలి చిత్తూరు నగరమును ధ్వంసముఁ జేయుదుమా, యని యువ్విళ్ళూరుచుండెను. ప్రతిదినమును సైన్యము నభివృద్ధిఁ జేయు

చుండెను. ధనమును హెచ్చించుచుండెను. పాడుపడిన కోట
గోడల మఱల రెట్టింపుబలిమితోఁ గట్టించుచుండెను. ఇతర
రాష్ట్రములవారితో సాయముకొఱకు సంధిసలుపుచుండెను.
కాలముకొఱకు నిరీక్షించుచు దినముల లెక్కించుచుండెను.
రాణాను జయింపనేగినచోఁ దన నగరముమీఁది కెవరైన
దండెత్తివత్తురేమోయని తలఁచి కోటవెలుపలి భాగమందును,
లోపలిభాగమందును కందకములఁ ద్రవ్వించుచుండెను. ఆ
కందకములకు పైగా మఱికొన్ని గోడలఁ గట్టించుచుండెను.
ఇంకఁ దృష్టిలేక ఢిల్లీనగరముయొక్క నాలుగువైపులను గొప్ప
గొప్ప పటాలములనుండ నియమించెను. వీనినన్నిఁటినిసిద్ధపఱచి
యొకరోజున మంత్రిని బిలిచి, "భాయీ! కొద్దికాలము
క్రిందనే తమరు నాయొద్దకువచ్చి రాజ్యవిషయము లేమియు
బాగుగా నుండలేదనియు, మనమిట్లు చేయఁగూడదనియు
జెప్పితిరిగదా! ఇప్పుడైనఁ దమకుఁ దృష్టికలిగినదా?" యనెను.
అపుడు హామీరులాలు తలయూఁచి యంతయు బాగుగనే
యున్నది. కాని మనము జయమందగలమా యన్న శంక
మాత్రము నాకుఁ గలదని చెప్పెను. పాదుషా యీ మాటను
విని యిట్లు చెప్పఁదొడఁగెను. "పోరులో జయాపజయంబులు
దైవనిర్మితంబులు గదా! మనము యుద్ధమునం దోడుదుమో
గెలుతుమో చెప్పుట దుర్లభము. ఒకవేళ మనమోడుద
మనియే తలంచుదము. ఓడినచో మనము చేయునదేమి?
మానవప్రయత్నములోఁగల దానినంతయు మన మొనర్చితిమి,
మిగిలినదంతయు దైవాధీనమే. అట్టిదానికి మన మోడుదుమన్న
భయముతో నుండనేల? మానవుఁడేకార్యముఁ దలబెట్టిన, నది
కొనసాగదన్న యుద్దేశముతో దానిని ప్రారంభించునా?

అట్లు ప్రారంభించినచో నాతఁ డా కార్యము నిర్వహింపఁ గలఁడా? మనకుఁ గావలసినంత పరివారము సంపాదించితిమి. ఇంకను దైవానుగ్రహమువలన సంపాదింపఁగలము. సంగ్రామ విజయమున కుపకరించు వానినన్నిఁటిఁ జక్కఁగా నేర్పఱిచితిమి గదా? అయినను మనకు శంకాశూన్య మగునటులఁ బండి తోత్తములఁ బిలుపనంపి యుద్ధఫలితముఁగూర్చి యడుగుద మనెను. ఆ మాటలువిని హమీరులాలు జ్యోతిష్కునికొఱకు భటుని బంపుఁడనెను. పాదుషా తన యాస్థాన మందుఁగల జ్యోతిష్కులందఱకేకాని, బండితోత్తములకును వార్తలఁ బంపెను. వారందఱొక దినమున సభఁ గావించిరి. అప్పుడుఁ బాదుషా 'పండితులారా! మేమొనరింప నెంచు మహాయుద్ధములో జయ లక్ష్మి యెవరిని వరింపఁ గలదో నిక్కముగఁ జెప్పఁ గలరా?' యని వారలఁ బ్రశ్నించెను. పండితులంద ఱీ ప్రశ్నమువిని యా ప్రశ్న కనుకూలమగు నుత్తరమిచ్చినఁ బాదుషా ఘనముగ బహూకరించునని తలఁచి దీర్ఘముగ నాలోచింపఁదొడఁగిరి. అట్లు దీర్ఘాలోచనఁ జేసి వారంద ఱొకరి జవాబున కొకరిజవాబు సంబంధము లేనటుల నుడివిరి. పాదుషాయా జ్యోతిష్కుల వచనంబుల విని యొకదానికొకటి సంబంధింప నందుల కసంతృప్తి నొంది, వారి నంతటితో సభఁ జాలింపుఁడని చెప్పి పంపివేసెను. వారందఱు వెళ్ళినతరువాతఁ బాదుషా హమీరులాలును పిలిచి "భాయీ తెలిసెగదా వీరి ప్రగల్భములు. నేను మీతో మొదటఁ జెప్పలేదా? ఏల మనకీ వృథాప్రసంగములు? మన మేకార్యమునైన సంకల్పించుకొనినయెడ నితరులతో సంప్రదించుట మనకేల? మనము ద్రవ్యహీనులమా? యుక్తాయుక్తము లెఱుఁగమా? ఇట్టి యప్రస్తుత ప్రసంగమువలన మనయుత్సాహ

మెల్ల నిరుత్సాహముగుటయే గాక మనకు వేఱులాభముకలుగ నేర్చునా?" యనెను. తరువాత హమీదులాలు మరలఁ బాదుషాతో నిట్లనియె.

"భాయీ! మీ రాగ్రహింపకున్న నేనింకొక జ్యోతిష్కుని పేరుఁజెప్పెదను. అతని నొక్కనిపరీక్షించిన తరువాత మీరు యుద్ధసన్నాహ మొనర్పవచ్చును." పాదుషా వొట్టులనో దాని కియ్యకొని యా జ్యోతిష్కుని పేరుఁ జెప్పుమని యడుగ నా మంత్రి 'యాతనిపేరు గోకులదా' సని చెప్పెను. గోకులదాసను మాట విన్నంతనే పాదుషా యమితానందము నొంది యాతనికీర్తి నిదివఱకు వినినందున నాతనినోటి వెంట యుద్ధఫలితము వినఁ గుతూహలముతో వానికొఱకు భటుల నంపుడనెను. తదాజ్ఞానుసారము మంత్రి కొందఱభటులను శంకరమఠమునకుఁ బంపెను. ఆ మఠమునకుఁ బోవుదారి చాలఁ గఠినమైనదని మన మిదివఱకు జదివియుంటిమి. అయ్యది గ్రీష్మఋతువగుటఁ జేసి వారందఱు మార్గాయాస క్లేశంబున నచ్చటచ్చటఁ గూర్చుండుచు, మూలుగుచు నెట్టులనో పోయిరి. అచటికిఁబోగా నా మఠము మూయఁబడి యుండెను. తలుపుఁ దట్టుచు వారందఱుఁ గేకలిడసాగిరి. కాని లోపల నెవరును పలుకలేదు. తుదకు వారందఱును వేసారి కొందఱచటనే యుండిరి. కొందఱు మరలఁ బాదుషాయొద్ద కేగఁ బయనమయిరి. పాపమచట వేచియుండినభటులు మరల నింకొకసారి తలుపుఁ దట్టిచూచిరి. కాని యా సమయమందును జవాబేమియు రాలేదు. అప్పటికి రాత్రివేళ కావచ్చెను. పాదుషా యాజ్ఞ నుల్లంఘించినచో వారికి తప్పక ముప్పువాటిల్లును. అట్లే వారాతలుపుఁ దీయునంతవఱకచటఁ గాచుకొనియుండిరి.

కొంతసేపయిన తరువాత లోపలినుండి యొక యువకుఁడు వచ్చి
తలుపుఁదీసెను. వారు లోపలఁ బ్రవేశించిరి. గోకులదాసు
వారినిజూచి వారువచ్చినకారణ మేదియో కనుగొనఁ గుతూ
హలుఁడై వారిని 'మీ రెవరిభటులని' యడిగెను. వారు
'మేము పాదుషాగారి భటులము. మిమ్ములఁ దోడ్కొని
రమ్మని వా రాజ్ఞాపించి' రని చెప్పిరి. దాసుగా రిదివఱకు కట్టి
భటులు తనయొద్దకు వచ్చి యుండుటయుఁ దన్ను మోసగించి
యుండుటయు గుర్తెఱిఁగి వారుకూడ మోసకాండ్రే యని
తలఁచి వారిని యచ్చోఁ బంధింప నిశ్చయించెను. తరువాత
శిష్యుఁడగు సుందరునితో మాటలాడి మొదటనే వారిని బంధింప
నిచ్ఛలేకఁ బాదుషా సంతకమున్న యుత్తరమును జూపినగాని
మేమురామనిచెప్పి వారిని బంపివేసెను. వా రంతసేపు వేచి
యుండినను దానికి ఫలము లేనందులకుఁ జింతిల్లుచు మరలఁ
బాదుషాయొద్దకేగి యా యుదంతము నంతయు సవిస్తరముగాఁ
జెప్పిరి. చెప్పినతోడనే పాదుషా యటులనే యొక యుత్త
రమును వ్రాసి దిగువ సంతకముఁజేసి యీసారి మొదట శంకర
మఠమునుండి వెంటనే తిరిగివచ్చిన భటులఁ బంపినచో వారి
కదియొకవిధమగు శిక్షగా నుండునని తలఁచి వారినే పంపెను.
వారటుల నానాశ్రమలందుచు శంకరమఠముకడకేఁగిరి. వెళ్ళగా
వారియదృష్టమువలనగాఁబోలు మఠములోనివారు తలుపుఁ
దట్టినంతనే పలికిరి. వెంటనే వారు లోపలఁ బ్రవేశించి
యా యుత్తరముఁ జూపిరి. అప్పుడు గోకులదాసా భటులఁ జూచి
మొదటవచ్చినభటులు వారుకానందులకు మనంబున సందే
హించుచు మరల సుందరునితో నాలోచించెను. సుందరుఁ
డా మాటలు విని యా యుత్తరముఁ దీసికొని తాము వెంటనే

వత్తుమని చెప్పెను. కొంతసేపైనతరువాత దాస సుందరులు కలసి వారికొఱకై యా భటులు తెచ్చిన శకటము నెక్కి పోయిరి. ఆ భటులు ఢిల్లీ చేరినతరువాత నొక గంటకు గోకులదాసచటికి వచ్చెను. వీరువచ్చినవృత్తాంతము భటులు పాదుషాతోఁ జెప్ప గనే పాదుషా పాన్పునుండి లేచి దాసు నెదుర్కొని సలాము లొనరించి వారి నొకయుచితాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. అపుడు హమీరులాలు దాసు ననేకవిధములఁ గొనియాడి వారిని నానావిధపుష్పమాలికలచే నలంకృతులఁ జేసెను. తరువాత పాదుషా యుద్ధఫలితముఁగూర్చి ప్రశ్నించి తా నిదివఱకనేకుల నా సంగతినిగురించి ప్రశ్నించితిననియు, వా రెవరుఁ దనకుఁ దగు సమాధానముఁ జెప్పలేదనియు, మిమ్ములఁ బ్రశ్నించినచో శంకానివారణమగునని దమకుఁ గబురంపితి' నని చెప్పెను. వెంటనే దాసు మందస్మితాననుఁడై గడువిధేయతఁ జూపుచు సుందరునియొద్దగల సంచినిదీసి దానిలోని తాళపత్రగ్రంథం బొండు గ్రహించి యత్యాడంబరమున మీనమేషంబుల లెక్కిడి, చాలసే పాలోచించి, సెహబాష్ యని తలయూచి, ప్రతివిషయమును పాదుషా కనుకూలముగనే చెప్పెను. అపుడు పాదుషా యత్యంత సముత్సాహియై, పసిండి కమండలువును సువర్ణాంబరములు దెచ్చియు, నొంటరిగ నా నిర్జన ప్రదేశమందుండు నాతని కాత్మరక్షణార్థ ముపకరింప మణిఖచితమగు ఖడ్గంబొండుఁ దెచ్చియిచ్చి, వందన మాచరించెను. దాసుగూడ సంతసముజెంది, వెడలిపోయెను.



పదునెనిమిదవ ప్రకరణము

# గూఢ వాక్యములు

కమలా సుఖలాబాయి లట్లు శంకరమఠమునకుం గొంపోవఁబడి గోకులదాసునకుఁ బరిచారకాంగనలుగా నీయఁబడి నప్పటినుండియు మనకు వారివృత్తాంత మించుకయైన దెలియుటయే లేదు. వారు మఠములో బ్రవేశఁ బెట్టబడినంతవఱకు నీ ప్రపంచములోనే లేరు. తరువాత గొంతసేపటికి వారికి దెలివి రాగా షేతసింగు మొదలగువా రచట నే యుంట తెలియగా గనులఁ జూడనొల్లక వారు మరల నా స్థలమునుండి వెళ్లిపోవుట జూచి కనులవిప్పి యా మఠము నల్దిశలఁబరికించి చూచిరి. చూడగా వారి కేమి కనుపడును? అది యంతయు నరణ్య ప్రదేశముగాఁ గనుపడెను. వనంబుల స్వైరవిహారమును సల్పు పులుగులజంట పంజరంబున బంధింపబడున ట్లా సుందరీమణులావనమునందుండిరి. అచట గోకులదాస సుందరులు మాత్రము వారికగుపడిరి. పాప మా స్త్రీలు వారిని చూచినంతనే దాసుగారి వికారాకృతి జూచి కాబోలు గనులు మూసికొనిరి. మఱియు నచట నా గృహముదప్ప నే మనుష్యసంచారమైనను లేనటుల వారికిఁదోచెను. ఏది ఎటులున్న వా రేమిచేయఁగలరు? ఎవరిని నోరెత్తి పలుకరింపగలరు? ఆ నిర్జనప్రదేశమున వీరి మొఱ నాలకించువా రెవరు? సర్వముం ద్యజించి మఠమున వసించు నా బైరాగి వీరిమొఱ వినునా? లేక దూరమునుండి మార్మ్రోతలిడు నా కొండవాగులు వీరి యార్తనాదముల విని యూరడింపఁగలవా? ఎవరికర్మఫలము వా రనుభవింపక దీరదు. ఆ స్త్రీలూరకఁ గంటఁదడిబెట్టుచు గూర్చుండిరి. వారలు

కా నిర్జనప్రదేశ మెంత దుఃఖావేశ మొదవించుచున్నదోకదా! నిష్ఠమనఁ గలనైన నెఱుఁగక సదా యంతఃపురాంతర వాసినులై, మృదుతల్పంబుల దాసీజన ప్రియాలాపములఁ బొరల్యము నొందు కన్యాతిలకములకా యిట్టి యవస్థ? అంతఃపుర్యాభ్యంతరము దాఁటి యముద్రైన నవలఁ బెట్టనేరని వారిరువుర నాయకులకోలఁది దూరమునకుఁ దీసికొని రాబడిరే? చిత్తూరునగర మేడ! శంకరమఠమేడ! ఈ సంగతి దలఁచునకుఁ దెచ్చుకొనినచో వారి హృత్కమలములు వ్రయ్యలు గాకుండునా? పాఠకులారా! మీరే యోచింపుడు. కమలా సుఖదాబాయిల యవస్థలో మీరే యున్నట్లెంచుకొని తత్సమయములో మీరేమిచేయగలరో చెప్పుడు. మీ మనంబున కేమైనఁ దోఁచునా? మీకు మాటాడ పెలుగునా? ఆ నారీరత్నముల యునికి మీరు వర్ణింపఁగలరా! శిరములవంచి, కన్నీరు మున్నీరగునట్లేడ్చు నా పూర్ణేందు నిభాస్యల మీ స్మరణకొకమారు దెచ్చుకొనుఁడు. వారట్టి స్థితిలో నుంటఁజూచి మీరోర్వఁగలరా! చూచినంతనే మీరుకూడ దుఃఖాబ్ధిమునుఁగరా? యెట్టి వజ్ర కాఠిన్యహృదయములైన నిమేషమాత్రమున నవనీత సమానములుకావా? ఆహా! వర్షాగమమందలి మెరుపుందీవెల నిరసించు తనుద్యుతిఁగల కమలాబాయి యిపుడేరీతిఁ గనబడుచున్నదో చూడుడు! దుఃఖాబ్ధిమునిఁగి యున్నవారిని సయితము దన దరహాస చంద్రికలచే నానందాబ్ధిఁదేల్చు సుఖదాబాయి యిపుడెట్లూరకున్నదో గమనింపుడు. పగవారైన నాజగన్మోహినులఁ గనినంత మాత్రనె దుఃఖమునందకుందురా! అయ్యో, ఏమి వెఱ్ఱి! మన మిట్లనుకొననేల? సర్వము నెఱింగియు మనమిటులూరక విచారణఁ జేయనేల? కర్మవశముందప్ప నెవరి

తరము? ఎంతభాగ్యమున్న, నెంతబలమున్న, నెచ్చో దాగి యున్ననువచ్చు సుఖదుఃఖములఁ బాసి చరింప నెవరికి శక్యము? షోడశకళాపరిపూర్ణుఁడగు చంద్రుఁడు సర్వదేవాధిపతి యగు ముక్కంటి శిరంబెక్కియు క్షీణత నొందకుండునే? కాలవశమున వివేకియుకూడ నవివేకివలె గన్పట్టునుగదా! వారిట్లు వంతగుందుచున్నను గీతులో మేలగునట్లు వారికొక సహాయము మాత్రము దేవుఁడొనగూర్చె. దానివలననే వారింకను ప్రాణములతో నుండిరికాని లేనిచో వారప్పుడే తమ ప్రాణముల వీడెడువారు. శతసింహాదులు వీరిని బలాత్కారముగ గొనిపోయి వివాహమాడ నిర్బంధించి, వారద్దాని కంగీకరింపనిచో మానభంగమొనర్చుటకంటె వారికి దాసుని కృపచారి కాంగనలుగా నుండుటే మేలు. ఇదియే వారికన్ని విధముల సౌఖ్యదాయకము. ఆ స్త్రీ లీరీతి విచారము నొందిన తరువాత నేమియుఁ జేయునది లేక యచట గూర్చుండిరి. వీరిట్లు సంతాపపడుచుండ నేలనోకాని దాససుందరు లా సుందర విగ్రహములఁ జూచి నిర్వైర పాటొందుచు నించుక నవ్వుచు వారిలో వా రత్యాశ్చర్యము నొందుచుండిరి. పాపము! వారు మాత్ర మా స్త్రీలనెట్లు పలుకరింపగలరు? తుదకు దాసునాజ్ఞ చొప్పున సుందరుఁడు వారికడ కేగఁదలఁచి, సిగ్గుచేఁ దొట్రుపాటొందుచు వారల సమీపించి 'అమ్మా! మీరిట్లేల యింతి లెదరు? ఎట్టి దిక్కులేని వానినైనఁ బుత్రప్రేమఁ జూచి కాపాడు మా గురుండిచట నుండ మీ కేమికొదువ. మీ రిట్లేల దీనవదనలై కూరుచుండుటకుఁ గారణమేమి? లెండు; ఈ జలంబులఁ గొని మీ పాదముల శుభ్రము జేసికొని యీ పళ్లెరంబులలోని యాహారముఁ గొనుఁడనెను. సుందరుఁడు వారిని సమీపించునెడ

నా యువతీరత్నముల మేనుల గగుర్పాటొదవెను. వారలఁ బలుకరించి మాటాడునెడ వారు విస్మయమునొందసాగిరి. అతని మాటలువిననతరువాత 'అయ్యా! అటులనే' యనిరి. కాని వారి కాస్థితిలో నాహారమేల? సుందరుఁడు వారి నాహారముఁ గొనుఁ డని పలుమారు నిర్బంధపెట్టఁ గొంతతడవున కా సుదతీలలామలు లేచి యా పళ్లెరంబులోని యాహార మించుక గ్రహించిరి. కాని దుఃఖవివశలగు నా స్త్రీల కాహారము రుచించునా? తరువాత రాత్రిసమీపింప సుందరుఁ డా స్త్రీలకు శయ్యాస్థలముఁ జూప వార లా రాత్రి నెటులనో గడపిరి. ఈ స్త్రీలు పరిచారికాంగనలైనను వీరి కిసుమంతైనఁ బనిఁజెప్పకయె ప్రతి కార్యము దాసు సుందరునివలననే చేయించుచుండెను. ఈ సంగతిని స్త్రీలు కనుఁగొని వారిలో వారు దాసుని గొనియాడుచు నత్యాశ్చర్య మందుచుండిరి. ఇట్లు దినములు కొలఁది జరుగుచున్నను దాసు వారల నిసుమంతయైనఁ బనిఁ జేయనిచ్చుటలేదు. ఆ స్త్రీలిద్దఱికి నా పురుషయుగ్మ మెవరో వా రెందుకటులఁ బరిచర్య నొనర్చుచున్నారో తెలియదు. ఇట్లుండ గోకులదాసు నానాఁటిరాత్రి పాదుషా పిలువఁబంపి నపుడు వారిద్దఱును పాదుషాయొద్ద కేగవలసివచ్చెను. కాన నా స్త్రీరత్నముల నా యింటనుంచి బయటఁ దాళమువేసి పోయిరి.

ఆ రీతి దాససుందరులు మఠము విడిచిపోయినను వారి మనస్సంతయు నా స్త్రీలయొద్దనే యుండెను. అయినను దైవము మీఁద భారమునుంచి వారేఁగిరి. వెళ్ళినతరువాతఁ 'బాదుషా వారి నెదుర్కొని యుచితాసనమిచ్చి వారిం బ్రశ్నించెననియు నా ప్రశ్నఫలం బనుకూలముగా నుండుటచే గోకులదాసునకు

వస్త్రములతోఁ బాటొక ఖడ్గముఁ గూడ నిచ్చెననియు మనము చదివియుంటిమి. ఆ ఖడ్గము తీసికొని దాసు తిరిగి వచ్చునప్పు డాతని సంభ్రమమింతయని చెప్పనలవి కాదు. సుందరుఁడుకూడ గురువు ననుసరించి సంతుష్టాంతరంగుఁడై యతివేగమునఁ బోవుచుండెను. వీరు దారి నడచుచు శంకరమఠ సమీపము నకు రాగా నచ్చటనుండి కడు సంతోషాతిశయమున గీతములఁ బాడుచు మఠముఁ బ్రవేశించిరి. ఈ పాటలను విని మఠములోని కాంత లిరువురు దమ నెత్తుకొని పోవ మరల నెవరో వచ్చు చున్నారని దిగులందసాగిరి. తరువాత నా తాళముదీసి లోనఁ బ్రవేశింప, వారలఁజూచి యా స్త్రీలు భయరహితులై యెప్పటి యటులఁ గూర్చుండిరి. అపుడా పురుషు లిద్దఱు సంభాషింపఁ దొడగిరి.

దాసు—సుందరా! నేఁటిసుదినము! ఆ తురుష్కుఁడు నాకు బహుమానముగా నిచ్చిన ఖడ్గమును జూచితివికదా?

సుంద—అయ్యా! అయ్యది నిశాసమయమగుటచే నేను బాగుగఁ జూడలేదు. అయినను పాదుషాయంతవాఁ డిచ్చు ఖడ్గము మంచిది కాకుండునా?

దాసు—సుందరా! మంచిదియని వేఱడుగనేల? దైవసాయముండినచో నీ కరవాలంబుననే గదా నాకన్నా తమ్మని కంఠముఁ దెగవేయుట. ఆహా! ఆ దిన మెప్పుడు సమీ పించునోకదా!

సుంద—స్వామీ! మీరు తొందరపడనేల? అట్టి దినముమాత్ర మెంతదూరమున్నది? అదియును సమీపించు

చునేయున్నది. రాణావారికిని బాదుషాకును బరస్పర వైరము గలుగునపుడు కలహము పొసఁగుట కెంతకాలము పట్టును ?

ఇట్టుల వీరు సంభాషించునెడ నా స్త్రీల కౌశ్చర్య మొక్కుడు గాజొచ్చె. వారిటులఁదలఁచిరి. ఏమీ ! బాదుషా కంఠముఁ దెగవేయుటకు దా యా బైరాగి ముచ్చటించినది. పాదుషా కితఁడు ప్రతికక్షియా యేమి ? అటులయినచోఁ బాదుషా సినినేలఁ బిలిపించును ? అదిగాక రాణావారికిని పాదుషాకును కలహాంకురము కాగలదని యా శిష్యుఁడు నుడివినాఁడు. దారపుత్రాది బంధువర్గము వీడి పెనుకొండలనడుమ నొంటరిగా మఠములో నివసించు నీదాసెటులఁ బాదుషా కంఠముఁ ద్రుంపఁగలడు ? ఇదంతయుఁ జూడ బరస్పర విరుద్ధముగను, గడు గూఢముగ నున్నదే ! ఇయ్యది యథార్థమా ? లేక మనము కలవరించుచుంటిమా ! యని వారిలో వారు ప్రశ్నించుకొనుచు నేమియుఁ దోచక నూరకుండిరి. కొంత సేపైనఁ దరువాత దాస సుందరు లా ప్రసంగము వదలి యా కత్తినిఁదీసి పదిలముగ నొక పేటికయందుంచి యచటి కృష్ణాజినముల మీఁదఁ గూర్చుండి జప మొనరింపసాగిరి.



పందొమ్మిదవ ప్రకరణము

# రేణుదుర్గము

అజమీరునకు నలీపురమునకు నడుమనంతయు నరణ్య ప్రదేశము. ఆ భీకరారణ్యములో నచ్చటచ్చట నెత్తయిన కొండలు గలవు. వీనికావల విశాలమై మహీరుహశూన్యమై యొక గొప్ప మైదానముకలదు. ఇదియంతయు నిసుకమయమై యుండును. అందుచే నచ్చటచ్చటఁ జిన్ని పొదలుతప్ప మఱే మియుఁ గానరావు. అట్టి యీ మైదాన మధ్యమున వల యాకారముగల దుర్గ మొకటి కలదు. ఇదియే రేణుదుర్గము. ఈ దుర్గారణ్యము లుమరల్ శాహా స్వాధీనములు. అక్బరు పాదుషా యటుల గోకులదాసుచే యుద్ధఫలిత మెఱిఁగి మఱింత సమరోత్సాహియై వెంటనే యుమరల్ శాహా కొక లేఖ నంపెను. ఈ యుత్తరముఁ జూచినగనే యుమరల్ శాహా తాను కూడ రసపుత్రద్వేషిగావున సైన్యము సిద్ధముఁ జేయించెను. అటుల సర్వము సిద్ధముఁజేయించి యొకరోజునఁ గదలి సైన్యముతో రేణుదుర్గముఁ జేరెను.

ఢిల్లిలోఁ బాదుషాకూడ సంతోషంబున సైన్యముతో సంసిద్ధుఁడై నిజనగర రక్షణమొనర్చు రాజ్యభారము హామీరు లాలు హస్తములోనిడి రేణుదుర్గమునకేఁగెను. రేణుదుర్గమున కన్నివైపుల సైన్యము విడిసెను. ఎచటఁజూచిన గుడారములే. సైనికా శిబిరముచెంత సరదార్లందఱాయుధపాణులై కావలిఁ గాచుచుండిరి. ఇటుల పదిలక్షల సైన్యమమితానందము నొందు చుండఁ బాదుషాయొద్ద కొకభటుఁ డతివేగమునఁ బఱువెత్తి వచ్చి హామీరులాలున కత్తాత్తుగఁ జాల జబ్బుచేసినదనియు,

ఢిల్లీనగరమంత్రియు ననాయకంబై యున్నదనియుఁ జెప్పెను.
అంతటఁ బాదుషా ఖిన్నుఁడై యది తాఁజేయఁబోవు కార్యమున
కశుభావహామనితలఁచి వెళ్ళకతప్పదుకనుక సైన్యమునంతయు
శాహా స్వాధీనముఁజేసి తాను పయనమాయెను. సైన్య
మంతయుఁ బాదుషాను బాయనొల్లక వారిని నాపఁదలఁచిరి.
కాని యాతఁడు వెళ్ళనిచో రాజధాని పరుల పాలగునని
సైనికుల కెటులనో సమాధానముఁజెప్పి వెడలిపోయెను.
అతఁడు ఢిల్లీ ప్రవేశింపగనే కొందఱు ధూర్తు లాతనికడ కేఁగి
'హామీరులాలు సాహెబు మృతినొందె'నని చెప్పిరి. ఆ వృత్తాం
తము చెవి సోకినంతనే పాదుషా తెలివిదప్పిపోయెను. వా
రాసంగతిఁజెప్పి మరలగనుపడకుండఁబోయిరి. తరువాతఁగొంత
దూరమేగగా హామీరులాలున కెట్టి వ్యాధియుఁ గలుగ
లేదనియు, నతఁడు సుఖముగ రాజ్యతంత్రములఁ జక్కఁబరచు
చున్నాఁడనియును, బాదుషాకుఁ దెలిసెను. అందుచే పాదుషా
కేమియుఁదోచక స్వయముగ హామీరులాలు దేవిడియొద్ద
కేఁగెను. పాదుషా వచ్చుచున్న సంగతిఁ దెలిసి హామీరులాలు
వారిని నెదుర్కొనవచ్చెను. పాదుషా యతనిజూచి నివ్వెరపడి
మంత్రిని బండిలో నెక్కించుకొని తనసౌధమునకుఁ గొం
పోయెను. అప్పుడు పాదుషా మంత్రితో 'భాయీ! మీకు
చాల జబ్బుచేసినదని మన భటుఁడొకఁడు వచ్చి నాతో
చెప్పెను. అది నిజమేనా?' యనెను. మంత్రియాశ్చర్యమునొంది
'భాయీ! తమకృపయు నల్లా కృపయుఁగలుగ నా కేమి
కొదువ? అయిన నీ వృత్తాంతము మీ కెవరు చెప్పి' రని యడి
గెను. పాదుషా మాఱుఁజెప్పలేక తా నా మనుష్యుని గుర్తింపఁ
జాలనని చెప్పెను. లోకులు తనపై నట్టి యపవాదు వేసి

నఁడుకు హమీరుఁడా లచ్చోసువందుచుఁ బాదుషాను మోస
పుచ్చఁ గలిగినంత ధైర్యుఁ డెవరయి యుండునా యని తలపోయు
చుండెను. తరువాత పాదుషా మంత్రితోఁ దప్పక నా మోస
కాఁడు పట్టుఁబడఁగలఁడని చెప్పుచుఁ దాను పోయి రేఁబు
దుర్గమునందు మరల సైన్యముఁ గలిసికొనఁ బయనమాయెను.
అతఁడు మరల రేఁబుదుర్గముఁ జేరగ శాహా 'సర్దార్ సాహెబ్ !
హమీరులాలు సాహెబుగారికి క్షేమమా' యని యడుగగా
బాదుషా జరిగిన వృత్తాంతమునంతయుఁ జెప్ప శాహా యమి
తాశ్చర్యము నొందెను. అంతఁ బాదుషా తన సైన్యములోని
ఖేతసింహాదుల సమీపించి వారితో నీ యుదంతమంతయుఁ
జెప్పెను. వారా సంగతివిని యా మోసగాఁడు తప్పక రస
పుత్రుఁడేయనియుఁ దురుష్క వేషముధరించెననియు నింకొకసారి
వాఁడు కానవచ్చినచోఁ దప్పకఁ బట్టుబడఁగలఁడనియుఁ జెప్పిరి.
పాదుషా ఏమియుఁ జేయునది లేక కొందఱు వేగులవాండ్ర
నా దుర్గమున కన్నివైపుల నుండ నియమించి యెవరయిన
కృత్రిమ తురుష్క వేషముతో వచ్చిన వానిని బలాత్కార
మునఁ బట్టుకొండని యాజ్ఞనొసఁగెను. వారి భ్రమయే కాని
పాదుషా నొకసారి మోసపుచ్చిన మనుష్యుఁడు మరల నంత
త్వరగా రెండవసారి వచ్చునా? పాపము! పాదుషా తనకు
కలిగిన మోసమునకుఁ జిన్నపోయి దానిని వివేకవంతుఁడగు
శాహాతోఁ గూడఁ జెప్పినందులకు మఱింత సిగ్గుపడి లోలోనఁ
బరాభవానలముచేఁ గృశించుచుండెను.

---

ఇరువదియవ ప్రకరణము

# చిత్తూరు నగరము

చిత్తూరునగరము పురాతన కాలమునుండియు విఖ్యాతిఁ జెందిన రాజ్యము. ఈ పట్టణము సకలజనస్తుతి పాత్రంబై, సకలైశ్వర్య స్తోమంబై, సర్వవస్తుపరిపూర్ణంబై యలరారు చుండును. ఇయ్యది పూర్వకాలమునందుఁ జోళవంశరాజులకు ముఖ్యపట్టణమై యసమాన గౌరవము నొందియుండెను. ఆ నాఁటి రాజులందఱీ పురసౌభాగ్యమును వేనోళ్ళఁ బొగడి యుండిరి. వైశాల్యముఁబట్టియుఁ జక్కనిమందిరములనుబట్టియుఁ జిత్తూరునగరము మిక్కిలి ఘనతనువహించి యుండెను. ఎచటఁ జూచిన శృంగార ప్రాకారములే! ఏనైపుఁజూడ మందిరములే. వీనినన్నిఁటిఁజూడ నెవరిమనము బ్రహ్మానంద మొందకుండును? ఏ మానవునకు నయనోత్సవదాయకముగాదు? ప్రాకార సౌధ హర్మ్యసమేతమై నేత్రపర్వమొనర్చు నీనగర మెవరిహృదయము నాకర్షింపకుండును? ఆ నగరరాజమంతయు నరరాజులనఁబడు రసపుత్రుల కాలవాలము. ఈ పట్టణవీథులెల్లపుడుఁ దుడువఁబడి కలయంపి చల్లబడియుండును. గృహములెల్లఁ దగురీతి నలంక రింపఁబడి యుండును. ప్రతి గృహద్వారమునకుఁ బూలతోరణ ములుకట్టబడి గృహాంగణమున రంభా స్తంభములపై ధ్వజపటము లెత్తఁబడియుండును. ఎచటఁజూచిన కర్ణరసాయనమొనర్చు మంగళరవములే. సదా జనులెల్ల దివ్యవస్త్రాభరణాలంకృతులై నగుమొగములతోఁ బరస్పర సంభాషణముఁ జేయుచు సంతు ష్టాంతరంగులయి యున్నటులఁ గనఁబడుదురు. రసపుత్ర కుమారు లెప్పుడును వీథులవెంట సగర్వమున విహరించు

చుందురు. ఆ శృంగారపట్టణమున నేత్ర పీడాకరమగు వస్తు వేమియుఁ గానరాదు. అచ్చో సర్వసమృద్ధియు, శాంతియు, సంతోషముఁ గనఁబడును. వే యేల ? నాపురవరం బత్యంత మనోహరంబయి కన్నట్టకుఁ దీరదు. అహా ! సకల సంపదుపేతమై, సర్వభోగాస్పదమై, సకలైశ్వర్యమండితంబగు నీ చిత్తూరుసామ్రాజ్యము ఖేతసింహాదుల క్రూరాలోచనల శత్రువులపాలై పోవునా యేమి ? ఆ నగరరాజ ప్రాసాదములు, నా భవ్యగోపురములు, నా సుందర మందిరంబులును పర చేతఁ బడవలసినదే ! అయ్యో ! ఆ రాజప్రాసాదంబులన్నియు శిథిలముఁ గావలసినదే ! ఆ భవ్యగోపురములన్నియు నేలను మట్టముఁ గావలసినదే ! ఆ సుందర మందిరంబులన్నియుఁ బందిర వందరఁ గావలసినదే ! ఆ వీటి రసపుత్రవీరులందఱుఁ బరరాజ హస్తంబులఁబడి మడియవలసినదే ! ఆ నగరలక్ష్మికి సమాఁగుఁ జెలికత్తెలగు రసపుత్ర వీరాంగనలెల్లరు శత్రువులచేఁ జిక్క వలసినదేనా ! ఏమి యిట్టి యసాధారణకృత్య మొప్పుదైన సంభ వించునా ? భూతలస్వర్గము నాఁ జెన్నుమీఱు చిత్తూరునగర మేమి ? శత్రువులచేఁ జిక్కుటేమి ? నరరాజులగు రసపుత్రు లేమి ! పరరాజులకు లొంగుటేమి ! ఓయీ ! ఖేతసింహా ! కులకలంకా ! నీ యాశలన్నియు నీ చిత్తూరునగరమును ధ్వంసముఁ జేయుటకేనా ? చిన్నప్పటినుండియు చిత్తూరునగ రమునందుండి పెరిగి నేఁడిచ్చటికో పోయి యాతురుష్కుని చరణం బాశ్రయించుకొని యీ ఘోరంబును తుచ్ఛవృత్తుల నాచ రింప నెంచితివా ? ఓరీ ! అభయసింహా ! ఇంతకు న్యాయ మార్గావలంబివగు నీవుకూడ చిత్తూరునగరమును శత్రువుల కర్పింపఁ దలఁచితివా ? ఓరీ ! కుంభరాణా ? నీవు ! నీవిట్టి

నిష్కారణయుద్ధముఁ గల్పించినందుల కీ యనిలోఁ జావఁబోవు రసపుత్రవీర శతంబులయొక్కయు, వారికై యహోరాత్రం బులు వగచు సుకుమార రసపుత్ర వీరాంగనలయొక్కయుఁ బసికూనలయొక్కయు నుసురులన్నియు నీ బొట్టఁ బోసికొనిన వాఁడవగుదువుగదరా? చిరకాలమునుండియు దేశంబులఁ బ్రఖ్యాతిఁ జాటుచు రాజచూడామణుల బరిభవించుచుఁ బాదాక్రాంతులఁజేయు మా రసపుత్రవంశ మహాపాదపముఁ బెకలింప నెంచితిరా? సకలభూపతులఁ బరిభవించి యుప్పొంగు మా యశఃపురంధ్రినోసట మసిఁబూయఁ దలఁచితిరా? జ్ఞాన సర్వస్వముం దెలిసి దేవతాకారులౌ మహామహుల తపో నైశ్చల్యముచే సదా పవిత్రీభూతమౌ నీ పుణ్యదేశంబును మీ క్రూరాలోచనచేఁ బాడుచేయుదురా? సకలజననుతి పాత్ర యగు భారతమాతను మీ చేతులార భస్మముచేయ సాహ సించినారా? ఏ నాఁడు సర్వారాతి భయంకరుఁడును, సకల విద్యాపారంగతుఁడు నగు శ్రీకృష్ణదేవరాయని ఖడ్గకాంతులు సంగరస్థలి సంచరించెనో, యేనాఁడు ధనుర్విద్యా విశారదు, పృథ్వీరాజ రణభేరీ దిగంతముల మ్రోసెనో, యేనాఁడు పరాక్రమోపేతుఁడగు ప్రతాపసింహ శౌర్యాగ్ని శత్రురాజ ప్రాణంబుల ననిలో నిర్మూలముఁ జేసెనో, యానాఁడే యంత రించి క్రమంబున ద్వేషముంజంపి మైత్రిని మొలగఁజూచు తురుష్కుల మనోక్షేత్రంబుల మరల కలహ బీజంబిడుచుంటిరా? ఇట్టి హైన్యమునకు మీ మనసెటులొగ్గెనురా? అయిననేమి? 'ధర్మమే జయ' మను నార్యోక్తి వేనోళ్ళఁ బ్రకటించుచుండ, నధర్మవర్తనులగు మీ రిసుమంతయైనఁ జిత్తూరునగరమునకు గీడుఁ జేఁగలరా?

---

ఇరువదియొకటవ ప్రకరణము

# ఉదయసింహుని కచేరి

ఒకనాఁడు రాత్రి యొంటిగంట సమయమున జిత్తూరు నగరవాసులు హాయిగ నిదురించు నప్పుడు నగరపు బజారులో నిద్దఱుపురుషు లొక యంగడియొద్దఁ గూర్చుండి మాటలాడు చుండిరి. వారు బజారునందలి ప్రతియింటిని జూచుచు నెవ్వరైన వారిని జూచెదరన్న భీతిచేఁబోవుచుండిరి. వీరా రాత్రియంతయు నుదయసింహుని కచేరిని సైన్యములుండు స్థలముల నన్నింటిని గడు జాగ్రత్తగఁ బరిశోధించుచుండిరి. వారిలోఁ బెద్దయగు నతఁ డమితధైర్యముతో రెండవవానిని వెంటబెట్టుకొని ప్రతి రహస్యప్రదేశమును జూపుచుండెను. ఇతఁడే ఖేతసింగు. రెండవవాఁ డభయసింగు. వీరిద్దఱు మారువేషములతో రాత్రివేళఁ జిత్తూరునగరముఁ బ్రవేశించి యందలి వారి ప్రయత్నములఁ బాదుషాతోఁ జెప్ప నుద్దేశముతో వచ్చిరి. వీరలా రాత్రి చిత్తూరునఁ దిరుగుట నుదయసింహరాణా తన భటులచే తెలిసికొని తనసౌధగవాక్షముదీసి చూచుచుండెను. అప్పుడా ద్రోహులు శ్రీదేవిగారి సౌధమువంక బోవుచుండిరి. అప్పుడా వీధి చివరనుండి మఱియొకపురుషుఁడు వచ్చుచుండెను. వీరాతని నేదియో సంజ్ఞఁజేసి వీరాబాయి మేడయొద్దకేగిరి. వారలా సౌధము నధిష్ఠింపఁదలఁచిరి. కాని యయ్యది దుర్ఘటమయ్యెను. అంత నుదయసింహుఁ డిద్దఱుభటులను వారిమార్గమునఁబంపెను. ఆ నూతనపురుషులఁ బట్టుకొనఁబోవుటఁజూచి కాఁబోలు నా మూఁడవ మనుష్యుఁడెడ తెగకుండ నీలలవేయుచుండెను. ఇతఁడే కుంభరాణా. ఆ రాత్రి కటిక చీఁకటి

యగుటంజేసి యా మోసగాండ్రుజిక్కలేదు. ఈ కలకలమున కప్పుడే జనులు మేల్కాంచిరి. ఆ వృత్తాంతమునెల్ల విని వీరాబాయి యమితాశ్చర్యమునొంది, యా మోసగాండ్రు తప్పక ప్రతికక్షులోనివారని తలంచెను. అప్పటికే చిత్తూరు నగరమునందంతయు జనులు మేల్కాంచిరి. ఒక్కొక్కరికీ వృత్తాంతము తేటబడఁగా వారు లజ్జాసంభ్రమంబుల నెలిఁబుచ్చుచు గుంపులు గుంపులుగాఁ గూడి నగరమం దంతయుఁ గలవరముఁ బుట్టించుచుండిరి. అప్పటికి బాగుగఁ దెల్లవారెను. రసపుత్రులెల్ల రా మోసముఁజూచి తెల తెలఁ బోవుచుండ నిశాకరుఁడుకూడవారల నపహసించుచున్నాఁడోయన వెలవెలఁ బోవుచుండెను. ఇకనైన మీ సుషుప్త్యవస్థఁజాలించి మేల్కొనుఁడోయనఁ గుక్కుటంబులరచె. వారి హృదయతాపము నడఁప వచ్చినగతి మలయానిలము వీవదొడఁగె. చిత్తూరునగర మిటులగుటఁజూచి తద్ద్రోహ వధార్థ మీశ్వరుఁడు తన ఫాలనేత్రముఁ దెఱచెనో యనునటుల నరుణగభస్తిబింబము తూర్పుదిక్కున బయలువెడలెను. అప్పటికిఁ జిత్తూరు నగరమున నాబాలగోపాలమున కీ వృత్తాంతము తెల్లమాయెను. ఆ దిన మొకసభ జేసి వారలంద ఱుదయసింహుని సభాధ్యక్షునిగ నెన్నుకొనిరి. సభాధ్యక్షుఁడా రాత్రి గనులార గాంచినదంతయుఁజెప్ప మిహిర కుమారుఁడు లేచి 'సభాస్తారులారా ! మనమింతకాలము మన రాజ్యమునకు దగిన యేర్పాటులఁజేయకయే యూరకఁ గనులు మూసికొని తిరుగుచున్నారము. కడచిన రాత్రి మన నగరముఁ జొచ్చినది శత్రువర్గములోనివారుకాని యితరులు కారు. మన కాగర్భశత్రువులగు వారు మన గుట్టంతయుఁగనుఁగొని యుద్ధ సన్నాహ మొనర్ప మనమిటు లూరకుండుట నాకుఁ జాల

సిగ్గగుచున్నది. కావున నిప్పుడైన మేల్కాంచి మన రాజ్యమును జక్కఁజేయవలయు. స్థలాంతరములఁ గలబలంబులఁ బ్రోవుఁజేసి యెట్టి యత్యాత్సంభవమున కైన సిద్ధులమై యుండఁదగునని చెప్పు సమయమున నొకభటుఁ డతివేగమునఁ బరువెత్తివచ్చి వారితో 'అయ్యా! అక్బరుపాదుషా యుమరల్ శాహాతోఁ గూడి రేణు దుర్గమునకుఁ బదిలక్షల సైన్యముతో వచ్చి చేరెనని చెప్పెను. తక్షణమె యా సభయం దతిరభస మొదవెను. ప్రతి రసపుత్ర వీరుఁడు దన కరవాలంబుఁ గరంబున ధరించి శీకరాకారుఁడై నాసభాభవనమందు కేకలిడసాగెను. పరస్పరసంఘర్షణంబున మేఘములు ఉఱుముచందంబున నా రసపుత్ర భయంకర నాదములు మిన్ను ముట్టుచుండెను. వెంటనే యా స్థితి నారసి యుదయసింహరాణా సభ ముగించెను. తరువాత నారసపుత్రులంద ఱత్యాగ్రహమున వీథుల వెంబడిఁదిరుగుచు ఖడ్గంబుల గిరగిరఁ ద్రిప్పుచు నా శత్రుసముద్రమునం దెప్పుడు దుముకుదుమా యను నుద్రేకముతో నిండ్లకేగిరి. ఆ రోజునఁ జిత్తూరు నగరమంతయు రజపూత వీరపరిభవాగ్నిచే దహింపఁబడు చుండెను. సభ ముగింపఁబడు సమయమునకు సాయంసమయ మాయెను. రసపుత్ర క్రోధాతిశయమునకు భయపడి పరుగిడెనో యనఁ బ్రభాకరుఁడు పశ్చిమాంబుధిఁ దటాలునఁబడెను. తద్వీరనేత్రాగ్నికణజాలములో యన సంధ్యారుణిమ లమరె. శౌర్యప్రధానులగు రసపుత్రులెల్ల నిట్లాగ్రహింపుచో నేమగునో యన భయసూచకమగు తిమిరం బెల్లెడల నిముడుకొనియె.

ఇరువదిరెండవ ప్రకరణము

# పరాభవము

రేణుదుర్గముపైఁ దురుష్కసైన్యము లతిరభసంబున భయంకరనాదము లొనర్చుచుండెను. ఆమైదానములోఁ జోటు చాలక నా సైన్యమంతయుఁ బరిసర ప్రదేశములఁగూడ నాక్రమించుకొనుచుండెను. ఇది గాక ఢిల్లీనగరమునుండియు నజమీరు పట్టణమునుండియు గ్రొత్తసైన్యములువచ్చి కలియుచుండెను. దీనిం గని పాదుషా యమితానందభరితుం డగుచుండెను. ఖేతసింహాదులు మైమఱచి వెఱ్ఱిగీతములఁ బాడుచు సంగరరంగ మెప్పుడుఁ జేరి రసపుత్రులఁ ద్రుంపనగునా యని రోషావేశము నందుచుండిరి. పాదుషా శాహాసైన్యములు గాక నలీపూరు సంస్థానాధీశుఁడు కూడవచ్చి చేరెను. ఇదిగాక చిన్ని చిన్ని సంస్థానాధీశులుకొందరక్బరుపాదుషాయెడఁ గల యాదరణచే కలిసిరి. ఇటుల సైన్యమునంతయుఁ బ్రోగుచేసి పాదుషా 1567 వ సంవత్సరము 25 వ మే తారీఖునఁ జిత్తూరు నగరమునకు దాడివెడలఁ దీర్మానించుకొనెను. మిగిలిన సంస్థానాధీశులందఱుఁ గూడ నా యాలోచనల కొప్పుకొని తత్ప్రయత్నములలో నుండిరి. పాదుషా బయలుదేఱినపుడు గోకులదాసుకూడ వారియొద్దకేగి తనకుఁగూడ యుద్ధముఁజూడ నిచ్చుగలదని చెప్పి పాదుషా వలదని యెంత చెప్పినను వినక నా స్త్రీలతోఁగూడ బయలుదేఱెను.

రేణుదుర్గమునందలి సంగతులవదలి చిత్తూరునగరమునందలి విషయములఁ గనుగొందము. నిమిష నిమిషమున నొసు భటుల వెంబడి భటులు రాణా యొద్దకు వచ్చుచు

పాదుషాసైన్యములు చిత్తూరు నగరమును సమీపించు చున్నవని చెప్పుచుండిరి. కాని ఉదయసింహుఁడా మాటల నిసుమంతయైనఁ జెవి నిడకుండెను. ఉదయసింహునివంటి పిఱికి రసపుత్రుఁడు మఱియొక డుండఁడు. అక్బరుపాదుషా దండెత్తి వచ్చినవార్తవినినతోడనే రాణావారికి భయమువలన దేహము కంపమొందసాగెను. పాప మాతఁ డేమిచేయఁగలఁడు? రాజ్యవ్యవస్థలఁ జక్కఁబెట్టుకొనఁజాలకయే నా భాగ్యశాలి ఉండన యస్థాంగిపైనుంచి యెటులనో కాలముఁగడుపు చుండఁ డజేయులగుతురుష్కసేనలతోడఁ బోరాడ సాహసించునా? ఈ స్థితిఁజూచి రసపుత్రులంద ఱాతనికడకేగి బ్రతిమాలసాగిరి. కాని యాతఁడు తనమతము వీడఁడాయె. అంతపై నానాని శూరులగు సరదారులందఱు లక్ష్మణసింగు రాణాసింగు మొదలుగాగల యాతనిపూర్వుల ప్రతాపముఁ దెలిపి యుద్ధమునకుఁ బురికొల్పనారిరి. అంతవఱకును వారు సామదానోపాయంబుల వాని నొడఁబరుపఁదలఁచిరి. కాని, పైత్యరోగులకుఁ బంచదార రుచింపనిరీతిని నా తియ్యనిమాట లుదయసింహుని చెవులకు విషతుల్యంబులయ్యెను. దివాంధమున కంధకారము హాయిగా నుండును కాని వెలుఁగు పనికివచ్చునా! సామదానోపా యంబు లిట్లు నిష్ఫలంబులుగాఁగ నారసపుత్రులందఱు రాణాను దండోపాయంబుల వశఁబఱచుకొన యత్నించిరి. రాణా సంగ్రామమునకు వెడలకుండుటఁగని యాతని సరదారులు మిగుల నాగ్రహపడి "మీరు శత్రువుల నెదిరించి యుద్ధముఁ జేయ కుండినచో మిమ్ముల రాజ్యభ్రష్టులఁ జేయుదుమనిరి. అంతట నుదయసింహుఁ డించుక స్వాధీనుఁడయ్యెను. అందఱేకగ్రీవ ముగఁ జెప్పినందున విధిలేక నా యధీరశిరోమణి యెట్టులనో

యీ సమయమున కంగీకరించెను. కాని మఱియొకసారి యడి
గినచో వెనుకంజ వేయుచుండెడివాఁడు. అపుడు మిహిర
కుమారుఁ డుదయసింహు నేకాంతస్థలమునకుఁ గొంపోయి
వాని కనేకవిధముల బోధించెను. అప్పటికిని యుదయసింహుఁ
డియ్యకొనఁడాయె. తరువాత మంత్రి "మీరు యుద్ధమున కేఁగ
నిచోఁ దురుష్కులు తప్పక మన చిత్తూరునగరమును ముట్టడి
వేయుదురు. అట్టియెడ రసపుత్రవీరులమై యుండి వారికి సుమం
తైన నడ్డగొనర్పక మనమూరకుంట తగునా? యుద్ధముఁ జేసి మృతి
నొందినను మనకుఁ గీర్తి కలుగును కాని, పరరాజు దండెత్తి
వచ్చుచో వాని కేవిధమగు నాటంకమును జూపక మనమింటఁ
గూర్చుండుట నగుబాటు కాదా! మీకు నగుబాటయిన మన
రసపుత్రకులమునకంతకు నప్రతిష్ఠ కాదా! నా మాట వినుఁడు.
ధైర్యముఁ గొనుఁడు. రసపుత్రకుల ప్రతిష్ఠఁ గాపాడు" డని యతి
సాహసంబుగ నుడివి రాణాను సమరోత్సాహునిఁగాఁ జేసెను.
అపు డుదయసింహుఁ డించుక జ్ఞానముఁ దెచ్చుకొని యెటులనో
మంత్రి హితవచనములను సమ్మతించెను. తరువాతఁ దన సైన్యము
నంతయుఁ బ్రోగు జేసికొని మంత్రిమాట జవదాటఁజాలక
లోనఁ గుందుచు సమరావని కేగె. సాగరమువలె నలుగడల
నిండియున్న యవనసైన్యములఁ గని భీతిచేఁ గొంతవడి నేమియుఁ
దోచక నిలుచుండెను. సైన్యమంతయు రాణావారియాజ్ఞ
కత్యాతురతతో నిరీక్షించుచుండె. అపు డెటులనో యీ
రాజు సైన్యమునకు యుద్ధముసేయ నాజ్ఞయిచ్చెను. వెంటనే
రజపూత సైనికు లందఱు మిగుల శౌర్యముతోఁ బెనగఁజొచ్చిరి.
ఉభయకక్షులవారికిని భీకరసంగ్రామము జరిగెను. ఒక గంట
సేపువఱకు నే పక్షమువారును వెనుదీయక నతిధైర్య ముట్టి

పడఁ బోరాడిరి. రెండువైపులను విశేషముగ సైన్యము మడియు చుండెను. ఏ వంకఁజూచిన శవంబులకుప్పలే; కన్నుల నదురఁ జేయు రుధిరప్రవాహములే.

అక్బరుపాదుషా సైన్యముఁజూడ రమారమి యెుక లక్ష యుండెను. ఉదయసింహుని సైన్యమంతయుఁ గలిసి షుమారు రఋవదివేలుండెను. పాప మా రసపుత్రవీరులు జయకాంక్ష వలన నెంతఁబోరినను ముఖ్యనాయకుని యధైర్యము వలనను పరబలాధిక్యమువలనను, వారికి జయముకలుగు మార్గము కానరాకుండెను. చిత్తూరునగరముఁకొఱకై శూరులెంతబోరిన నదియంతయు నిష్ప్రయోజనము కాఁదొడగె. వారెంత రణ పటిష్ఠులయినను రెండింతలు గొప్పగానున్న సైన్యముపై వారి సామర్థ్యము సాగదయ్యె. అంతకంతకు శత్రుసైన్యమెక్కు డగుటఁజేసి రసపుత్రవీరులంద ఱొకరితరువాత నొకరు నేలఁ గూలుచుండిరి. వీరశిఖామణు లనేకులు వెనుదీయకఁ బోరాడి రణశయ్యపై దీర్ఘనిదురఁజెందిరి. డొంగల్‌ప్రాధీశుఁడగు ఛవణ సింగురావల్ తన రెండువందల సహచరులతో మడిసెను. సాలుంబ్రాధిపుఁడగు రత్నఠాకూరు తనమూఁడువందల సర దారులతోఁగూడి భూదేవతకు దేహమర్పించెను. మార్వాడ రాజపుత్రుఁడగు రాయమల్లురాథోడ్ ఖేతసీ రత్నా యను వారును, ఝాల్‌వాడ్ రాజగు బ్రమార్ దాసు గారును, తమశిరఃకమలముల దేశస్వాతంత్ర్యరక్షణార్థ మర్పించి శాశ్వత కీర్తిఁ బడసిరి. ఈ క్షత్రియ వీరాగ్రేసరుల పవిత్రనామము లెల్లరకుఁ బ్రాతః స్మరణీయములుకదా! ఇటులఁ జాలసేపు పోరినను తుద కుదయసింహునకుఁ బరాభవము కలిగెను. అక్బరుపాదుషా తక్షణమే యా పిఱికిరాజును బట్టి చెఱలో

నుంచెను. అందుపైఁజేయునదిలేక రజపూతవీరులు గ్రామమునకు దిరిగిపోయిరి. వారిలోఁ గొందఱు తమయిండ్లకరుగ వారి స్త్రీలు పరాభవము నొందివచ్చిన భర్తలను, పుత్రులను, సోదరులను లోనికిరానీయకఁ దలుపులుమూసి వారిని దిరస్కరించుచు నిట్లనిరి. “ఓ రజపూతకుల కలంకులారా! పవిత్ర రసపుత్రకులమున మీరేల జన్మించితిరి? సిగ్గులేక మీ మొగములు మాకు జూపకుఁడు! యుద్ధములోఁ బరరాజునకోడి పాఱిపోయివచ్చుటకు మీరే కావలయునా? ఈ మాత్ర మాడువారు చేయలేరా? సర్వలోకమాత యగు హిందూ మాతలకు మీరలు శత్రువుగాని పుత్రులా? పొండు, పొండు. పరమపవిత్రమగు భారతమాతకు నిజమైన బుత్రరత్నము లనిపించుకొండు. రణరంగమందు మీయశంబుఁజాటి సంపూర్ణ విజయమునొంది మంగళవాద్యములతోఁ దిరిగిరండు! యుద్ధము నందు పరాజయమొంది కాయమెల్లెడల గాయములఁ జెంది యున్న యా రసపుత్రుల కీ పరుషవాక్కంటకములు మఱింత బాధింపఁ గొంద ఱాత్మహత్యనొనర్చుకొనిరి. కొంద ఱేదేశమునకో పోయిరి.



ఇరువదిమూఁడవ ప్రకరణము

# బైరాగి కనఁబడలేదు

ఉదయసింహుని దుష్టులు చెఱబెట్టిరని తెలియగా, చిత్తూరు నగరమందంతయు జనులందఱు ఏమియు చేయునది లేక కడు భీతిలుచుండిరి. రాజభవన మంతయు దుఃఖమయమై యుండెను. చిత్తూరు నగర రాజ్యభాస్కరుఁడు అస్తమించెను. ఆపీటి నారీమణుల ముఖపద్మములన్నియు ముకుళితములయ్యెను. వారల నావరింపవచ్చిన పెనుభూతమో యనఁ గాఢాంధకార మెల్లెడల దట్టముగా వ్యాపించెను. రణపటిష్ఠులగు రజపూతవీరులు సహితము వారికి జరిగిన పరాజయమున కచ్చెరువందుచు దుఃఖ వారాశి మునింగిరి. చిత్తూరునగర మంతయు దీనభావము వహించెను. వీథులన్నియు సంపూర్ణశాంతి నొందెనా యను నట్లుండెను. అహరహంబును లక్షలకొలఁది ద్రవ్యమును వెచ్చించు ధనాగారములన్నియు మూయబడియుండెను. దేవ నిలయములలోని మంగళగీతారవంబు లన్నియు మట్టునడఁ. నగరములోని ప్రతిశూరుఁడును ముగ్గుడై యేడ్చుచుండెను.

చిత్తూరునగరములోని రసపుత్రు లిటులుండఁ జయము వహించిన తురుష్కసైనికులఁ జూచి తీరవలయును. ఏ గుడారమున జూచిన కేళీవిలాసంబులే. ఒకచో శ్వేతసింహాదులు కడు సంభ్రమమున గన్ను మిన్నెఱుఁగక నేలపైబడి పొర్లుచుండిరి. అపుడు పాదుషాయొద్దనుండి యొక భటుఁడు వచ్చి వారింబిలువ వారంగరకాలను ధరించి పాదుషాను సందర్శింప బోయిరి. వారలఁజూచిన వారందఱుఁ గరతాళ ధ్వనులఁ గావించిరి. అపుడు వారల కీ దిగువ ప్రసంగము జరిగెను.

పాదుషా—అయ్యా! మీవలననేకదా మే మీపోజున సంపూర్ణజయముఁ బొందగలిగినది.

ఖేత—భాయిజీ! తమరటుల దలఁపవలదు. తమకటాక్షమువలననే మేముజయమునొందజాలితిమి; కాని వేఱుకాదు.

అభ—అయ్యా! తమ రిటులనుట మమ్ముల శ్లాఘించుట గాని మఱొండుకాదు.

కుంభ—భాయీ! మీరీ సంగరస్థలి నొక యరనిముసమైన నుండనిచో మేము కాలుఁగదల్చి, ముందడుగు వేయఁ జాలుదుమా?

శాహో—భాయీ! మీవలననేకదా మేమును పాదుషా మాట విని యుద్ధములోఁ బ్రవేశించి సంపూర్ణయశస్సు గాంచగల్గినది. లేనిచో మే మీ రసపుత్రశూరుల నోడింపఁ గలుగుదుమా? రసపుత్రులు సామాన్యులా?

వీరిట్లన్యోన్య సంభాషణ మొనర్చుచుండఁ గొందఱు భటులు వేగమె యచ్చోటికి వచ్చి పాదుషాను సలా మొనర్చి అయ్యా! మనతోడ వచ్చిన బైరాగి కానుపించుటలేదు. మేము పోయి వారి గుడారము శోధింపగా దానిలో నిద్దఱు తురుష్కులు చచ్చిపడియున్నారని చెప్పిరి. వెంటనే పాదుషా సభ ముగించి స్వయముగా నాగుడారములోని కేగి పరీక్షింపనచట రెండు తురుష్కశవఖండములు తప్ప మరేమియు గానరాలేదు. అప్పుడతఁడు కడు చింతాక్రాంతుఁడై వారల శత్రుపక్షమువారు చంపిరని తలఁచెను. శాహోయును ఖేతసింహాదులును దాసుని సచ్చారిత్రముఁ జెప్పుకొనుచు గంటఁ దడిబెట్టు

చుండిరి. పాదుషా దుఃఖమాపుకొనలేక "దాసుజీ! మీ వంటి పండితోత్తము లింక మాకు లభింపగలరా! మీరు చెప్పినరీతినే మీ యుద్ధమున జయముఁ గాంచితిమిగదా! మీరా ప్రశ్న జెప్పినందులకు మీ కొక ఖడ్గముఁగూడ బహూకరించితి గదా! అయ్యో! యుద్ధసమయముల మీగుడారముచెంత గొంతసైన్యమునైన నుంచకఁ బోయితినే!" యని పలుమారు వగచుచు దుఃఖావేశముచే బిచ్చివానివలె నిశ్చేష్టుఁడయ్యెను.

---

ఇరువదినాల్గవ ప్రకరణము

## దుఃఖ శమనము

సంగ్రామేసుభటేన్ద్రాణాం । కవీనాం కవిమండలే
దీప్తిర్వా దీప్తిహానిర్వా । ముహూర్తే నైవజాయతే॥

రసపుత్రులకును, దురుష్కులకును జరిగిన భయంకర సంగ్రామఫలితము చిత్తూరునగరవాసు లందఱికిఁ దెలియగనే చాలమంది జనులు భయకంపితులై, యూ యూరు వెడలిపోవ నారంభించిరి. కొందఱు వృద్ధులు ప్రాణత్యాగ మొనర్చుకొనిరి. మఱికొందఱు తమ గృహద్వారములుఁ గట్టిగ బిగించి యగ్ని ముట్టించి లోపల కుటుంబసహితముగాఁ బ్రాణములవీడిరి. మఱికొంద ఱాత్మేచ్ఛాధము లేమిచేయుదురన్న ధైర్యముతో బజారుల వెంట దిరుగుచునే యుండిరి. రసపుత్రకులోద్భవుఁ డగు పసిపాపనికైనఁ దురుష్కునిపొడయన్న నమితకోపము గదా! అట్టివార లాపరాభవమున కమిత లజ్జనొందుచు మఱల నాతురుష్కసైన్యము నెదుర్చు సమయము రాకుండునా యని

తలపోయుచుండిరి. నిజముగాఁ బాప మా రసపుత్రులు, తురుష్కులతో నోడుదురని యెంచలేదు. వారు యుద్ధభూమి కేగినపు డతి ధైర్యముతోఁ బోయిరి. కాని పరసైన్యము వారలకు రెండింత లుండ వారేమిచేయగలరు? అప్పటికిని వారి శక్తినంతయు ధారవోసిరి. దైవనిర్మాణ మటులుండ నీ రసపుత్రయువకు లేమిచేయగలరు? రజపూతవీరులిటులుండ రజపూతాంగనల వృత్తాంత మత్యాశ్చర్యముగ నుండెను. తురుష్కులకు జయము కలిగెననియు, రసపుత్రులకుఁ బరాజయమొదవెననియుఁ దెలిసినంతనె ప్రతి రజపూతాంగనయు, గడు రోషానలముచే మండి పడుచుండెను. తురుష్కు లిక జిత్తూరునగరముఁ బ్రవేశింతురనియుఁ, బ్రవేశించి యూరిని బాడుఁజేసి తమకు మానభంగ మొనర్తురనియు వారు దృఢ నిశ్చయము జేసికొనిరి. అట్టి తురుష్కుల కంటఁ బడుటకంటె నాత్మహత్యయే మేలని తీర్మానించిరి. ఆహా! చూచితిరా! ఆత్మహత్యయన నీ వీరాంగనల కెంత సౌలభ్యముగ నున్నదో! మనఃపూర్వకముగఁ జేతులార నిండు ప్రాణంబుఁ దీయుటే ఘోరము. అట్టియెడఁ దమ ప్రాణంబులఁ దమరే దీసికొనుట ఘోరతరము. ఇట్టిఘోరకృత్య మీరజపూతాంగనల కెంత సులభముగానున్నది! నిజదేశ రక్షణార్థమై తమభర్తలొకయెడ వారి శిరంబుల సంగ్రామదేవతకు బలిసిచ్చుచుండ మఱి యొకచో, నీ వీరాంగనలు కూడ వారి మానసంరక్షణార్థమై దేహత్యాగమునైనఁ జేయ నుంకించుచున్నారే? ఏమి సాహసము! స్త్రీలకుఁ దమ మానధనంబుమించు ధనంబొండుఁ గలదా! తమ దేశము పరహస్తగతంబగుటఁ గనులారఁ జూడ లేకకదా నీ వీరాంగన లిట్టి యుద్రేకమునకుం గడంగుట. ఆత్మ

హత్య కడుంగడు గర్హ్యమయ్యెఁ బ్రాణవిత్త మానభంగ సమయములందు వివేకులే యవివేకులరీతిఁ జరింతురుగాన నీయబలారత్నములిట్టి సాహసంబునకుం గడంగుట నింద్యము కాదని తోఁచెడిని.

ఆ వీరాంగన లిటులఁ దీర్మానించుకొని, యొక గుహా ద్వారమున జితిఁబేర్చి పీతాంబరధారిణులై వీరగీతములఁ బాడుచు నొకరి వెనుక నొక రా యగ్నిగుండములో దుముకు చుండిరి. వీరిట్లాత్మహత్యఁ గావించుకొనుట రసపుత్రవీరుల కందఱకుఁ దెలియ వారు గుమిగూడివచ్చి యా నారీమణుల నాత్మహత్య జేసికొనవలదని వారించి తాముపోయి యుద్ధముఁ జేసి యా తురుష్కుల నవలకుఁ దోలి వారికి సంతోషముఁ గూర్తుమని చెప్పిరి. ఆ ప్రియాలాపముల నా పతివ్రతాతిలకము లాలించి వారు చేయు సాహసకార్యములను మానిరి. వెంటనే యా రసపుత్రులందఱు స్త్రీరత్నముల నింటికి గొంపోయిరి. తరువాత వారందఱు నుదయసింహుని చెఱ విడిపించుటెట్లు? శత్రువులను బాఱదోలుటెట్లని విచారించి యొకసభఁ గావించిరి. కాని రణపటిష్ఠులగు వారందఱు సంగ్రామములో మడియుటచే జింతింపసాగిరి. తత్సమయమునఁ జిత్తూరు నగరమంతయు మిగుల నుదాసీనముగా నుండెను. కాని సర్వేశ్వరుఁ కృపచే నా స్థితి యంతటితో సమాప్తి నొందెను. ఏలయన, మరల క్షణకాలములో నొక యువతి వారి నానందసాగరమునం దోలలాడించెను. ఈ పుణ్యస్త్రీ వీరాబాయియే. తన భర్తను మ్లేచ్ఛులు ఖైదుఁజేసిరనియు, చిత్తూరిక పరాధీన మగుననియుఁ రజపూతవంశ మంతటితో నస్తమింపవలసియుండు ననెడువిచారము లామె మనమున నుద్భవింపసాగెను. సకలైశ్వర్యములఁ

ములదూగు చిత్తూరునగర మీనాటికిఁ బరులహస్తంబులఁ బడ
వలసెనన్న విషయ మామెకుఁదోప నామెనేత్రములుఁ బాష్ప
పూరితములయ్యెను. అనివార్య దుఃఖవారాశితరంగము లామె
గర్భంబుఁ బెకల్చుచుండెను. కాని యా తరంగముల కన్నిఁటికి
నామె నిశ్చలహృదయ మడ్డు గావించుచుండెను. రాజభవన
మునందు నిరుపయోగములై పడియున్న శస్త్రము లామె కంటఁ
బడ నామెయం దడగిన శౌర్యాగ్ని ప్రజ్వలింపసాగెను. అంత
నామె నిలువక యుద్ధమున కనుకూలమగు వేషముఁదాల్చి
శస్త్రాస్త్రముల ధరించి రసపుత్రుల సభలోనికిఁ బ్రవేశించి
మిగుల రోషముతో నచటఁ గూడియున్న రాజపుత్రులతో
నిట్లనియెను.

“శూరాగ్రేసరులగు రజపూతులారా! మీరిట్లధో
ముఖులై చింతిల్లుచు నెవరికై నిరీక్షించుచున్నారు! మీతో
నుద్భవించిన శౌర్యధైర్యాదిగుణము లెటుఁబోయెను? చిత్తూరు
సంస్థాన మిప్పుడే పౌరుషహీనమయ్యెనా! చిత్తూరు నందలి
రజపూతవీరులందఱుఁ గేవలము శ్వాసోచ్ఛ్వాసములుగల పురు
గులైపోయిరా? భారతవర్షము నేడే నిస్తేజమైపోయెనా? మీరు
శూరులవంశమునం దేల జనియించితిరి? అట్లుజన్మించిపగఱకు
వెన్నిచ్చి యేలఁ బాఱివచ్చితిరి? ఇపుడు మీరంద ఱేకీభవించి
యేమి చింతించెదరు? చిత్తోడ్ నగరము నలంకరించువాఁడును
మన ప్రాణసమానుఁడు నగు వానిని శత్రువుల కారాగృహ
బద్ధునిఁజేయ నాఁడువారివలెఁ జేతులకు గాజులఁ దొడుగుకొని
యింటనుండుట కేల సిగ్గిలకున్నారు? నేనిట్లు బాహాటముగా
మిమ్మవమానపరచుచుండ మీరు విని యెట్లు సహించెదరు?
ఇంతకంటె యుద్ధముజేసి చచ్చుట సర్వోత్తమముకాదా?

శౌర్యోపేతులగు సరదారులారా! మీరిట్లు పేక్షఁజేసెద రేల? మీకుంగలిగిన కళంకమును సంపూర్ణముగాఁ గడుగుడు. మీ శౌర్యధైర్యాది గుణములఁ గనుపఱుప నిదియే సమయము; లెండు; రజపూత వంశమునకుఁ గీర్తిఁదెండు. ఉచితాస్త్రధారులై యాజిలోఁజేర రండు. ఒకరిరాకకు నిరీక్షింప నేల? చితోడ్ సంరక్షణార్థమై మనవంశము నిర్వంశమైన నేమిచింత? ఆర్యపుత్రులారా! సద్వీరులారా! మీబొందిలోఁ బ్రాణముండునంత వఱకు స్వదేశమును పరరాజులచేతఁ బడనీయని మీజన్మమే జన్మము. మీరు క్షాత్రధర్మమును పరిపాలించుటకై మీప్రాణములనిచ్చినను చాలునా? ఒరలనుండి ఖడ్గములఁ దీయుడు. 'జయహర జయ మహాదేవ' యను రణఘోష మొనర్చి శీఘ్రగతి నరిగి సంగరరంగమందు మీమీ ప్రతాపములఁ గనబఱుపుడు; నేనిదే వచ్చుచున్నాను" అని వీరాబాయి సభాభవనమెల్ల దద్దరిలు నటుల నుడివి, పిఱికితనము నిశ్శేషముగాఁ జంపి, శౌర్యము నూది, డస్సినదై కొంచెమునే పూరకుండెను.

---

ఇరువది మైదవ ప్రకరణము

## చోరులు

వీరాబాయి సమరోత్సాహముతో రణరంగస్థలికేగి యెపుడు శత్రుసముద్రములో దుముకనగునా యని యావేశము నొందుచుండెను. ఆపెపలుకులన్నియు నా రసపుత్రవీరుల హృదయములలోఁ బ్రతిధ్వనిసేయుచు వారి హృదయాంతరంగంబులం దున్న శౌర్యాగ్ని రగుల్కొలిపెను. ఆసమయమునఁ బ్రతివృద్ధ రసపుత్రుఁడు నామె వచనంబులచే నూతనశౌర్యము నొంది

యుద్ధమునకేగఁ గుతూహలుఁ డగుచుండెను. వీరాబాయి రస
పుత్రసైన్యమంతయుఁ బ్రోగుఁజేసి యుద్ధసన్నాహముల జరుప
నాజ్ఞ నొసంగెను. వెంటనే వేలకొలఁది రసపుత్రసైన్యము
చిత్తూరునగరపు నాల్గువెపుల నుండియుఁ బుడ మీనినటులఁ
బెగలసాగెను. అదివఱకగ్నిలో దేహత్యాగ మొనరింపనెంచిన
రజపుత్రాంగన లందఱుఁ దమ భర్తలు మరలఁ దురుష్కుల
మీఁదికి దాడివెడలుటఁ జూచి కడుసంతసమొంది వారికిఁ దగు
రీతి నలంకారములఁ జేయుచు, మంగళహారతుల నిచ్చుచు,
నాయుధంబు లందిచ్చుచు 'జయ' 'జయ' యను ధ్వనులతో
వారిని సంగరంబున కనుపుచుండిరి. తురుష్కులు జయమొంది
రన్న విని, ముకుళితాననమై, కళారహితమై, ఎచటనో దాగి
యున్న చిత్తూరునగరలక్ష్మి, తురుష్కుల నోడింప మరల
రసపుత్రవీరులు వేలకొలఁది యుద్ధసన్నద్ధులగుచున్నారని విని న
తోడనే వికసితాంభోరుహవదనమై, సర్వాలంకారశోభితమై,
నగరమంతటఁ దాండవ మాడుచుండెను. బలములఁ గూర్చు
నప్పటికి సాయంసమయమాయెను. వీరాబాయి మంత్రిని
బిలిపించి యిటులఁ బలికెను. "అయ్యా! పోయివచ్చెదను. నేను
సంగ్రామమున కేఁగుచున్న దాననని నాప్రాణములకై దిగు
లొందవలదు. ఎట్టి సౌఖ్యములనందిన, నెన్ని వత్సరములు
జీవించిన దేహికి మృత్యువు తప్పదుగదా? అట్టియెడ వగచిన
ప్రయోజనమేమి? పుట్టుట గిట్టుటకొఱకుగదా? కావున మీరు
రాజ్యభారమూని చింతను విడనాడి రాజ్యముఁ జేయుచుండ
వలయును. ఆ పరమేశ్వరుఁ గృపగలిగినచో నాకుమరల మిమ్ముల
కనుఁగొను భాగ్య మబ్బకపోదు. లేనిచో సకలానంద సంభరిత
మగు వీరస్వర్గ మబ్బఁగలదు. ఇట్లు చెప్పుచుండ మిహిర

కుమారుఁడు "అమ్మా! ఎట్టి విపరీతవచనంబు లాడితిరి. నిన్నుఁబెద్దవానిగఁ జేసిన జనకుఁడు దేశాంతర గతుఁడై యుండఁ, జిత్తూరునగరనాథుఁడు కారాగారమందుండ, సంతఃపుర వాసినులగు మీరు రణంబున కేఁగ సిద్ధపడ రసపుత్రుఁడనై యమాత్యస్థాన మలంకరించిన నే నూరకుండుటకన్న హేయుఁడు గలఁడా ? అబలలగు మీరు సమరమున కేఁగుటయు, నేనింట నుండుటయునా ? జనకవియోగదుఃఖముచే కృశించిన నీప్రాణంబుల శత్రుప్రాణావ హరణంబున వినియోగించుటకంటె నెక్కుడగు కార్యమెద్ది ?" యనెను.

కాని, వీరాబాయి వానిమాటల యథార్థము నెఱుంగియు, మంత్రి రాజ్యభారము వహించి, రాజుండినను, లేకున్నఁ బట్టణముఁ గాపాడుచుండవలెనుగాని, తదన్యముఁగాదని మిహింగ కుమారు నొడంబరచి యచట నొక నిముసమైన నిలువక నెనుతన సౌధమున కేఁగెను. అచట రసపుత్రాంగనలెల్లఁ గూడి 'అమ్మా ! మేముఁగూడ మీవెంటవచ్చి యాహ్లేచ్ఛాధముల మా పాతివ్రత్యముచే నిమేషమాత్రమున యమపురి కంపఁగలము. కావున మమ్ములమీవెంటఁ గొనిపొండని' యామెను బలుమారు నిర్బంధపెట్టసాగిరి. కాని వీరాబాయి వారినందఱిని వారించి వారలఁజంప నేనొక్కర్తునుఁజాలనా ? యని మందలించుచుండెను. అపుడానారీమణు లందఱు నామెకంఠమున ముత్యాలహారములను, పుష్పహారములను తమ కరవుఁదీరఁ జుట్టి మంగళహారతులు నొసఁగిరి. అంత వీరాబాయి వారిం జూచి 'సోదరీమణులారా ! మీ రెల్లపుడు మా జయమునే గోరుచుండి యింట నుండుడు. మాకుఁ బరాజయము సంభవించినచో నాత్మహత్య నొనర్చుకొనుఁడు. పరులగాలి మీ

దేహంబుల సోకకుండఁ జేయుఁడు. పౌరుష ప్రధానమగు నీపుణ్య దేశమును మీ శుద్ధచారిత్రముచేఁ బవిత్రవంతముఁ జేయుఁ'డని వెడలిపోయెను. అప్పటికి రాత్రి యెనిమిదిగంట లాయెను. ఆమె యతి తీవ్రగతిని చిత్తూరునగరము వెలుపలి గుడారము లకై పోయెను. అజాండమంతయుఁ గాఱుచీఁకటులు క్రమ్ము కొనియుండెను. సరదార్లందఱు తిరిగి తిరిగి వేసారి తుద కా గుడారముల నాకసమునుండి యెడతెగకఁజూచు తారకా సముదయంబుల కప్పగించి నిదురించుచుండిరి. అట్టి సమయ ములోఁ గొందఱాయుధపాణులై నిశాసమయమున నెవరి కంటఁ బడకుండ నిరాటంకముగవచ్చి గుడారములన్నిఁటిలో మేఁటిగాఁ గనుపించు గుడారముకడ కేఁగిరి.

ఈ సమయమున, నా గుడారములచెంత నొకపురుషుఁ డాయుధపాణియై దారిఁగానక తిరుగుచుండెను. అతఁడు వీరిని జాలదూరమునఁ జూచి కడు వేగమునఁ బరుగెత్తి వెంబ డించెను. కాని వారా చీఁకటిలోఁ గానరామిచే నాతఁడా గుడా రములయొద్దకుఁ జేరెను. ఇంతలో నా తురుష్కు లా శిబిరంబుల జొచ్చి, కొందఱఁజంపి, యాయుధసామగ్రి నపహరించి పరు గిడ సాగిరి. అట్టిచో నా గుడారము వెలుపల నప్పటికిని దారిఁ గానకఁ దిరుగాడు నా బైరాగి వారిఁజూచి క్షుద్బాధచేఁ గనలి హఠాత్తుగ మృగసంచయములపై నుఱుకు కంఠీరవంబుగతి వారలపైఁబడి కొందఱజంపి, మిగిలినవారింబట్టి లాగుకొనివచ్చి సరదార్ల కప్పగించెను. ఈ సందడిలో నా బైరాగి యచట నుండ నిచ్ఛలేక యెచటికో పోయెను.

ఇరువది యాఱవ ప్రకరణము

# యువతీ రక్షణము

గోకులదాసు తనశిష్యుఁడగుసుందరునితోడను, కమలా సుఖలాబాయిలతోడను సంగరస్థలికి వచ్చి యుద్ధము ముగిసిన తరువాత గానరాలేదని మనము చదివి యుంటిమి. వాని వృత్తాంత మేమయ్యెనో మీకుఁ దెలియునా? యుద్ధము జరుగు చుండ గోకులదాసు సమయముఁ గనిపెట్టి తాన గుడారము యొద్దఁ గావలిగనున్న వారిం దన కరవాలంబునఁ దునిమి యా స్త్రీలతోఁ జిత్తూరునగర ప్రాంతమునగల వనంబున కేఁగెను. దాసు గుడారముచుట్టును తిరుగుచుండఁ గొందఱు తురుష్కభటులు హీరాబాయి మందిరమువైపు వచ్చుచుండ నాతఁడు తనఖడ్గముఁ గైకొని వారిని వెంబడించి వారు మరలి వచ్చువేళ పైఁబడి పట్టి హీరాబాయికడకుఁ దీసికొనిపోయెను. అంత నా యర్ధరాత్రిసమయమున నెవరికిఁ గనఁబడకుండఁ దన నివాసముఁ జేరెను. దాసు గుడారముఁ జేరుసమయమున సుందరుఁడు వాని నెదుర్కొనెను. అతఁడు జరిగినదంతయుఁ జెప్ప సుందరుఁ డానందము నొందెను.

యుద్ధభూమికిఁ గొంపోబడినప్పటినుండియుఁ గమలా సుఖలాబాయిల స్థితి కడు విచిత్రముగా నుండెను. యుద్ధము సంకులముగా జరుగుచున్న సమయమున నా ఘోరరవంబు లా స్త్రీల కర్ణేంద్రియముల కశనిపాతంబులవలెఁ దోఁచుచుండె. వేణువనప్రాంతమున నున్నను వారికి భీతి వదలలేదు. ఇన్ని రోజులనుండియు దాసునొద్దనున్నను వా రాతనిగాని, సుంద రునిగాని, కన్నెత్తిచూడలేదు; నోట బలుకరించలేదు. వారి

కేదికావలసిన వారడుగకమున్నె సుందరుఁడొసంగుచుం
డెను. ఈ రీతిఁ బరిచర్యలఁ జేయుటఁ జూచి యా స్త్రీ లిరువురు
వారెవరాయని సందేహపడుచుండిరి. దాసు తురుష్కుల
పట్టుకొని వీరాబాయి కప్పగించితినని సుందరునితోఁ జెప్పుట
వీరు వినినప్పటినుండియు వీరియవస్థ వర్ణనాతీతము. అప్పటికి
పాపము ! వారు దాసుని తురుష్కుతఁడని గ్రహించిరి. కాని
యాతఁడు రసపుత్రుఁడై యుండునా యని లోనఁ దర్కించు
చుండిరి. ఎటులయిన నా స్త్రీరత్నములకు వారి యథార్థ
వృత్తాంతము బోధపడినదికాదు. కొంత రసపుత్రునివలె గని
పించుచు, మఱికొంత తురుష్కునివలెఁ బొడగట్టు వారి
నాయబలలెటుల దెలియగలరు? పాపము వారి కేమియుఁ దోచక
శత్రువులవలలోఁ జిక్కినదియు లేక మిత్రులచెంత నున్నదియుఁ
దెలియకుండెను.

గోకులదాసు తురుష్కచోరులను బట్టుకొనిన తరువాత
దన గుడారమున కేఁగి యించుకసేపు విశ్రమించెను. పిదప
మేల్కాంచి చూడఁ దెల్లవాఱుసమయము కావచ్చెను. అప్పుడు
దాసు నిద్రించు సుందరుని పిలిచి "సుందరా ! తెలవాఱు
సమయమైనది. ఈ దినముననే రసపుత్రులకును తురుష్కులకును
ఘోరసంగ్రామము జరుగుచున్నది. నేనుఁగూడఁబోయి యుద్ధముఁ
జేయవలయునుగదా.

ఉ॥ అల్లదె బాలభానుఁ డుదయాద్రిపయిన్ గనుపట్టె, సోముఁడో
మల్లనవాఁడె, చుక్కగమి యంబరమందునడాఁగె, పక్షు
లెల్లెడ గీతికాతతులనింపుగ బాఁడె, తమంబువీఁడె, పై
నెల్లఁగవీచె మారుతము మేలుకొనంగదవయ్య సుందరా !

సుందరా ! లెమ్ము. నా మనం బాతురతఁ జెందు చున్నది; అదిగో !

ఉ॥ అల్లదె వైరికోటిచయ మాహవభూమిని జేరె సంక్షితిల
ల్లల దె వైరికోటికి మహోత్కటి, భీకరదంతి బృంహితం
బెల్లెసలెంగె, భూరిహయ హేషలవే, శ్రవణద్వయంబునన్
జిల్లులు గాగ నాకవనసీమను సంచరులయ్యె సుందరా !

లెమ్ము, లెమ్ము కుమారా ! నే పెట్టి శుభముహూర్తము. అస్మదీయ మనోరథసిద్ధి నేఁడే కాగలదు. సుందరా !

ఉ॥ అల్లదె, రాద్యుమాగతి మహాహవసంభ్రమమయ్యె, గుండెలుల్
ఝల్లన, రాజపుత్రులు చలమ్మునవీడక నాగుణాఢ్య నల్
పెల్లుగ మోహరించుదున్ శిబిరపీఠుల; మిత్రులఁ జేరి పోరఁగా
విల్లుకరమ్మునన్ దొడిగి వేగమె పోవలె, లెమ్ము సుందరా !

ఇఁక కాలవిలంబన మణుమాత్రమేని యనర్థదాయకంబగు. నే నిదే పోవలయు. దైవమా ! ఎన్నినాళ్ళకు నా కోరికదీర్చితివి. సుందరా ! ఆహా ! అదిగో ! అదిగో ! !

ఉ॥ తెల్లనితేజిపై మెఱుపుఁదీఁగవలెన్ గనుపట్టి, యొక్కచే
విల్లునుబూని, వేఱొకట భీకరఖడ్గము నూని, కాంతి రం
జిల్లెడు మోముతోఁ గదనసీమను జేరఁగ బోవునట్టి మా
తల్లియదే కనౌయి, కడుధన్యుఁడవైతి కుమార ! సుందరా !!

ధన్యుఁడను. ధన్యుఁడను. ముమ్మాటికిని ధన్యుఁడను. మన కష్టములు గట్టెక్కినవి. సుందరా ! కలకాలము కష్టము లుండవనుట నిక్కువమే. నా తల్లి, జగదేకవీరయగు వీరాబాయి మ్రోలనున్న మన కేమిభయము ? అవ్వీరశిఖామణి మ్రోల శాత్రవబలంబులు, శలభసమానంబులు. బాలకా ! ఇఁక భయంబుడుగుము.

ఉ॥ ఉల్లమునందు నేమియు భయంబొందకుమా యని సందియంబునన్
తల్లడమందకీ తనువుఁదాల్చినవారికిఁ జావునిక్కమౌ
పల్లవపాణులన్ విరసవర్తనులన్ గని పెట్టి నీయశం
బెల్లెడఁ జాటుమయ్య, యిదియేకదా వ్యాప్తిమోయి సుందరా !

నీ విచటనేయుండి జాగరూకతతో నీ స్త్రీలఁగాపాడుచు నాయుధపాణివై గుడారము వెలుపలఁదిరుగుచు నల్దిశలఁ జూడుము. నేను యుద్ధములోఁ జత్తునని నీ విసుమంతయైనఁ దిగులందవలదు. మానవుల కెప్పుడైన మరణ మనివార్యమె. మఱియు రసపుత్రులమగు మనకిట్టిభీతి యుండకూడదుకదా !" యనెను. రసపుత్రులమగు 'మన' మనుమాట నోటివెంట జారగనే నాలికఁ గఱచుకొని కడువిచారమునొందుచు నంతటితో బిగ్గఱగా మాటలాడుట మాని మెల్లగా మాటాడసాగెను. తరువాత దాసు తన యంగరకాను ధరించి పాదుషా బహూకరించిన ఖడ్గముఁ జేకొని 'సుందరా! నేను పోయి వచ్చెద' నని చెప్పి యతి శీఘ్రగతిని వెడలిపోయెను.

ఇరువది యేడవ ప్రకరణము

# చైత్రయాత్ర

మ॥ పగసాధించి, యశంబుఁబూని, రిపువిధ్వంసంబుఁ జేయంగ నీ
మగవారే పనిలేదు! సంగరమునన్ మధ్యాహ్న మార్తాండుని
ప్రగలన్ శౌర్యమెలర్చి, శత్రువుల భీభత్సంబుగన్ ముంచి, పో
రఁగ దక్షుల్, యువతీలలామ లని, 'వీరాబాయి' చాటించెడున్॥

ఆనాఁడు రాత్రి వీరాబాయి గుడారముఁ బ్రవేశించి రసపుత్రులఁ జంపి యాయుధసామగ్రిని దొంగిలించిన వారెవరో మనకుఁ దెలియలేదు. వీరు ఖేతసింగుచేఁ బంపఁబడిన తురుష్కభటులే. ఖేతసింహాదులు ప్రథమమున జయ మొందుటచే విశ్వాసము మఱచి చిత్తూరు పురములోనికిఁ బోయి స్త్రీలను తదితరులను కొల్లగొందుమని దలఁప వారికి మరల రసపుత్రులు యుద్ధసన్నద్ధు లగుచున్నారని తెలియవచ్చెను. అప్పుడు వారత్యాగ్రహమున నా యుదంతమును బాదుషా కెఱుఁగఁజేసి యా నీచులగు రసపుత్రుల నీసారి యూరును పేరును లేకుండఁ జేయుదుమని బింకాలఁ జూపసాగిరి. అటుపిదప కొంత సేపటికి కొందఱు తురుష్కభటులకు రసపుత్రవేషముల నొనరించి శత్రువుల గుడారములోని కేగి యచటఁ బెద్దగుడారమునందుఁ బ్రవేశించి లోన నిదురించు వీరాబాయిని చంపిరండనియు, గుడారములోఁ బ్రవేశింప దుస్తరమయినచో దానిని తగులఁ బెట్టుడనియుఁ జెప్పి పంపిరి. ఆ తురుష్కభటులే తిరిగివత్తురని తలఁచిరి కాని యెంతవఱకును వారిజాడ కనుపడనందున వారు శత్రువశులయిరని తలఁచి నిరాశఁజెంది యూరకుండిరి.

తురుష్కులు స్త్రీలట్లుండ రసపుత్రులస్థితి వ్యతిరేకముగా నుండెను. చోరులు పట్టుబడిన తరువాత రసపుత్రు లందఱును వారిదగ్గఱ నున్న వస్తువులను తీయగా లోన తురుష్క యంగీలు కానవచ్చెను. దానివలన వారు మహమ్మదీయుల చేఁ బంపఁబడిరని తెలిసికొని వారిని నిందింపక యొకచో బంధించిరి. వీరాబాయి యుద్ధమునకు వలయు నేర్పాటులఁ జేయించుచుండెను.

ఆమె సైన్యములో మంచిమంచి సరదార్లుకలరు; నిపుణులగు మావల్లారులు కలరు; కార్యనుటనా సమర్థులగు బుద్ధిశాలురు కలరు; యుద్ధము తీవ్రముగా నున్నయెడలఁ దగు నాలోచనలఁ జెప్పు యోధాగ్రేసరులుకలరు; సంవత్సరములకొలఁది పోరాడినను తరుగని యాయుధాగారములు కలవు. సమస్తవైభవములతోఁ దేజరిల్లు నాసైన్యమునకు యుద్ధభూమిని జయముకలుగకుండునా? వీరాబాయి చోరులు తన గుడారములోఁ బ్రవేశించినందులకుఁ జింతింపకయే వారు మరలఁ బట్టువడుట శుభసూచకముగా నెంచి సమరోత్సాహముచే సరదార్లఁ బిలిచి తొందర సేయసాగెను. రసపుత్రులంద ఱాయుధపాణులై 'యెపుడు సూర్యోదయమగునా, యెపుడు శత్రుసముద్రములో మునుగుదుమా' యని యావేశమొందుచుండిరి. క్రమముగఁ దెలవాఱు సమయ మాయెను. హిమాంశుఁడు వెలవెలఁ బారుచుఁ బశ్చిమాద్రిఁ జేరబోయెను. మెల్లమెల్లగా విహంగసంతానములు తమగీతంబుల నుద్ఘోషింపఁ దొడఁగెను. పిల్లవాయువులు వీవసాగె. మఱికొంతసేపైనతరువాత దినకరుఁ డుదయాద్రిపైఁ గనుపించి యజాండమునంతయు మేల్కొలిపెను. అప్పుడు వీరాబాయి ప్రాంజలియై దివస్పతి కర్ఘ్యమిడి దృఢనిశ్చయముతో యుద్ధమునకు వెడలెను.

---

ఇరువది యేనిమిదవ ప్రకరణము

# సమరము

మ. పగ సాధించి సుఖంబుఁ బూని రిపుగర్వధ్వంసముం జేయు ధీ
మగవారే పనిలేను; సంగరధరామధ్యంబునన్ నిల్చి, మ
ద్గజముల్ పదహతంబులంగ శత్రుబలమున్ జక్కాడి, శౌర్యాసఁ బో
రఁగ శక్తింగలవారు కొంద రని, 'వీరాబాయి' నాటించె నమున్.

సుకుమారమగు మేనితోఁ, బురుషవేషధారిణియు, శస్త్రధారిణియునై ధవళతురంగము నెక్కి ప్రబల సైన్యముతో శత్రుసముద్రములోనికి దుమికెడు వీరాబాయిని జూచినంతనే తురుష్కవీరు లత్యాశ్చర్యముఁ జెందిరి. స్వాతంత్ర్యేచ్ఛయు, స్వమతాభిమానమును హృదయమునం దుండుటచే నామె కాంతి మిగులఁ బ్రజ్వరిల్లెను. ఆమె మిగుల రోషముతోఁ దన సైన్యము వెంటఁగొని యాఁకొన్న యాఁడుసింగమువలె వైరి బలముపైఁబడెను; ఈ సమయములో గోకులదాసు యుద్ధమారంభమగుటఁ జూచి తన కాషాయవస్త్రముల నొక వృక్షముమీఁద నిడి రసపుత్రవేషమున ఖడ్గపాణియై సైన్యముం గలిసి యథేచ్ఛగా యుద్ధముఁ జేయుచుండెను. తురుష్కులంద ఱేమి చేయునదియు లేకఁ బలువిధములఁ బెనఁగులాడుచుండిరి. రసపుత్ర సైన్యముకంటెఁ దురుష్కసైన్యము ద్విగుణమై యుండెను. అయినను మంత్రములచేతఁ గట్టఁబడినటులఁ దురుష్కు లేమియుఁ జేయునదిలేక స్తంభితులైరి. పాదుషాం కూడ నామె యపూర్వ శౌర్యముం జూచి విస్మయము నొందుచుండెను; తనకుగల శక్తినంతయుఁ జూపుచుఁ దన సైన్యమున కుత్సాహకర వాక్యములఁ జెప్పుచుండెను. అక్బరుపాదుషా

మిగుల వివేకి కనుక మొదట నాస్థితిఁజూచి భీతినొందినను పిదప ధైర్యముఁదెచ్చుకొని తనసైన్యములకు జయసాధనో పాయముల బోధించుచుండెను. విచిత్రముగా నిముసములోఁ దన సైన్యమునంతయు వివిధముగ మార్చెను. సైన్యపురో భాగంబున కేనుఁగుల రప్పించెను. మాతంగ యూథముల కిరు పార్శ్వముల గాల్బలము నిలువఁబెట్టెను. రసపుత్రు లతి తీవ్రగతి శత్రుసైన్యములఁ దునుముచుండిరి. తురుష్కులు రెట్టింపు శౌర్యముతో మార్కొనుచుండిరి. రసపుత్రులెంత పరాక్రమోపేతులైనను శత్రుబలాధిక్యముచే నధికాయాసము నొందుచుండిరి. పోరాటముజరుగు స్థలమంతయు రక్తప్రవాహ సిక్తమగుచుండెను. అడుగడుగునకును శవంబులరాసు లేర్పడు చుండెను. హీరాబాయి కరవాలంబునకు వందలకొలఁదితురుష్క భటులు లాహుతియగుచుండిరి. ఎంతవఱకును పాదుషా కమిత ముగా సైన్యమువచ్చి చేరుచుండెను. ఘంటాద్వయము పోరా డిన దరువాత రసపుత్రు లేనుఁగులబారును బడఁగొట్టఁజాలిరి. సైన్యమునకంతయునూతయగు మత్తేభయూథంబువిచ్ఛిన్నము కాఁగా వెనుకనున్న గుఱ్ఱములబారు చెల్లాచెదరుకాఁజొచ్చెను. అయిన నా దంతావళపఙ్క్తి కిరుపార్శ్వముల యందున్న కాల్బల మించుకసేపు గుఱ్ఱముల దండునకుఁ దోడ్పడి యుద్ధ మొనర్చెను. ఎప్పటిరీతి వారు వెనుకఁజొచ్చిరి. రసపుత్రులుఁ గూడఁ దురుష్కుల మొండితనంబున కచ్చెరువందుచు మిగుల రోషముతోఁ బోరాడసాగిరి. అప్పటికి షుమారు రెండు జాములు కావచ్చెను. ఉభయసైన్యముల పరాక్రమమునకుఁ దగినటులనే మధ్యందిన మార్తాండుఁడు నభోమధ్యంబునఁ జండగతి వెలుఁగుచు యుద్ధము నంతయుఁ జూచుచుండెను.

ఎంతవఱకును యుద్ధముసంకులమగుచుండెను, కాని తగ్గుటలేదు. ఉభయ పక్షములవారును జయలక్ష్మికొఱ కతిశౌర్యమునఁ బోరుచుండిరి. రసపుత్రులు జయము నొందుదురన్న ధైర్యముతో నుండుటచే నిర్భయముగాఁ బోరాడుచుండిరి. అంత కంతకుఁ బ్రొద్దు జారుచుండెను. ఎటుఁజూచినను జయము కనిపించుటలేదు. యుద్ధభూమి శవమయ మగుటచే నుభయ సైన్యములకుఁ బోరాడుటకుఁ దగు విశ్రాంతి లేకుండెను. తురుష్కభటులు గుంపులుగాఁ గూడి వీరాబాయి నంతము నొందింప నాపెదరి కేఁగుచుండిరి. కాని, వారా భీకర విగ్రహము జూచినంతనే తత్ శౌర్యాగ్నికిలోఁబడి మడియుచుండిరి. ఇటులుండ రసపుత్రులలో నిద్దఱు యువకులు తురుష్కుల మీఁదఁబడి వారిని నుగ్గుగాఁ జేయుచుండిరి. వీరే ఖేద్ మారు జయమల్లుఁడును, కేశవాధీశుఁడగు పట్టా యనువాఁడును. అక్బరుకూడ వీరి పరాక్రమముఁ జూచి చాల సంతసించెను. తరువాత నుమరల్ శాహా తన కాల్బలమును సంగర రంగా భ్యంతరమునకుఁ దీసికొనిరాగ రసపుత్రులందఱు భీకరరవంబుతో నాసైన్యముపైఁ బడిరి. ఈ ధాటి కోర్వలేక శత్రుసైన్యము చెల్లాచెదరాయెను. రసపుత్రులు, తురుష్కుల ననేక పరుషభాషణంబు లాడుచు 'జయ' యను వాక్యంబులచే శౌర్యాగ్నిని రగుల్పజేయుచు వీరాబాయితోఁగూడి పోరుచుండిరి. అప్పటికే నిశాసమయమయ్యెను. రాత్రిసమయంబున యుద్ధముఁజేయు టన్యాయమని తలఁచి యిరు తెగలవారును నాటికి యుద్ధము ముగించిరి.

---

## ఇరువది తొమ్మిదవ ప్రకరణము.

# సమరము

మ. అబలారత్నము లెన్న సంగరమునం దాయాసమేలేక, శ
త్రుబలంబుల్ వడిదాకుచున్ గడియలో ద్రుంపన్ సమర్థల్; నిజ
ప్రబలస్థైర్య విశేషధైర్యగుణసంపన్నల్, మహావీర శౌ
ర్య బలాఢ్యల్, సుగుణంపుఁబ్రోవులని, నీరాబాయి చాటించెనున్.

అక్బరుపాదుషా మొదటిదినము యుద్ధము కాగానే యా రాత్రి తన గుడారములోఁ గూరుచుండి యుద్ధమును గూర్చి పలుమారు యోచనఁ జేయుచుండెను. తద్దినచర్య యంతయు నతనికి స్వప్న గతంబుగానుండెను. ఏలయన, రసపుత్రు లోడుదురని యాతఁడతిసంభ్రమున విహరించుచుండెను. కాని, వారు మరలఁ గ్రొత్తసైన్యములతో వత్తురనిదలఁపలేదు. తన సైన్యములమీఁద నాడుసింగమువలె దుమికిన స్త్రీవిషయమై పలుమారు తలఁచుచు నామెకుఁగల ధైర్యాదిగుణంబుల కచ్చెరువొందసాగెను. తనసైన్యము పరసైన్యముకన్న నెక్కుడుగా మడిసినందులకు విచారము నొందుచు రెండవనాటి యుద్ధమునకు దగు నుపాయము నాలోచించుచుండెను. అపుడుమరల్ శాహా కూడఁ బాదుషాను దర్శింప నచ్చోటికేఁగి కొంతసేపటివఱకు నేమియు మాటలాడక కూరకుండెను. తరువాత నాతఁడిటులఁ బ్రారంభించె:

శాహా:—సర్కార్ సాహేబు! తమ రిపుడాలోచనఁ జేయుచున్నది నేఁడు జరిగిన యుద్ధమును గురించియేకదా?

పాదుషా:—అవును; ఆ విషయమే యాలోచించుచున్నాను.

శాహా:—సర్కార్ ! మనతో యుద్ధముఁజేసిన స్త్రీ యెవ్వరైయుండును ? తమకుఁ దెలియునా ?

పాదుషా—ఆమెయే ఉదయసింహునిభార్య వీరాబాయి.

శాహా—అటులయిన నామె కంతశౌర్యసంపత్తి కలదా ?

ఈ ప్రశ్నను విని పాదుషా వీరాబాయి శౌర్యస్తుతి నొనర్ప నిష్టములేక జవాబుఁజెప్ప కూరకుండెను. దీనిని శాహా గ్రహించి మరల నడుగక, 'సాహెబుజీ? యామె యెట్టి స్త్రీయైనను దురుష్కునికన్న నెక్కుడు పరాక్రమముగలదియా ? ఈ రోజున మనకుఁ జిక్కకున్నను రేపయినను మనపాలఁ బడ కుండునా ?' యనెను. ఈ మాటను విని పాదుషా ధైర్యము నొంది 'భాయీ రెండుదినముల క్రిందట మనము యుద్ధముఁజేసి గెలుపొంది యుదయసింహుని చెఱలో నుంచినను తత్ఫల మంతయు నేటితోఁబోల్ప నిష్ప్రయోజనము కదా ! కావున నికనైన మంచిసైన్యముఁ దయారుజేయుఁడు. మన తురుష్క-కులమున కప్రతిష్ఠఁ దేకుఁ' డనెను.

శాహా:—అయ్యా ! అంతయు సిద్ధముగానేయున్నది. దైవకటాక్షము బాగుగా లేకపోయెను. కాని, ఈ రోజున మాత్రము మనసైన్యము బాగుగఁ బోరాడలేదా ?

పాదుషా:—అయ్యా! ఖేతసింహాసోదరు లేమి చేయు చున్నారు ?

శాహా:—అయ్యా! నేనువారిని చూడలేదు. యుద్ధము జేయునప్పుడు వారు నాకుఁగనబడలేదు. తమయాజ్ఞయైనచోఁ బిలిపించెదను.

ఇటులఁజెప్పి నంటనే యొక భటునిబిలిచి ఖేతసింహాదుల వేగమే గొనిరమ్మని చెప్పెను.

ఖేతసింహాదులు ప్రథమ దివసయుద్ధానంతరము శత్రువుల పరాక్రమమున కచ్చెరువందుచుఁ జాలమంది మడియుటఁ జూచి యుద్ధము ముగింపకమునుపే తమ గుడారముల చెంతకేఁగి యచటఁ దమ యాయుధములనుంచి పాదుషాను జూడ నొల్లక వేఱుగాక రహస్యప్రదేశమున కేఁగి యచట విచారణఁ జేయుచుండిరి. అంతనేమియుఁదోచనందునఁ బాదుషా భటులఁ జూచి వారుండుచోటున కేఁగిరి. పాదుషా వీరిఁజూచి 'అయ్యా! తమరీరోజున జరిగినయుద్ధమం దెచటనుండి పోరాడి' రనెను. అదివిని వారు 'అయ్యా! మేము సైన్యపురోభాగమున నిల్చి యుద్ధముఁజేసితిమి. కాని, కొంతసేపైన తరువాత మాకు యుద్ధముఁజేయ నిష్టములేకఁ దమయాజ్ఞఁ గొనకయే వెళ్ళితిమి. కాన క్షమింపు'డనిరి. మఱియు నిట్లు చెప్పఁదొడగిరి. "అయ్యా! రేపు జరుగఁబోవు యుద్ధ మీరోజున జరిగినదానికన్న చాల తీవ్రముగ నుండవచ్చును. రసపుత్రసైనికు లశ్వములు లేక క్రిందనుండి పోరాడుచున్నారు. మనకుఁగల వాని నన్నిటిఁ బ్రోగుచేసి యశ్వారూఢులమై, క్రిందనున్న వారితో రణ మొనరించినవారు కొద్దికాలములోనే డస్సిపోవుదురు. అప్పుడు మనకుఁదప్పక జయముకలుగు"నని చెప్పిరి. అంత పాదుషాకూడ సమ్మతించెను. ఖేతసింహాదులు తమ తమ కార్యములమీఁదఁ బోయిరి.

---

ముప్పదియవ ప్రకరణము

# సమరము

మ. కరకంజంబులఁ జాపమౌర్వి గుణమాకర్ణాంతమున్ లాగి సం
గరమధ్యంబునఁజేరి, శత్రుబలమున్ గగ్గోలుగావించి, దు
ర్భరబాణాహతినొంచి, సంజనిత సంరంభంబునన్ మించి, ఘో
రరణంబున్ బొనరింత్రు కాంతలని, వీరాబాయి చాటించెడిన్॥

వీరాబాయి తురుష్కులతో యుద్ధముఁ జేయుచుండ నచటనో దాగియుండిన గోకులదాసు తన వైరాగివేషముఁ దీసి రజపుత్రవేషముతో సైన్యముం గలసి యుద్ధముఁ జేయుచుండెనని మనము చదివియుంటిమి. అతఁ డతిసాహసంబున తురుష్కసైన్యముఁజొచ్చి, నిర్భయముగఁ గత్తిని ద్రిప్పుచుఁ జుట్టుప్రక్కలంగల వారి సంహారమొందించు చుండెను. మొదటి దినము యుద్ధానంతర మెవరికిఁ గనుఁబడకుండఁ దన కాషాయ వస్త్రముల ధరించి గుడారముకడ కేఁగెను. సుందరుఁడు దాసుంజూచి యాలింగనముఁ జేసికొనెను. దీని సంతోషము నా స్త్రీలు చూచుచునే యుండిరి. అంత సుందరుఁడు 'అయ్యా! యుద్ధము ముగిసినదా!' యనెను. ఆతఁడు 'యుద్ధమీరోజునకు మాత్రము ముగిసిన'దని చెప్పెను. దీనినిగూడ నా స్త్రీలు వినుచుండి యుద్ధము కడుఁ దీవ్రముగా నుండియుండవలయునని యూహించుచుండిరి. అంతలో గోకులదాసు యుద్ధమునందలి బడలికచేఁ ద్వరలో నిదురఁజెందెను. సుందరుఁడును బరుండెను. పాపము! దాసునకు బాగుగ నిద్దుర పట్టెను. దానిచే నాతఁడు లేచునప్పటికి బాగుగ తెల్లవాఱగ ఖిన్నుఁడై;

ఉ. చల్లని వాయువుల్ ప్రబలె, సంతమసంబది జారె, ప్రాగ్దిశన్
దెల్లని ఛాయలున్ బయలుదేఱె, విహంగ చయంబుఁ గూసె, జా
బిల్లియు వెల్లనై చనియె, వీర రణోత్సవదాయకంబు నై
పెల్లుగ మ్రోయుచున్న రణభేరి యదే కనుఁగొమ్ము సుందరా !

అని పునఃఖడ్గపాణియై శిష్యు నా యువతీ రక్షణార్థముంచి వెడలిపోయెను. దారిలో నెప్పటివలె దన వేషము మార్చి రజపూత వేషముతో సంగ్రామభూమి కేఁగెను. రసపుత్రులకును దురుష్కులకును మరల రెండవదినము యుద్ధమారంభమాయెను. మొదటి దినమునకంటె నీదిన మతిభయంకరముగా నుండెను. తురుష్కులు కడుసాహసంబున రసపుత్ర సైన్యముపై దుముకుచుండిరి. రసపుత్రులుకూడఁ దురుష్కుల కన్న నెక్కుడు పరాక్రమమున యుద్ధముఁ జేయుచుండిరి. తురుష్కుల బలంబులఁజూచి రసపుత్రు లమితాశ్చర్యమునొంది కత్తుల గిరగిర ద్రిప్పుచు యొడ లెఱుంగకఁ దురుష్కుల నొక్కరీతిగాఁ దాకుచుండిరి. ఇటులఁ దన సైన్యమంతయు నిమిష నిమిషమునకుఁ దగ్గుటఁజూచి పాదుషా కోపోద్దీపితుఁడై రసపుత్రవీరులఁ ద్రొక్కి చంపఁ బదునైదువందల స్వారులఁ బంపెను. వారు వచ్చినంతనే రసపుత్రులు వెఱ్ఱికేకలు వైచుచు వారందఱిని క్షణములోఁ జెండాడిరి. దీనినంతయుఁ బాదుషాకను లార చూచి క్రోధాతిశయమున, దన బదునాఱువేల స్వారుల నొక్కసమయమున బంపెను. ఈషోడశసహస్రాశ్వరాజంబులఁ జూడఁ గన్నుల పండువగుచుండెను. అట్టి తురంగ రాజముల మనమెపుడు జూచియుండము. ఆసైంధవపదఖురాఘాతంబులచే భూమివడకుచు దుమ్మంతయు రేగి భూమ్యాకాశములఁ గప్పివేయుచుండెను. ఆదళమతిశీఘ్రగతి రసపుత్ర బలంబులలోనికి

జొరఁబడెను. కొంచెముసేపటికిఁ దురుష్కసైన్యంబు చెల్లా చెదరయినను మిగిలిన వారందఱు వెనుకకుఁ బోక నిలువఁబడిరి. కొంత దడవైనతరువాత వీరాబాయి యండచే వారు శౌర్యోపేతులై యాతురుష్కసేనలను పలువిధముల నొప్పింప సాగిరి. వందలకొలఁది తురుష్కులు నేలఁ గూలుచుండిరి. అసంఖ్యాకములగు నశ్వములు పుడమిపై వ్రాలుచుండెను. ఇట్లుండ నొకమూల రసపుత్రవీరుఁడొకఁ డతిచోద్యంబునఁ దురుష్కులను గుఱ్ఱములమీఁదనుండి క్రిందకులాగి కంఠముల దునుముచుఁ గాలఁదన్నుచు సైన్యమంతయుఁ దత్తరపాటుఁ గాంచు నటులఁ బోరాడుచుండెను. ఇది యిట్లుండగా నాసైన్యములో నింకొకమూల ఖేతసింహాదులుఁ దమగుఱ్ఱముల వరుసగా నడి పించుచు రసపుత్రుల ననేకవిధముల నిందించుచుఁ గను భయం కరముగాఁ గేకలిడుచు యుద్ధమొనర్చుచుండిరి. వీరు తురుష్క వేషధారులై యుండుటచే వీరిని రసపుత్రులు గుర్తింపజాలకఁ బోయిరి. కాని వీరింగని రసపుత్ర బాలురిరువురు తమఖడ్గంబుల నూరుచుఁ గడుసంభ్రమంబున వారిదెసకు బెబ్బులి జంటవలెఁ బోవుచుండిరి. వీరిని జూడగనే వారుకూడ వెనుదీయక డీకొనిరి. వారుకూడ శూరులే గనుక జాలసేపు యుద్ధమొనర్చిరి. ఒక యరగంటయైనఁ దరువాత నాకవలసోదరు లాముగ్గురి యశ్వం బుల నేలఁగూల్చిరి. చాలవఱకు నూతగానున్న తురంగ శ్రేష్ఠము లుర్విపయిఁబడ నాముగ్గురును యుద్ధము సేయఁ జాలకఁ బరుగిడసాగిరి. వెంటనే యాకవలసోదరులాపిఱికిపందల వెన్నంటఁ దరి[illegible]ని వారింకఁ బరువెత్తుటచే పాఱుఁబోతుల జంపు టన్యా[illegible] తలఁచి మరల సంగ్రామరంగముఁ జేరిరి.

## ముప్పది యొకటవ ప్రకరణము

# జయము

మ. కదిసేన్ రణరంగమందున, నసంఖ్యాకంబులౌ శత్రు రా
జ సమూహంబుల రూపుమాపి కడిమిన్ సర్వంసహాచక్రమం;
దసమాన ప్రభ నిల్పి, సర్వజన కళ్యాణంబు గావింత్రు, మా
రసపుత్రాన్వయ వీరమాతలని వీరాబాయి చాటించెనున్.

శ్వేతసింహాదులు సమరస్థలిపైఁ బాఱఁగనే, తురుష్క సైన్యమంతయు లావుందక్క చెల్లాచెదరాయెను. పాదుషా యీ వృత్తాంతము వినినంతనే ఖడ్గముం జారవిడచి తన యశ్వము మీఁద బడిపోయెను. అప్పు డమరల్ శాహా పాదుషాను సమీపించి వారికిఁ బలువిధముల ధైర్యమునూది మరల యుద్ధము సేయువానిగాఁ జేసెను. ఇట్లుండ శ్వేతసింహాదులఁ జూచినప్పటినుండియు వీరాబాయి వారి క్రూరకృత్యముల నన్నిటిని జ్ఞప్తికి దెచ్చికొని కడురోషమునఁ దురుష్కుల పైఁబడి గగ్గోలు గావించుచుండెను. అక్బరుసైన్య మీ ప్రళయమున కోర్వఁజాలక నలుదిక్కులఁ బాఱఁదొడగెను. ప్రళయాగ్నింబోలు నాపెపరాక్రమముఁగని యక్బరత్యాశ్చర్యము నొందెను. ఆయన జడునివలె నేమియుఁ దోచక నిలువఁబడెను. అపుడా క్షత్రియవీరులుత్సాహంబు రెట్టింప మ్లేచ్ఛసైన్యముల ననేకరీతుల బాధింపఁదొడఁగిరి. పాప మా రసపుత్రవీరులు మొదటఁ దగునాయకుఁడు లేమిచే తురుష్కుల పాలఁబడవలసి వచ్చెనుగాని, వీరాబాయియట్టి శూరశిఖామణి యున్నచో వారూరకుందురా? బెబ్బులిపిల్ల మృగశాబకంబుంజూచుచో నూరకుండునా? రసపుత్రునికి శౌర్యము ప్రకృతి జన్యగుణంబే కదా! అక్బరుపాదుషా తనకు జయముకల్గుటకు మారుగా

నపజయముకల్గుటఁ గని యాగర్భ శత్రువులకు లొంగవలసి
వచ్చెఁగదా! యని యేమియుఁ జేయునదిలేక సంధి సూచక
పతాకమెత్తెను. తత్క్షణమే యుదయసింహుని సహితము బంధ
విముక్తుఁ జేసెను. అంత మీరాబాయి తనసైన్యమునకు యుద్ధము
నాప సంజ్ఞఁ జేసెను. రసపుత్రు లందఱు జయాతిశయముచే
సంతోషరవంబుల సలుపుచుండిరి. చూచితిరా! పరాక్రమ
వంతురాలైన మీరాబాయిచే మహాబలవంతుఁడైన యక్బరు
నంతటి ప్రభువు సహితము జయకాంక్ష మాని హతశేషులగు
వారింగొని మరలఁ దనపురి కేగవలసిన వాఁడాయెను. ఇట్టుల
జన్మమునం దెప్పుడును యుద్ధ మెఱుఁగనిదయ్యును, యొక
ముహూర్తమాత్రమున మీరాబాయి గొప్ప శూర స్త్రీ యన్న
ఖ్యాతిం జాటించి యిరువదినాల్గవ ప్రకరణమునకు శిరోలేఖన
మగు శ్లోకార్థమునే సార్థకపఱచెను. సద్గుణము లెక్కడ
నున్నను వెలికి రాకమానవుకదా!

---

ముప్పదిరెండవ ప్రకరణము

# పశ్చాత్తాపము

మ. రణరంగస్థలి నిల్చి, కాంత లతిధైర్యంబొప్ప హస్తంబులన్
గడంబుం జాపముఁబూని వైరిబలముల్ ఘూర్ణిల్లగాఁ దీవ్ర మా
ర్గణపంక్తుల్ వెలువారిపై బఱపి సంగ్రామంబునన్ శత్రు మా
రణమున్ సల్ప సమర్థలంచు, నల మీరాబాయి చాటించెడున్.

క్షేతసింహాదులట్టులఁ గవలసోదరులచేఁ దఱుమఁబడి
సంగరస్థలి వీడి పాఱిపోయి తుదకొక నిర్జనప్రదేశమున రెండు

కొండలమధ్య నొక తటాకము దరిఁ గూరుచుండి యిటుల విలపింపఁదొడగిరి:—

ఓయీ సర్వమయా! నీచేష్టితంబులు చిత్రంబులుకదా! నీమాయ లోకమును మాయఁగదా! ఒకచో గొందఱ నానందాబ్ధి నాడించి వేఱొకచో దుఃఖసాగరమునఁ ద్రొక్కుదువుగదా! భగవంతుఁడవయ్యు నందఱ సమానముగా సాకవేమి? కష్టసుఖంబులకుఁ గారణుండ వీవెగదా. లోకమున కంతకు యాజమాన్యము వహించి లోకు లందఱ బొమ్మలరీతి నిర్మించి వారిచేఁ బలుతెఱంగుల నాటకమాడించి సంతసించు చున్నావు. ఇందఱిని గష్టబెట్టుచు, హాయిగ సంతసించు భాగ్యము నీకుఁ జెల్లెను కాని మఱొక్కనికి వీల గునా? ఆహా! దీనబంధూ! నీ కృత్యము లనిర్వాచ్యములు; నీకర్మలు కడు గూఢములు. పరమాణువునుండి పారావారము వఱకు స్థూలసూక్ష్మవస్తువులయందొకేగతి సాక్షాత్కరించుచు నేస్వల్పజీవున కేసమయమున నేమి సంభవించునో, నీకు దప్ప నితరులకుఁ దెలియునా? భవిష్యదవలోకనము మానవ మాత్రుల కసాధ్యముకదా. వేయననేల? నీకు సాటి నీవే. మాకుమ్మల నే లగ్నంబున సృష్టించితివో కాని మా పుట్టుక మొదలు నేటివఱకు మాచే ననేక వేషంబుల వేయించితివి. అనేకుల పాదయుగ్మంబుల నాశ్రయింపఁ జేసితివి. అనేకులచేఁ దిరస్కరింపఁబడునటు లొనర్చితివి. తుదకు భారతమాతకుఁ గూడ సహింతమొనర్పించితివికదా. అయ్యో! మాజన్మమ్ముల గాల్పనా! యిన్ని యిక్కటుల మేమేలఁ దెచ్చుకుంటిమి? పవిత్ర రసపుత్రవంశమునం దుద్భవించి చిత్తూరు రాణావారి కొలువులోనున్న మాకీనాటి కీయవస్థ సంభవించునని యాచతు

రుక్మఖుఁడును గలనైనఁ దలఁచియుండునా? మీరాబాయి యంతటి శూరస్త్రీయెడ నకారణముగ వైరముగల్పించుకొని యామె నట్టింటియు నా తురుష్కునకు రట్టుఁ జేసితిమే. పాలనంటి కులంబెల్లఁ బాడుజేసి మాకెట్టి యపకారముఁ జేయని నిరుపమాన పతివ్రతాలలామ లగు నా కన్యామణుల నన్యాయముగ నట్టి బలవంతమునఁ గాళికి బలినీయఁ బ్రయత్నించితిమి. ఆ తురుష్కుని చరణంబుల బట్టియు నచటనైన స్వేచ్ఛగా నుండుదుమన్న నచ్చోఁగూడఁ బరాభవము వాటిల్లెఁగదా. మా మాటలు విశ్వసించి మే మేమియోఁ దవ్వి తల కెత్తుదుమని తలఁచి పాప మా తురుష్కులుకూడఁ బోరిలోనికి దిగినారు కదా. వారు యుద్ధముచేసి దేహంబుల దేశసంరక్షణార్థమై సమర్పించుచుండఁ బౌరుషమునకై యుద్ధము జేయక తుద కా కవలసోదరుల వాతబడి నిగ్రహింపలేకఁ బిఱికిపందలవలె నేటికీకొండలమధ్య దాగియుంటిమిగదా. అయ్యో! యెంత ధర్మమార్గ దూరులము! ఎంత జనద్రోహులము! ఎంత కృతఘ్నులము! ఎందఱి యుసురులఁ బొట్టనిడుకొంటిమి? సర్వ సౌభాగ్యములకు దావలమై, మంజుల వేదమంత్రముల బావనమై, శాస్త్రార్థ వివేకమహితంబై, సార్వభౌమ సుపరిపాలనా సుఖారామమై, స్త్రీరత్నముల పాతివ్రత్యముచే దేజోవంతమై వీరాధివీరుల నిశాతఖడ్గప్రహారణములచే నిష్కంటకంబై, కృషీవలుల హాలాయుధముచే సౌభాగ్యసంపన్నంబై, గాయకశిఖామణుల గీతా సహస్రములచే భక్తిరసబంధురమై, భిషగ్మణుల యమృతకరస్పర్శచే నిరామయంబై, కవిసార్వభౌమ వాక్యరత్నములచేఁ దరంగాభిరామంబగు నీ భారతమాతను కూడ విడనాడితిమికదా? రాబోవు యుగ యుగంబులవఱకు

మా యీచరిత్ర నెందరెన్నినోళ్ళ నిందించెదరో కదా! హిందూమాతకు ద్రోహమొనరించిన దుర్మార్గుల చరిత్రవిని యెందఱు కన్నుల నీరుంగార్చెదరో. దైవమా! యిట్టి దుఃఖముతో మమ్మింతకాలము బ్రతుకనిచ్చిన దిట్టి మాతృహత్యాపాతక మొడిఁగట్టుటకా ? పుట్టినవెంటనే గిట్టినట్లయిన మాకింత సంతాప ముండదుకదా! కటకటా! భూదేవీ! దేశద్రోహము నకుఁ గూడఁ బాల్పడిన యీచండాలురఁ బోకార్చి నీ భారముఁ గొంతెఁ దగ్గించుకొనరాదా? ఓయీ! సర్వేశా! ఈదుర్మార్గుల పాపకర్మంబులఁ గన్నారఁ జూచుచుండియుఁ బ్రళయ కాలమందైన దప్పని నీ శాపవాక్కును విడువకున్నావేమి? హా! భగవానుఁడా! మేమెన్ని మన్వంతరంబులు తపం బొనరించినను మాయీదుష్కృతికి నిష్కృతి యగుటెట్లు? మాకు దిక్కెవ్వరు? మాపాపంబునకు బ్రాయశ్చిత్తంబెద్ది? దీనబంధూ! విశ్వపతీ! మావిచిత్రనాటకము నేటితో ముగించితివిగదా!' యనుచు హృదయాంతరంగమునుండి యుబికివచ్చు దుఃఖతరంగముల నాపుకొనఁజాలక వారు మువ్వురా నిర్మల జలపూర్ణ తటాకంబునఁ బడి ప్రాణంబులవీడిరి.

ఉ. భూరిపవిత్రవంశమునఁ బుణ్యవశంబునఁబుట్టి సంపదల్
మీఱి వసింపకే తలకు మించిన కార్యము లూని వైరులన్
జేరి, స్వజాతి బోరుటకుఁ జేరి సమర్థత లేక పందలై
పాటి పరాభవానలము పైబడఁ గొండలలో హ్రదంబులో
దూఱిరి కంటిరే యహహా! దుష్టచతుష్టయపుం బ్రవర్తనల్.

———

ముప్పది మూడవ ప్రకరణము

# మీరింకను మమ్ములఁ బోల్చుకొనలేదా ?

మ. ఆయుడి ! బాలులార ! విపినాంతరసీమలనుండి, పాపకా శం
కామహమం దహర్నిశముఁ గాలము బుచ్చుచు గాఢ చారులై
గురువను పేరటం జనెదు గోకులదాసను వాఁడెవండొ సుం
దరుఁడని వాని తోడనె సదాచరియించెడి వాఁడెవండొకో !

గోకులదాసు యుద్ధానంతరమున సంగ్రామస్థలి వీడి, దారిలో దన బైరాగివస్త్రములఁ దాల్చి యపరిమితానంద మునఁ బోవుచుండెను. ఇంతలో సుందరుఁడు దాసుకొఱకు ప్రతీక్షించుచుండెను. అంతట దాసురాగా వారిరువురు గుడార ములోఁ బ్రవేశించిరి. వెంటనే సుందరుఁడు అయ్యా! 'యుద్ధము సమాప్తినొందినదా ? రాణావారు గెలిచిరా ?' యని కడు నాతురతతో నడిగెను. దాసు యుద్ధము ముగిసెననియు, రసపుత్రులకే జయము కలిగెననియుఁ జెప్పెను. రసపుత్రులు గెలిచి రను వాక్యము గోకులదాసు నోటివెంట వెలువడిన తోడనే సుందరుఁడు సంభ్రమము నాపలేక నేత్రయుగ్మము వెంట నానంద బాష్పముల విడిచెను. నేటితో మనకష్టములు తుదముట్టెగదా ? యని సుందరుఁడు గొప్ప నిట్టూర్పు విడిచి 'అయ్యా ! ఇక మనము హాయిగ నిద్ర నొందవచ్చును కదా' యనెను.

గోకులదాససుందరుల సంగతు లిట్లుండనిండు. ఒక్క తూరి మన మాసుందరాంగుల కడ కేగి వారిహృత్పీఠము లెట్లు న్నవో చూతము. వారి హృదయములు చలించుచున్నవా! లేక నిశ్చలత నొందియున్నవా ? ఆ స్త్రీలిరువురు హాయిగ

నున్నారా, లేక ప్రాణంబుల మూటగట్టుకొని వంతనొందు చున్నారా ? వారా పురుషుల వృత్తాంతము నరయఁ గలిగిరా, లేదా ? పాప మా ముగ్ధాంగనల కా ప్రదేశములనుండి యిఁక నైన విముక్తిగలుగునా లేక యాస్థితిలో నుండవలయునా ? కర్మవశమున నెన్నినాళ్ళు కష్టముల నొందవలెనో యంతవఱకును వేఱుఁగల్గనేరదు. నలువవ్రాతను మానవులతిక్రమింప నేరరుకదా. అయినను చదువరులారా ! మనకింత తొందర యేల ? ఈ నారీరత్నముల గూర్చి మనమింత యాలోచనఁ జేయనేల ? వారిసంగతి మన కిప్పుడే తెలియఁగలదు.

ఆ స్త్రీలిర్వురు రాను రాను, దేనివలననో దాస సుందరుల జూచినప్పటినుండియుఁ గొంత ధైర్యము నొందు చుండిరి. కొన్నిరోజులకు వారా నూతన పురుషులు తమ కేవిధమగు పీడఁజేయ నొల్లరనియు, వారు రసపుత్ర పక్షావలంబు లనియుఁ దలఁచిరి. వారిద్దఱు సుందరుని ముఖారవింద మునెవఱకుఁ జూచినదిగాఁ దలంచుచుండిరి. కాని, వారెటుల వానిని పలుకరింపఁ గలరు ? సుఖలాబాయి కమలాబాయిని జూచి, 'అమ్మా ! వీరిర్వురి చర్యలఁ జూడ నాశ్చర్యముగా నున్నవి. వీరలఁ దురుష్కు లనుకొందమా ? రసపుత్రు లను కొందమా ? వీరి చర్య నపుడపుడుఁ జూడ సందేహామొదవు చున్నదే. ఎటులయినను వీరు తప్పక రసపుత్రులై యుండ నోపు. కానిచో నీ దాసు నిన్న రసపుత్రులలోఁ గలిసి గొటుల యుద్ధముఁ జేయగలుగును ? రసపుత్రులు యుద్ధముఁ జేయుచో దమచెంత నింకొకజాతి మనుష్యుఁడుండ సహింతురా ? ఆ మాటలువిని కమలాబాయి 'అమ్మా ! నీకెంతఁ దెలియునో నాకును గూడ నంతయే తెలియును ? కాని నీకన్న

నే బుద్ధిచాతుర్యముఁ గలదానవా? నాకు నిజముగా వీరి చర్య లద్భుతములుగా నున్నవి. వీరు బైరాగివేషధారులగు రసపుత్రులుగా నున్నారని నుడివె. వీరిభాషణంబుల నచటఁ గృష్ణాజినముపై బరుండియున్న సుందరుఁడు విని యించుకఁ జిఱునగవుఁగలవాఁడై వారిఁజేరి కమలా సుఖలాబాయిలారా! మీరింకను మమ్ములఁ బోల్చుకొనలేదా? యని వచించి మరలఁ బరుండెను. సుందరుని నోటినుండి యీ వాక్యమును వినినంతనె యా స్త్రీరత్నము లిద్దఱుఁ బరవశలయిరి. వారి యొడలంతయుఁ జిఱుచెమ్మటలు గ్రమ్మెను. వెంటనె వారు మూర్ఛనొంది భూమిపై వ్రాలిరి. సుందరుఁడు వారు పరవశత్వము నొందుటఁ గని మందహాసముతో నచ్చోటువాసి దాసుచెంతకేఁగెను.

పాఠకులారా! మీరైన నీ పురుషయుగ్మ మెవరో చెప్పఁగలరా? వీరు తురుష్కులా? లేక రసపుత్రులా? వీరీ వేషములధరించి యీ మఠములో నివసించుటేల? ఒకవేళ రసపుత్రులై సంసారమునందు విరక్తిఁజెంది విరాగులైరను కొందుమా? అటులయిన నెచటనోయుండి ముక్కుమూసి కొనక ఖడ్గపాణులై యుద్ధముఁ జేయనేల? ఏమి! వీరి మర్మమునకు మితములేకున్నదే! మిత్రులారా! వేఱే చింతింపనేల? గోకులదాసే పుష్పమిత్రుఁడు. సుందరుఁడే చంద్రబాణుఁడు.

పుష్పమిత్రుఁడు రాజ్యమునుండి వెడలఁగొట్టబడినప్పుడు చంద్రబాణుఁడుకూడ నతనియందలి యనురాగాతిశయముచే నతని వెంటఁ జనెను. అటులఁబోయి యరావలీపర్వతప్రాంత

ముల నొక పాడుమఠములోఁ జేరి దానికి శంకరమఠమని పేరిడి తమకు గోకులదాసనియు, సుందరుఁడనియు పేరులఁ బెట్టుకొని కాలముఁ గడుపుచుండిరి. పుష్పమిత్రుఁడు జ్యోతిషముఁ జెప్పువానివలె నటించుచు సర్వజనస్తుతిఁ బాత్రుఁడయ్యె. జ్యోతిషమువలనఁ బుష్పమిత్రుఁడు పాదుషాప్రేమ వడసెను. ఖేతసింహుఁడు లా స్త్రీయుగ్మము నెత్తుకొని వచ్చుచుఁ బుష్పమిత్రుని బ్రశ్నఁజేయగా నాతఁడా స్త్రీలను వారినుండి తప్పించుటయు, దనకుఁ బరిచారికాంగనలుగాఁ గైకొనుటయు యుద్ధఫలితముఁగూర్చి పాదుషా ప్రశ్నఁజేయ దప్పకజయమొదవునని చెప్పఁబాదుషా ఖడ్గమొసంగుటయు పాఠకులెఱిఁగినవిషయమే. చంద్రబాణుఁడు సుందరునిపేర బుష్పమిత్రునికి శుశ్రూష సేయుచుండెను. పాఠకులారా! పాదుషా సైన్యసమేతుఁడై రేణుదుర్గముఁ జేరినపుడతని కడకేగి హమీరులా లస్వస్థుఁడై యుండెనని చెప్పి వాని కుత్సాహభంగ మొనర్చినవాఁడీ చంద్రబాణుఁడే!

ఆ స్త్రీలిద్దఱు జంద్రబాణుని మాటలువిని మూర్ఛ నొందిన వెంటనే చంద్రబాణుఁడు పుష్పమిత్రునియొద్ద కేఁగగా నాతఁడు నిదుర మేల్కాంచెను. అపుడతనితో నీవృత్తాంతముఁ జెప్ప బుష్పమిత్రుఁడు చంద్రబాణా! నీవు వారిని బలుకరింప వారేమనిరి? వారాశ్చర్యము నొందలేదా యని యాతఁడు కూడ విస్మయము నొందుచుండెను.

---

## ముప్పదినాల్గవ ప్రకరణము

# హర్షాబ్ధి

ఆ సుగుణాలలామ లట్లు విస్మయపరీతచేతస్కలై కొంత సేపటికిఁ దెప్పరిల్లిరి. అపుడు మరలఁ బుష్పమిత్రుఁడు చంద్రబాణునిఁజూచి 'చంద్రబాణా! మనమింక దడవుఁ జేయఁ గూడదు; లెమ్మని' చెప్పెను. పాప మా యబలా రత్నములు "చంద్రబాణా! యన్నమాట వినినంతనే మరల విస్మయము నొంది యొడ లెఱుంగక పోయిరి. ఆ సమయముననే పుష్పమిత్రుఁడు తన కాషాయ పటమును దీసివైచెను. కాని దాని నా స్త్రీలు చూడలేదు. కొంతతడవైనతరువాత నా గుణావతంసలు కన్నులనెత్తి చూచి చంద్రబాణుని చెంతఁ బుష్పమిత్రుఁడుకూడఁ గనబడ, 'హా పుష్పమిత్రా!' యని వాని పాదములపైఁబడిరి. పుష్పమిత్రుఁడును వారల లేవఁదీసి యోదార్పసాగెను. అపుడాయువతీమణుల యానంద మేమని చెప్పవచ్చును? కొంతసేపటికి వారు తెలివినొంది 'అయ్యలారా! మే మొనర్చిన తప్పులను సైపుడనిరి. పుష్పమిత్రుఁడా మాట విని అమ్మా! మీవలనఁ దప్పేమికలదు? మిమ్ముల నిట్టి ప్రదేశములం ద్రిప్పుచు సమయమున కన్నపానాదుల నీయక కష్టపెట్టిన మావలనఁ దప్పుగలదు. కాని నిర్దోషులగు మీరేల నన్ను బ్రార్థింపవలయును. ఒకవేళ మావలన మీకేవిధమగు సహాయమైన కలిగినదా యనెను. వారా మాటలను విని 'అయ్యా! మీరు మాకు వేఱు సాయము జేయవలయునా? మమ్ములను దుర్మార్గులగు ఖేతసింహాది తురుష్కుల చారినుండి దప్పించి కాపాడుటే మాకుఁ బదివేలు. మా కుల

ధర్మముఁ గాపాడుకొనుటకంటె మాకు వేఱగు ధర్మమెద్ది? అట్టి ధర్మమునకు భంగము గలుగకుండ సాయమొనర్చిన మీరు మాకింకఁ జేయవలసిన దేమున్నది? సత్పురుషు లితరులకు మేలు జేసినను దాని నంతనే మఱచిపోవుదురు కాని ప్రగల్భము లాడుదురా? యనెను. తరువాతఁ బుష్పమిత్రుఁడు తాను రాజ్యము నుండి వెడలిపోయినదాది యంతవఱకు జరిగిన వృత్తాంతమును జెప్పుచుండ నా స్త్రీలత్యాశ్చర్యమునొంది యానందబాష్పములు విడువసాగిరి. తరువాత నా స్త్రీ యుగ్మము పుష్పమిత్రుని జూచి 'అయ్యా! మన దేవిగారికే జయమొదవెనా' యనెను. పుష్పమిత్రుఁడు దేవిగారికే జయమొదవెనని చెప్పి వారిప్పుడు చిత్తూరునగరములో ప్రవేశింపఁబోవుదురనియు, తత్సమయమున వారిఁ గలిసికొనవలయుననియుఁ జెప్పెను.

హీరాబాయి సమరావని జయము వహించి పుష్పమాలాలంకార శోభితయై యుదయసింహునిదోడ్కొని యత్యామోదమునఁ జిత్తూరు పురోన్ముఖురాలై వచ్చుచుండెను. పుష్పమిత్రుఁడు మొదలగువారు హీరాబాయినిజూచి యానందమందుచుండిరి. ఆమె వారివైపునకే వచ్చుటగని వారు నలువురొకచోట నిలువబడిరి. హీరాబాయి వారిని సమీపించిన కొలఁది కమలా సుశీలాబాయిల కానందము హెచ్చుచుండెను. ఇంతలో హీరాబాయి వారిదగ్గఱకు వచ్చి వారినిఁ జూచి సదిగాని చూచినంతనే నివ్వెరపాటునొంది దాని నొకభ్రమగాఁ దలఁచెను. తరువాత మరల నిదానముగా నా పురుషులఁ జూచి తన గుఱ్ఱముమీఁదినుండి చివాలున దిగి 'హా! పుష్పమిత్రా! క్షమింపు' మని వాని పాదములపైఁబడెను. తక్షణమే యుదయసింహుఁడును, మిగిలిన సైన్యమంతయు మిగుల నాశ్చర్యము

నొంపుచు హర్షాబ్ధి నోలలాడ సాగిరి. తరువాత వీరాబాయి పుష్పమిత్రుని పాదములనుండి లేచి మేలిముసుగులతో నచట నిలుచుండిన కమలా సుఖలా చంద్రబాలికలఁజూచి మఱింత నాశ్చర్యముగలదియై యా స్త్రీల నిరువురిని గాఢాలింగనముఁ జేసికొనెను. ఇంతలో నీ శుభోదంతము లన్నియు భటులచే మంత్రియగు మిహిరకుమారునికిం దెలియ నాతఁడతి మోదమున భాస్కరసింహునిఁగూడి యశ్వారూఢుఁడై, జయధ్వానములతో జనుదేవారురలం గలిసి, తత్క్షణమె పుష్పమిత్రుని పాదములపై వ్రాలెను. అంతఁ బుష్పమిత్రుఁడు చిరవియోగ దుఃఖతాపముచే నడరు నా పురుషోత్తముల దన బాష్పవారిచేఁ దడిపి, యల్లన లేవనెత్తెను. అప్పటివారి యుత్సాహం బనుభవనీయంబెకాని, వ్రాయనసాధ్యంబు. అపు డా రజపుత్ర వీరు లందఱును విజయానంద విస్మయములతో సింహనాదములఁ జేయుచుఁ బుష్పమిత్రుని వేనోళ్ళఁ గొనియాడుచు నా మంగళాంగులఁగూడి పురప్రవేశముఁ జేసిరి. అంతకుఁబూర్వము తేజోహీనమైన చిత్తూరుపట్టణ మీవిజయవార్తలనువిని మఱల దివ్య తేజము నొందెను. జను లందఱుఁ బరమానందభరితులైరి. వీరాబాయి జయముఁగాంచి విశేషతేజస్విని యయ్యెను. పురవాసులంద ఱా వీర రసపుత్రకులావతంసుల మంగళవాద్యములతో నెదుర్కొని వారిపైఁ బుష్పవృష్టిఁ గురియుచు రాజభవనములోఁ బ్రవేశఁబెట్టిరి.

శ్రీ రా మా ర్ప ణ మ స్తు

శ్రీ శ్రీ శ్రీ